The one and only Magazine devoted to Humor & Music

# హాసం

హాస్య-సంగీత పత్రిక

16 - 31 డిసెంబరు 2001

పేజీలు : 68+8

వెల : రూ.10

సావిత్రి- పింగళి పై
8 పేజీల స్పెషల్
అదనంగా...



సెంటర్‌స్ప్రెడ్‌లో

సుబ్బు భద్రాచలం పాటల పుస్తకాలు



'పాండవ వనవాసం'లో విదురుడుగా



'నవజీవనం'లో



'చక్రధారి'లో



'భక్త రామదాసు'లో



'స్వర్గసీమ' లో



తమిళచిత్రం 'పెణ్'లో

డిసెంబర్ 30 నటుడు, గాయకుడు,
సంగీత దర్శకుడు, నిర్మాత, దర్శకుడు
ఉప్పలదడియం నాగయ్య 28వ వర్ధంతి సందర్భంగా

హాసం



# ఇవీ సంగతులు

## హాస్యం



## సంగీతం



సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
సుబ్బు, భద్రాచలం
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్‌స్ప్రెడ్'లో



భాగ్యచక్రం ఫొటో (66వ పేజీ) సావిత్రి ఫొటోలు (71, 75పేజీలు) ఫొటో కర్టెసీ: సంజయ్‌కిషోర్




ముఖచిత్రం: జూ॥ ఎన్.టి.ఆర్. ('సుబ్బు' చిత్రం నుండి) కవర్ డిజైన్ :ఈరంకి

# ప్రియ జనవాక్యం

హాసం
మందహాసం నుండి అట్టహాసం వరకూ
పలిపలివిధాల పలిమళాలు గుబాళిస్తోంది.
మూస పత్రికలకు బందీలై
మూలుగుతున్న వారంతా హాయిగా
నవ్వి, నవ్విస్తున్నారు.
సంగీత పరంగా కూడా ఇంతవరకూ
ఇంత చక్కగా కొత్తగా - అలాగా!
అనిపించేలా ఎక్కడా రాలేదు.

**-ముళ్లపూడి వెంకటరమణ**

**చెన్నై**

డిసెంబరు 1-15 సంచిక హాసం యిప్పుడే చూశాను. హాసం బాపు బర్త్ డే స్పెషల్ 16 పేజీల బుక్‌లెట్! పేజీకి మూడు కార్టూన్లు, అందులోను బాపుగారి కార్టూన్లు అందించడం నిజంగా సాహస చర్యే! అసలు పుట్టిన రోజున, పుట్టిన అమ్మాయికో అబ్బాయికో మనమేదయినా గిఫ్టు ఇవ్వాలి. పుట్టిన రోజు జరుపుకోబోయే అబ్బాయే మనందరికి 40 పైగా కార్టూన్లు కానుకివ్వటేమిటండి? అన్ని కార్టూన్లు చాలా చాలా బాగున్నాయి. బాపు గారికి పుట్టిన రోజు శుభాకాంక్షలు "హాసం" ద్వారా అందిస్తున్నాను. ప్రస్తుతం హైదరాబాదులోని నిజాం కాలేజీ గ్రౌండ్స్‌లో జరుగుతున్న బుక్ ఎగ్జిబిషన్‌లో బాపు గారిదే ఒక కార్టూను బుక్ చూశాను. మీరిచ్చిన బుక్‌లెటులో వున్నన్ని కూడా లేని ఆ బుక్కు ధర రూ. 40 పైగా వుంది. అంటే హాసం ఇచ్చిన బుక్‌లెట్ ఇంకా ఎక్కువ విలువ చేస్తుంది. కాని రూ.10 లకే బుక్‌లెట్‌తోపాటు ఇంకా ఎన్నో మరెన్నో వివరాలు అందుకొన్నాం. జయదేవ్ గారి కార్టూన్లు 'బుడుగు' మీద కూడా అలరించాయి. శివశంకరీ గురించి చాలా విపులంగా వ్రాశారు. ఆనాటి కళాకారులకు వృత్తి మీద ఆరాధన, ఆర్తి నిజంగా ఎప్పటికీ ఎవ్వరికి ఇక ముందు రాదేమో! ఈసారి సాక్షి వ్యాసం కూడా కొత్త కొత్త పేర్లతో (పాత వస్తువులకు) ఆసక్తి కలిగించింది. గాయని 'టున్‌టున్'కి జరిగిన అన్యాయం ఒకింత బాధ నిపించింది. మాయాబజార్ సన్నివేశం వేయడం ఎక్స్‌లెంట్.

**-జి.ప్రభాకర్‌రావు**, హైదరాబాదు

నవ్వుల స్వయం ప్రకాశవంతుడు
దివాకరబాబు!
'హా....హా' అన్నారు హాసంలో!
".... మంచల్లే హాయిగా నవ్వుకున్నార్ర..." అని
శివపార్వతులు నవ్వుల్ని వర్ణిస్తూ
"నారాయణ... పరమేశా....'' అని నారదుడి
రాకను చెబుతూ
"... మూడు కోట్ల కిరీటాలతో సభ
కిటకిటలాడిపోతుంది...."
అని మనదేవుళ్ల సభాకాంతిని చూపిస్తూ
"బ్రహ్మ సృష్టించలేని నవ్వులని సృష్టించిన
హాస్య బ్రహ్మ...."
అని కీ.శే. జంధ్యాల ఉన్నతిని గుర్తుచేస్తూ
సాహితీ సంపదలతో పచ్చగా వున్న జంధ్యాల
గారి మీద పాశం విసిరారు దేవుళ్లు!...." అని
'హా....హా' అనిపించారు!
ఆ కలానికి ఈ కలం చెప్పిన నివాళి
అందుకున్న జంధ్యాల పైనుంచి "హా...హా" అనడం
మనకు వినిపిస్తే ఎంత బావుణ్ణు! అనిపిస్తున్నది.

-రాంపా, రచయిత, హైదరాబాద్.

'హాసం' 1-15 డిసెంబర్ సంచికలో రాజా రాసిన 'వెల్‌విషర్' కామెడీ స్కిట్ చదివాను. నవ్వించడం మాత్రమే కాకుండా కొన్ని నిజాలు కూడా కనిపించా యందులో. చాలా ఏళ్ళ క్రితం - ఓ అసిస్టెంట్ డైరెక్టర్ స్క్రిప్ట్‌లో 'ఆగాకరకాయ' అని రాసివుంటే అతనికి 'ఆగాకరకాయ' అనే కాయ ఉన్నట్టు తెలీక అది 'ఆ - కాకరకాయ' అని ఫీలయి పోయి సెట్‌లో 'ఆ - కాకరకాయ'ని చూపించ డానికి వీలుగా ఓ కాకర పాదుని తెప్పించి చిన్నహడావుడి చేశాడు. డైరెక్టరు వచ్చి 'ఏంటయ్యా నువ్వ చేస్తున్న గొడవ!?' అని అడగ్గా అతను 'హీరోయిన్ కళ్ళు ఆ కాకర కాయల్లా ఉన్నాయి అని హీరో అన్నట్టుగా స్క్రిప్ట్‌లో వుంది, అతను చూపించడానికి వీలుగా కాకరపాదు, దానికి చిన్న కాయలు పెట్టిస్తున్నాగా' అని అనగా ఆ డైరెక్టరు నవ్వలేక ఏడ్వ్బి నానా చివాట్లు పెట్టి "అది ఆ కాకర కాయ కాదయ్యా 'అగాకరకాయి' అని ఒక్క పదమే" అని కేకలేశాడు. ఇది నిజంగా జరిగిన సంఘటన. ఈ 'వెల్‌విషర్' కామెడీ స్కిట్‌లో వాస్తవానికి సంబంధించి నవ్వొచ్చేట్టుగా అలాటివి చాలా కనిపించాయి. అలా చాలా నవ్వించాయి. ఇలాటి స్కిట్‌లు ఇంకా వేస్తే బావుంటుంది.

**-సత్యానంద్,**
సినీకథ - సంభాషణల రచయిత

1-15 డిసెంబర్ 2001 ది "హాసం" పత్రిక పవన్ హాసంతో చాలా చూడముచ్చటగా వుంది. అమర గాయకుడు కీ.శే. ఘంటసాల గారి గురించి తెలియని విషయాలెన్నో తెలియజేసారు. ఆ మహోన్నతునికి మీరిచ్చే నివాళి మాకందరికి సూక్తి ముక్తావళి - అదే విధంగా బొమ్మల బాపుగారి కార్టూన్స్‌తో బాపు బర్త్‌డే స్పెషల్ అనుబంధం కడుపుబ్బ నవ్వించింది. బాపు గారి మూడు వయసుల ముఖచిత్రం నచ్చింది. కాకపోతే - ఆయనగారి జీవిత విశేషాలతో ఒక వ్యాసం ప్రచురించి ఉంటే ఇంకా బాగుండేది. మత్తు పాటలతో యువతరాన్ని ఉర్రూతలూగించే గమ్మత్తయిన స్వర సామ్రాజ్ఞి ఎల్లరి ఈశ్వరి ఎల్లారీశ్వరిగారికి జన్మదిన శుభాకాంక్షలు తెలిపారు. కానీ వ్యాసంలో మరిన్ని వివరాలు తెలియ జేయవలసింది. సినీ రచయిత శ్రీ మరుధూరి రాజా గారి 'కామెడీ రైటర్ ట్రాజెడీ' కథ చాలా బాగుంది. ఈ కాలంలో మంచికిపోతే చెడే ఎక్కువ ఎదురౌతుందని చక్కగా వివరించారు.

-కోనేరు ఆదినారాయణరావు, తర్లాగడివూరు.

ప్రతి సంచిక ఆణిముత్యంలా వుంది. ముఖ్యంగా ప్రముఖ చిత్ర రచయితల ద్వారా నవ్వులు పూలు పూయిస్తున్న మీ 'శ్రమ' అమోఘం.

అయితే కొత్త రచయితలకు అవకాశం ఇవ్వాలని కోరుచున్నాం. హాస్య కథల వాసి - రాశి ఇంకా పెంచా లని ఆశిస్తున్నాం. 'హాసం.... ఆంధ్రుల దరహాసం కావాలని మనసారా కోరుకుంటున్నాం.

-రవి, రఫీ, గూడూరు

ప్రారంభ సంచిక నుంచి 'హాసం' చదివి ఆనంది స్తున్నాను. డిసెంబరు 1-15 సంచిక మరి ఎంతో ఆనందాన్ని కలిగించింది. ముఖ్యంగా శివశంకరీ (జగదేకవీరుని కథ) పాట గురించి అభిమానికి ఎంతో సంతోషం కలిగింది. ఈ సంచికలోనే ఘంటసాల గారు రాసిన వ్యాసం తిరిగి ప్రచురించారు. ఘంటసాల, పెండ్యాల యిలాగా అరుదైన వ్యాసాలు కాని, ఉత్తరాలు కాని రాబోవు సంచికలో ప్రచు రించగలరని ఆశిస్తున్నాము. లలితసంగీతం శీర్షికలో ఎం.చిత్తరంజన్‌గారి నోట్స్ ఎంతో ఉపయోగకర మైనది. అలాగే వి.ఎ.కె రంగారావు గారు "సరాగ మాల" శీర్షిక గతంలో ఎప్పుడో నేను పుట్టక ముందు వచ్చిన శీర్షికలు. అవి యీనాడు మాకు లభ్యం కావు. మీరు 'హాసం'లో ఒక పేజీ కేటాయించి ఆనాటి సంగీత ముచ్చట్లు తెలియ జేయగలరని ఆశిస్తున్నాము. చివరగా ఎల్.ఆర్.ఈశ్వరి వ్రాస్తూ ఒక పంక్తిలో సత్యంగారు రౌడీరాణిలో ఏస్కోకొకో కోలా లాంటి వెరైటీ క్లబ్ సాంగ్ పాడించారని శ్రీ విక్రమ్ వ్రాశారు. కాని ఆ పాట రౌడీరాణి చిత్రంలోనిది కాదు. రౌడీలకు రౌడీలు చిత్రంలోనిదని గమనించ గలరు.

-వెంకట రాజన్, చిల్లకల్లు, కృష్ణాజిల్లా.

ఒకే కొబ్బరి కాయకు రెండు చిప్పలుండు చందాన నాకెంతో ప్రియమైన హాస్యం, సంగీతం రెండూ కలగలిపిన 'హాసం' మొదటి సంచిక నుండే కొని, చదివి అపురూపంగా భద్రపరుచుకుంటున్నాను 'చందమామ', 'రచన' పత్రికల సరసన.

అప్పుడెప్పుడో హాస్యానికి పెద్దపీట వేసిన 'హాస్యప్రియ' తరువాత అంతగా నవ్విస్తున్న పత్రిక 'హాసం' మాత్రమేనని చెప్పడానికి ఎన్నో గుండెలు అక్కర్లేదు.

-కోనేనాగ వెంకట ఆంజనేయులు, విశాఖపట్నం,

సంపుటి :1 సంచిక: 6

16-31 డిసెంబరు 2001

పేజీలు : 76 వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 6

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూధన శర్మ

ఏదైనా వస్తువు ఉత్పత్తి చేసినవాడికి, వినియోగదారుడికి మధ్య ఎన్నో సోపానాలు ఉంటాయి. ఒక్కోప్పుడు అవి అవరోధాలు కూడా అవుతూంటాయి. అవన్నీ దాటుకుంటూ రాగలిగినప్పుడు మాత్రమే వస్తువు కావలసిన వారికి చేరుతుంది. వారికి, వినిమయం చేసిన వారికి తృప్తిని ఇస్తుంది. ఉత్పత్తిదారుడికి లబ్ధిని చేకూరుస్తుంది. కవి రాసిన కవిత ఎన్ని చేతులు సాయం పడితే పాఠకుడికి చేరుతుందో ఒక్కసారి ఆలోచించి చూడండి. సంపాదకుడు, ముద్రాపకుడు, పంపిణీదారు, ఏజెంటు, పుస్తకాల దుకాణదారు - ఇంతమంది సహకరించాలి. అదీ వివిధ దశలలో రవాణా సరిగా జరిగితేనే!

సమాచారం ఒకరినుండి ఒకరికి సరఫరా కావడానికి జరిగే ఈ ప్రక్రియను సాఫీ చేసినది ఇంటర్‌నెట్. ఇంటర్‌నెట్ అనే మాట చాలా ప్రచారంలోకి వచ్చింది. కానీ దాన్ని వాడేవాళ్ల శాతం చాలా తక్కువగానే ఉంది. యువతీ యువకులు ఉపయోగిస్తున్నంతగా తక్కినవారు దాన్ని వాడటం లేదు. యువత కాని వారు కూడా వృత్తిపరంగా వాడుతున్నవారే తప్ప మామూలు జనాభా దాని జోలికి ఇంకా పోవటం లేదు. ఇంట్లో కంప్యూటర్లు ఉన్నవారు తక్కువ. దానికి ఇంటర్‌నెట్ కనెక్షన్ పెట్టించుకున్న వారు మరింత తక్కువ. సైబర్ కేఫ్‌కి వెళదామంటే అశ్లీల చిత్రాలు చూడడానికి వెళుతున్నారనుకుంటారనే భయం. దానాదీనా ఇంటర్‌నెట్ అనేది కుర్రకారు చాటింగ్‌కి తప్ప మరి దేనికి పనికిరాదన్నట్టు అయిపోయింది.

కానీ పుస్తకరూపంలో పత్రిక లభ్యం కాని వారి పాలిట వరం ఇంటర్‌నెట్, పల్లెటూరయినా కావచ్చు, ప్రవాసమైనా కావచ్చు. ఇంటర్‌నెట్ సౌకర్యం ఉందంటే వెబ్‌సైట్‌కి వెళ్లి ఆ పత్రికను చూడవచ్చు. చదవవచ్చు. పాత సంచికలను కూడా పరామర్శించవచ్చు. నచ్చితే ప్రింటు తీసుకుని పెట్టుకోవచ్చు. తెలుగువారి సంగతి తీసుకుంటే సుమారు 80 దేశాలలో తెలుగువారున్నారు. వారికి అచ్చువేసిన పత్రికలు చేర్చడం చాలా కష్టమైన పని. వారి అడ్రస్సులు సంపాదించడం ఓ కష్టమైతే, వారికి పోస్టులో పంపడం ఖర్చుతో కూడిన వ్యవహారం. అవి వారికి అందేనాటికి అందులోని విషయం పాతబడిపోతే చదవబుద్ధికూడా కాదు. తెలుగు పత్రికలు ఇంటర్‌నెట్‌లో లభ్యం చేస్తే వారికి ఎంతో ఉపకారం చేసినట్టే!

ప్రముఖ పత్రికలలో రెండు దినపత్రికలు, ఒక వార పత్రిక మాత్రం ఇప్పటి వరకు ఇంటర్‌నెట్‌లో లభ్యమవుతున్నాయి. గత పక్షం నుండి "హాసం" కూడా వెబ్‌జైన్ రూపంలో ఇంటర్‌నెట్‌ను అలంకరిస్తోంది. WWW.HAASAM.COM అని URL కొడితే హాసం సంచిక కంప్యూటర్‌పై సాక్షాత్కరిస్తుంది. మామూలు పత్రికలకు భిన్నంగా, పేజీల వారీగా ఈ వెబ్‌జైన్ రూపొందించబడింది. ఒకసారి సైట్‌కి వెళితే 150 పేజీల సమాచారం మీ కళ్లముందు కనబడుతుంది. విషయ సూచికలోనే మొత్తం ఆర్టికల్స్ వివరాలు, అక్కణ్నుంచి కావలసిన ఆర్టికల్‌కు సరాసరి వెళ్లిపోయే సౌకర్యం ఉన్నాయి.

ప్రస్తుతం 'హాసం' ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే పంపిణీ అవుతోంది. ఇతర రాష్ట్రాలలో గానీ, ఇతర దేశాలలో గానీ ఉన్న మీ ప్రవాసాంధ్ర మిత్రులకు 'హాసం' గురించి విషయం పరిచయం చేయడానికి 'హాసం' వెబ్‌జైన్ గురించి వారికి తెలియ పరచగోర్తున్నాము. వారి 'ఈ మెయిల్' అడ్రసులు మాకు తెలియబరిస్తే మేము వారిని సంప్రదిస్తాం. మాతృదేశానికి దూరంగా ఉన్న వారికి మన సంగీత సాహిత్యాలపై మరింత మక్కువ ఉంటుంది కాబట్టి 'హాసం' వారిని అలరిస్తుందని, పరిచయం చేసినందుకు మిమ్మల్ని అభినందిస్తారని మా నమ్మకం.



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

# కిచెన్‌కిట్



-చింతపల్లి రమణ



రాయటంలో ఫాస్ట్....
జోకులు పేల్చటంలో ఫాస్ట్....
డైలాగుకి డైలాగుకి
మధ్య ఊపిరి తీసుకుంటే
అద్భుతమైన 'పంచ్'
మిస్సయిపోతామేమోనన్నంత ఫాస్ట్...
ఇవన్నీ ఇండస్ట్రీలో అతి ఫాస్ట్‌గా
పైకొచ్చిన చింతపల్లి రమణ
ప్రత్యేకతలు....
అందుకు సుస్వాగతం, తొలిప్రేమ,
తమ్ముడు, ప్రియమైన నీకు,
ఆనందం చిత్రాలే సాక్ష్యంగా
నిలబడతాయి.
'కనిపించని రాంబాబు'తో
'ఆనందం' సినిమాలో చెడుగుడు
ఆడుకుని ప్రేక్షకుల్ని కేరింతలు
కొట్టించిన చింతపల్లి రమణ ఈ
కథలో 'కనిపించే రాంబాబు'తో
మరో టైపు కామెడీని పంచాడు.
కనుక ఈ కథపై మీ అభిప్రాయాన్ని
నేరుగా ఈ కింది అడ్రసుకి
పంపండి.


**చింతపల్లి రమణ,**
**డి-8-231/ఎ/458,**
**శ్రీ కృష్ణానగర్, యూసుఫ్‌గూడ,**
**హైదరాబాద్ - 45**


చింతపల్లి రమణ మెప్పు పొందిన ఉత్తరాన్ని పంపిన వారికి 'హాసం' పత్రిక ఆరు నెలల పాటు ఉచితంగా పంపిస్తాం.

నవ్వుతూ బతికేలా ఉండే సత్యానంద్ గారి లాంటి
పెద్దలందరి గారాల్లో కథల రచయితగా ఎదిగిన
హాసం పత్రికలో రాంబాబు వాయిస్ గారి లాంటి
కథ రాయడానికి అవకాశం లేదు. నా చేతి నుంచి
రచయితలు రాసిన కథలు చదివే అవకాశం
కలిగించిన హాసం వారికి కృతజ్ఞతలు. ముఖ్యంగా
హాసం పత్రికలో ప్రచురించిన నా ఇంకొక కథ - కిచెన్‌కిట్!

చింతపల్లి రమణ
13/12/01

"నవ్వుతూ బతకాలిరా"
అని ఎవరైనా అంటే
"పక్కవాడి ఏడుపు చూశా" అంటాడు రాంబాబు.
ఈ రాంబాబెప్పుడూ నవ్వుకు దూరంగా ఏడుపుకు దగ్గరగా బ్రతికాడు.
అంటే ఏడుస్తూ బ్రతికాడని కాదు. ఏడిపిస్తూ బ్రతికాడు.
రాంబాబుకి -యుకేజికి కొబ్బరిలౌజ్‌కి తేడా తెలియని
అయిదేళ్ళ వయసులో...
చెల్లెలితో ఇంట్లో ఆడుకుంటుండగా
తెలుగు కథల్లో అనాదిగా వస్తున్న ఆచారం ప్రకారమే
పక్కింటావిడ పంచదార కోసం గిన్నెతో
రాంబాబు ఇంటిలోకి అడుగుపెట్టింది.
ఆవిడ పేరు ఉష. ఆవిడ కొన్నాయన 'ఉష్' అని ముద్దుగా
పిలుచుకుంటాడు.
అతన్ని కన్నావిడ 'ఉష్' అంటూ నిట్టూరుస్తుంది.
ఈ 'ఉష్' ఇంట్లోకి రాగానే చెల్లాయితో ఆడుకుంటున్న
రాంబాబు ఆవిణ్ణి చూసి వంటింట్లో ఉన్న వాళ్ళమ్మతో
"అమ్మా నువ్వెప్పుడూ పనికిమాలిందని
అంటూంటావే ఆవిడొచ్చింది" అని కేకవేశాడు.
అంతే. ఉష్ కంట్లో కసి ఒంట్లోంచి బయటికి
కసుక్కున తన్నుకొచ్చింది. అప్పుడావిడ చేతిలో
గిన్నె బదులు గన్నుంటే ఆ ఉష్ -బుష్ అయ్యేది.
ఆ బుల్లెట్లు గురితప్పకుండా లయబద్ధంగా
గన్‌గన్ ధనాదన్ లాడెన్!
గన్ లేకపోతే ఏంటి?
నరం లేని నాలుకుంది. డబుల్ బారెల్ గన్ కంటె పవర్‌ఫుల్.
ఉష్ కస్సుబుస్సుమంటూ కదం తొక్కుతోంది.
రాంబాబు అమ్మ మాత్రం తక్కువ తిందా. తప్పు కప్పి పుచ్చుకోటానికి
కప్పు ఎగిరి పోయేలా నిప్పుమీద చిందులు తొక్కినట్టు
శివాలెత్తి పోయింది.
అసెంబ్లీ లెవెల్లో మొదలైన రభస కొళాయి దగ్గర కొట్లాట వరకు
దిగజారింది.
'అసెంబ్లీలో అన్ పార్లమెంటు'ను చూడ్డానికి ప్రేక్షకులు
పెరిగిపోయారు.
'తిట్టుకు తిట్టు'
'శాపనార్థానికి శాపనార్థం'
'రూమరుకి రూమరు'
కన్నీళ్ళొస్తున్నా అవి చెమటగా కలరిచ్చి పవిటకొంగుతో తుడుచుకొంటూ,

ఉడుక్కుంటూ  కచ్చాలు బిగిస్తున్నారు కలర్ కన్నీళ్ళతో. అలా అప్పుడు ఆ వయసులో ఇద్దరి ఆడవాళ్ళ కన్నీటికి కారణమయ్యాడు రాంబాబు.

మరి కొన్నాళ్ళ తర్వాత :

రాంబాబు నాన్న వీధి అరుగు మీద కూర్చుని
గెడ్డం గీసుకుంటున్నాడు. పక్కనే కూర్చుని గమ్మత్తుగా
చూస్తున్నాడు రాంబాబు.

అప్పుడా పిల్లాడి చిన్న పెద్ద మెదడులో బోలెడన్ని ప్లానులు.

'నేను తొందరగా పెద్దాణ్ణవ్వాలి. గెడ్డం గీసుకోవాలి.'

నాకు, చెల్లెలికి గెడ్డం గీసుకోవటానికి నాన్నగారు బ్లేడులు
తీసుకొస్తే
బిస్కెట్లు కాజేసినట్టు చెల్లెలి బ్లేడులు కాజేసెయ్యాలి.

నేను గెడ్డం గీసుకుంటుంటే చూసి చెల్లి కుళ్ళు కోవాలి.

ఇవి అతని ఫ్యూచర్ షేవింగ్ ప్లాన్స్.

రాంబాబు నాన్న తాలూకు రేజరులోని ఓల్డ్ బ్లేడు గోడు పెడుతుంది.

అతను షేవింగ్ చేసుకున్నట్టు లేదు. రంపం మిల్లు నడుపుతున్నట్టుంది.

ఆ రంపం మిల్లు రొదలో ఆ వీధిలో ఒకమ్మాయి చలాకిగా నడుస్తూ వస్తోంది.

ఆమె పేరు కుంజన.

ఆ పేరుకి అర్థం ఆ అమ్మాయికి తెలీదు. పేరు పెట్టిన తల్లికీ తెలీదు.

తన అత్తగారి పేరు పెట్టకూడదు అంతే! తన తోడికోడలు
కూతురు సంజన పేరుకి ఏ మాత్రం తగ్గకూడదు
అంతంతె... తంతె!!

కుంజన పేరుకి తగ్గట్టు... కాదు మనిషికి తగ్గట్టు బొద్దుగా ఉంటుంది!!

టెలిఫోన్ డైరెక్టరీ బుక్‌లా ఉంటుంది...!

మాల్గాడి శుభ గొంతులా ఉంటుంది...!

ఆ అమ్మాయి గెడ్డం గీసుకుంటున్న రాంబాబు తండ్రి ముందు నుంచి పాస్ అవుతుంటే అనెక్స్పెక్టెడ్‌గా ఆ అమ్మాయిని చూసి రంపం మిల్లు ఒక్కసారి ఆపు చేసి 'దలేర్ మెహందీ తలపాగాలా భలేగావుంది' అనుకున్నాడు. అనుకుని మళ్ళీ తన సామిల్లు స్టార్ట్ చేసాడు.

వీధి చివర
కూరగాయలమ్మి కేక వినబడి
రెండో విడత గెడ్డానికి సబ్బు పెట్టుకుంటున్న రాంబాబు బాబు
అద్దంలోకి చూస్తు కేక వినపడిన వైపు చేయి చూపించి రాంబాబుతో "ఆవిణ్ణి పిలవరా" అన్నాడు. రాంబాబు తండ్రి చేయి చూపించిన వైపు చూసాడు. ఆ సమయానికి కూరగాయలావిడ వీధి మలుపు తిరిగి వెళ్ళిపోయింది.

ఆ స్థానంలో కుంజన వెళుతూ కనబడింది. అది చూసిన రాంబాబు హుషారుగా పరుగెట్టుకుంటూ వెళ్ళి కుంజన ఎదురుగా ఆగి " మా నాన్న నిన్ను రమ్మంటున్నాడు" అన్నాడు

"నన్నా ఎందుకు!?"అంది కుంజన.

"బావున్నావుగా అందుకని" అన్నాడు సినిమాల్లో అతిగా మాట్లాడే చిన్నపిల్లల ఇన్‌స్పిరేషన్‌తో.



"ఏంటి!?" అని మళ్ళీ రెట్టించింది.

"బావున్నావని" అన్న రాంబాబు మాట పూర్తయ్యేలోగా
కుంజన రాంబాబు బాబు 'గెడ్డం' ముందుంది.

ఆమెను చూసి "ఏంటి తలపాగా మళ్ళీ వచ్చింది!?" అనుకున్నాడు రాంబాబు బాబు.

"రమ్మన్నావంట!?" అంది కళ్ళు ఎర్ర బెట్టుకుంటూ.

"నేనా!?" అని ఆశ్చర్యంగా రేజరుపైనున్న భృకుటి ముడిచాడు. రాంబాబు బాబు.

"నాగురించి నువ్వేం అనుకుంటున్నావు" అంది తలెగరేస్తూ.

"తలపాగావని" అనబోయి నాలిక కరుచుకొని
"నువ్వు పొరబడుతున్నావు" అన్నాడు.

"నీ కళ్ళకి నేను కబురుపెడితే వచ్చే దాన్లా కనబడ్డానా!?" అంది.

"కబురు పెట్టకపోయినా వస్తావన్నమాట" అన్నాడు -నాకూ చమత్కారం తెలుసన్నట్టు.

"ఒళ్ళు దగ్గర పెట్టుకు మాట్లాడు. అణాకాని దాన్లా కనబడుతున్నానా యమ్మెస్

## భర్తృహరి సుభాషితాలు

బొమ్మలు: బాలి

**ఏదైనా వస్తువు కొనడం విషయంలో  తెలివైన భర్తలు భార్యలతో వాదనకు దిగరు. వాదనలో ఓడిపోయిన భార్యను ఊరుకోబెట్ట డానికి దాని కంటె ఎక్కువ ఖరీదైనది కొనాల్సివస్తుందని వాళ్లకు తెలుసు.**




**భార్యతో
మాట్లాడేటప్పుడు
ఒకటికి రెండుసార్లు
ఆలోచించి, చివరికి
నోరువిప్పనివాడే
అసలైన భర్త!**



సుబ్బలక్ష్మి లాంటి నాతో యమ్మెస్ నారాయణలా నీ పరాచికాలేంటి" అంది ఆవేశంగా.
"యిదిగో అమితా బచ్చన్లాంటి నామీద నిందవేసి అమ్జాద్‌ఖాన్‌ని చేయకు" అన్నాడు రాంబాబు బాబు అంతకంటే ఆవేశంగా.
"బుకాయించకు. నన్ను రమ్మని నీ కొడుకుతో కబురు పంపించలేదూ!?" అంది తప్పించుకోలేవన్నట్టుగా.
తండ్రి రాంబాబు వంక చూశాడు. వాడు బిత్తర చూపులు చూస్తున్నాడు.
జరిగిన పొరపాటు గ్రహించి కుంజన వైపు తిరిగి "చిన్న పొరపాటు జరిగింది. నేను వాడితో కబురు పంపించింది నీ కోసం కాదు. కూరగాయలమ్మి కోసం."
"అంటే నాకంటె కూరగాయలమ్మి అందంగా ఉందా.. దానికి కబురెట్టావ్!?, అనకుండానే ఎన్నేసి మాటలంటున్నావ్!?" అంది.
తను కూరగాయలమ్మి కంటె తీసి పోయానని, దాని కాలిగోటి పాటి చేయనని, తన అందం అతన్ని ఒక్క పిసరు కూడా కదిలించలేక పోయిందన్న ఫీలింగ్‌తో రెచ్చిపోయింది. అందం అనే వీక్ పాయింట్ మీద దెబ్బతీసాడన్న అపోహతో నిజానిజాలు గ్రహించకుండా స్థిరం తప్పి ఉడుకుమోత్తనం ఒచ్చేసి ముక్కు చీదుకుంటూ విసురుగా వెళ్లిపోయింది.
అలా ఓ అమ్మాయి అందమైన కన్నీటికి కారణమయ్యాడు రాంబాబు.



రాంబాబు ఒంటి మీదకి ఏళ్ళొచ్చాయి. నిక్కర్లు పోయి ప్యాంట్లొచ్చాయి. వీపుమీద మోతలు పోయి చేతులకి పుస్తకాలొచ్చాయి. అతను చేసే రీసెర్చిలకు త్వరలో యూనివర్సిటీ గోల్డ్ మెడల్స్ కూడా వస్తాయి. రాంబాబు తన ఫ్రెండ్సుతో గోల్డ్ మెడల్స్ గురించి చెప్తే వాళ్ళందరూ నవ్వుతారు.
"బోడి గోల్డ్ మెడల్ కోసం గోల్డెన్ డేస్‌ను ఎందుకురా వృధా చేసుకుంటావు!? ఓ ఫ్రెండూ లేదు, ఓ ప్రేమా లేదు. మేము చూడు లవర్స్‌ని మార్చేయడంలో అప్పుడే సెంచరీలు సాధించబోతున్నాం. ప్రేమను చవిచూడని వాడు వేస్ట్. నిన్ను చూసి యూనివర్సిటీ గోడలు కూడా నవ్వుతున్నాయి" అని విపరీతంగా మోసేశారు.
రాంబాబుకి కడుపులో అరటి పండు పిసికినట్లయింది. నన్ను చూసి గోడలు నవ్వుతున్నాయా, అని అనుకుంటుంటే చెట్టుమీద కాకి కిసుక్కున తుమ్మింది.
రాంబాబుకి ప్రేమించకూడదని నియమమేమి లేదు. కాని అమ్మాయిల స్కేర్సిటీ వల్ల ఆపని చేయలేక పోయాడు. యిక ఊరుకో కూడదు. సాధ్యమైనంత త్వరలో ఒకమ్మాయిని ప్రేమించి యూనివర్సిటీ గోడల నోరు మూయించాలి. లేకపోతే ఫ్రెండ్స్ ముందు పెన్ను ఎత్తుకోలేం అని ఒక స్ట్రాంగ్ నిర్ణయం తీసుకొని ప్రేమ సినిమాలు చూడ్డం మొదలెట్టాడు. ప్రేమించడానికి ఒకమ్మాయిని సెలక్ట్ చేసుకున్నాడు.
ఆ అమ్మాయి పేరు కాంచన. తల్లి దండ్రులు ఆ అమ్మాయికి ఆ పేరు పెట్టడంలో తొందరపడ్డారు. ఏ వైదేహి అనో సరస్వతి అనో పెట్టాల్సింది. అంత బాగా చదువుకుంటుంది.
యింకా యింకా చదవాలి
ఆ చదువుల సారంతో దేశంలో ఉన్న
బాల కార్మికులను బానిసత్వం నుంచి
బయటకు లాగి బాల మేధావుల్ని తయారు చెయ్యాలి.
దానికోసం పెళ్ళైనా మానుకోవాలి.
ఇవి ఆ అమ్మాయి ఆలోచనలు, ఆశయాలు.
రాంబాబుది రాంగ్ సెలక్షన్. ఆ విషయం అతనికి తెలీదు. క్లాసులో ప్రొఫెసర్‌ని చూడటం మానేసి కాంచననే చూస్తుండేవాడు. కాంచన మాత్రం యితన్ని చూసేది కాదు. యిలా కాదని ఆమె యింటి ముందు తచ్చాడటం మొదలెట్టాడు. అయినా ఆమె చూడలేదు. కానీ వాళ్ళ నాన్న చూశాడు. యిలా కాదనుకుని

## భర్తృహరి సుభాషితాలు

బొమ్మలు: బాలి



భర్తల కంటే భార్యలు తెలివైనవారు. వారికి తెలిసింది తక్కువ, కానీ అర్థం చేసుకునేది ఎక్కువ!

ఒక భర్త భార్యకోసం కారు డోరు తెరిచి పట్టుకున్నాడంటే దాని అర్థం - కారైనా కొత్తదై ఉండాలి, లేదా భార్యైనా కొత్తదై ఉండాలి.





ఒక స్త్రీ పెళ్లి చేసుకున్నాక భర్తను మార్చడానికి ఎంతో ప్రయత్నిస్తుంది. తీరా అతను మారేక ఆమెకి నచ్చడం మానేస్తాడు.

నాలుగు వారపత్రికలు చూసి ఒక లవ్ లెటర్ రాసి కాంచన చూడకుండా ఆమె పుస్తకంలో పెట్టాడు. దాన్ని కూడా సదరు నాన్న చూశాడు.

ఆ తర్వాత వారం రోజులుగా కాంచన క్లాసుకి రాలేదు. రాంబాబు తట్టుకోలేక ఆమె ఫ్రెండ్ దగ్గర ఆరా తీసాడు. విషయం తెలుసుకొని తలదించుకున్నాడు. లెటరు చదివిన కాంచన తల్లిదండ్రులు కాంచన తప్పేంలేదన్నారు. వయస్సులో ఉన్న అమ్మాయిని చదివించడం తమ తప్పు అన్నారు.

"ప్రేమకు త్యాగం తెలుసు, తెగింపు తెలుసు. ఆ అబ్బాయి నువ్వు కాదంటే యాసిడ్ తాగుతానంటాడు. లేకపోతే యాసిడ్ మీద పోస్తానంటాడు. అల్లరి మూకను ఇంటి మీదకి పంపుతాడు. రోజూ ఎన్ని పేపర్లు చూడట్లేదు. కాబట్టి ఈ సమస్యకి పరిష్కారం ఒక్కటే ఇంతటితో నీ చదువు ఆపు చేసేయ్. అర్జెంటుగా నీ పెళ్ళి చేసేస్తాం" అన్నారు. కాంచన బెంబేలు పడిపోతూ తన ఆశయమేంటో చెప్పుకొంది.



'మీరు సమస్యను భూతద్దంలోంచి చూస్తున్నారు' అంది. 'కాదమ్మా పరువు మర్యాదలోంచి చూస్తున్నాం' అన్నారు తల్లిదండ్రులు. 'నేను పెళ్ళి చేసుకోను. బెంగుళూరులో ఉన్న అక్కయ్య వాళ్ళింట్లో చదువుకుంటాను' అంది. 'అక్కడ మాత్రం ప్రేమించని కుర్రాళ్ళు ఉండరని నమ్మకమేంటి' అన్నాడు తండ్రి. కాంచన ఎంత చెప్పినా వినకుండా ఏలూరు తీసుకువెళ్ళి అక్కడున్న తన బావమరిదికిచ్చి పెళ్ళి చేసేశాడు. మెళ్ళో తాళి పడుతూ ఉంటే బాల కార్మికులకంటే ఎక్కువగా కుళ్ళి కుళ్ళి ఏడ్చింది కాంచన. ఆ రకంగా ఇంకో అమ్మాయి కన్నీళ్ళకి కారణమయ్యాడు రాంబాబు.

ఇంట్లో రాంబాబు స్థిమితంగా ఉండలేక పోతున్నాడు.

"తెలీక తప్పుచేసింది నేను. నిప్పును నేను ముట్టుకుంటే గాయం ఆ అమ్మాయికి అయ్యింది. ఆమె ఆశలు, ఆశయాలు ఒక్క లెటరుతో చంపేశాను. బాలకార్మికుల్ని బానిసత్వం నుంచి విడిపించాలని అనుకొంది. కాని తనే బానిసగా మారిపోయింది. నా లాంటి వాళ్ళు చేస్తున్న ఆకతాయి పనులకు ఎన్ని మెదళ్ళు వంటింట్లో మొద్దుబారి పోతున్నాయో" అని బాధపడ్డాడు.

ఈ బాధ పోవాలి ఎలా...!?

ఇంతమందికి ఆడవాళ్ళకి చెడుచేసిన తను మొత్తం ఆడవాళ్ళందరికి మంచి చేస్తేనే ఈ బాధ పోతుంది. అని ఆలోచించి ఆలోచించి అహోరాత్రులు శ్రమించి లైఫ్‌లో సెలవంటూ లేకుండా ఎప్పుడూ శ్రమించే ఆడవాళ్ళకి శ్రమ తగ్గించడం కోసం ఒక 'కిచెన్ కిట్' కనిపెట్టాడు. ఆ 'కిచెన్‌కిట్' వుంటే హాడావిడిగా తిరుగుతూ యింట్లో పనులన్నీ చక్కపెట్టవలసిన అవసరం లేదు. హాయిగా 'టి.వి' ముందు కూర్చుని మీట నొక్కితే అదే ఆ పనులను చేస్తుంది. ఇక ఆడవాళ్ళకి హైరానాలుండవు. హడావుడులుండవు. ఎప్పుడూ శ్రమ పడిపోవలసినవసరం లేదు. మార్కెట్లో ఈ అయిటం వేల్యూ పదివేలు. అయితేనేం ఆడవాళ్ళు సుఖపడతారు, అని అనుకున్నాడు. అలా అనుకున్నదే తడవుగా ఎందుకైనా మంచిదని తెలిసిన ఓ పెద్దమనిషికి చూపించాడు. ఆయన ముఖం 'ఆనందం'తో వెలిగిపోయింది. 'ఆనందం...దం...దం...'అంటూ టీవీ ఎడ్వర్టయిజ్‌మెంట్‌లో వచ్చినట్టు పాడేశాడు అతగాడు. అన్నట్టు అతను ఎం.బి.బి.యస్ ! అలా అతని కళ్ళల్లో ఆనందాన్ని చూసిన రాంబాబు 'ఇష్టం'గా పేపర్లని మర్నాడే సబ్‌మిట్ చేయాలనుకున్నాడు. కాని మర్నాడు చెల్లెలికి పెళ్ళి చూపులుండడం వల్ల రెండో రోజుకి వాయిదా వేసుకున్నాడు.

పెళ్ళి చూపులు చెడిపోయాయి. అబ్బాయికి అమ్మాయి నచ్చింది
అమ్మాయికి అబ్బాయి నచ్చక్కర్లేదు. అయినా చెడిపోయాయి.
కారణం... కట్నం...!!!
మనిషి సృష్టించిన డబ్బుకోసం
మనిషి సృష్టించిన మోటార్ బైక్ కోసం
మనిషి సృష్టించిన టి.వి కోసం
మనిషి సృష్టించిన ఫ్రిజ్ కోసం
మనిషి సృష్టించిన కూలర్ కోసం
రేపట్నించి తను సృష్టించిన 'కిచెన్ కిట్' కోసం
ఆడపిల్లను ఏడిపించడానికి ఎన్ని ఆయుధాలు
సృష్టించుకున్నాం.
చలం ఆడదానితో బాపు
సీతతో
పినిశెట్టి పల్లె పడుచుతో
భరణి పరికిణీతో
కన్నీళ్ళు పెట్టించడానికి
తాను సైతం
కన్నీటికి ఆయుధాన్ని
ధారపోయడం యిష్టం లేక
ఫార్ములా పేపర్స్‌ని చించి పడవలు చేసి
కన్నీటితో వర్షం నీటిలో వదిలేసాడు. ఎందరో ఆడవాళ్ళ కన్నీటిని తుడవాలనుకున్న రాంబాబు ఈసారి ఓ మగవాడి కన్నీటికి కారణమయ్యాడు. ఆ మగవాడెవరో కాదు... రాంబాబు ఫార్ములా పేపర్స్‌ని మొదటిసారి చూసిన ఎం.బి.బి.యస్. పెద్దమనిషి...!!

అన్నట్టు చెప్పడం మర్చిపోయా... ఎం.బి.బి.యస్. అంటే డాక్టర్ డిగ్రీ కాదు... 'మెంబరాఫ్ భార్యా బాధితుల సంఘం'...!!!

★

## భర్తృహరి సుభాషితాలు

బొమ్మలు: బాలి




ఒక మగాడికి తన జ్ఞాపకశక్తి చాలా ఉపయోగపడుతుంది. భార్య పుట్టినరోజు అంతకుముందు రోజే అయిపోయిందని అతనికి గుర్తుకొచ్చేది ఈ జ్ఞాపకశక్తి మూలంగానే!

మా ఆయన్ని పుస్తకంలా చదివేయగలను అనే ఆవిడ చదివే తీరు కాస్త తేడాగా ఉంటుంది. సాధారణంగా పుస్తకంలో నచ్చని పోర్షన్లు మనం వదిలేస్తాం. కానీ ఆమె పదేపదే చదువుతూ ఉండేది ఆ పోర్షన్లే!!





# 16-30 నవంబరు 2001లో శ్రీ సత్యానంద్ రాసిన 'ప్రయి'వేటు' మాస్టారు కథకు వచ్చిన స్పందన

ప్రయివేటు మాస్టారు - కథలో సుందర్రావుకి పేరు దగ్గరనుంచి ముష్టివాడు ముష్టి అడిగిన తరువాత అతని మనస్తత్వం అంటే ఏమిటో అతనికి మనసులో ఉన్నభావన ఏమిటో తెలియ పరిచారు. ప్రేమంటే అతనికి నమ్మకమని సున్నితంగా హాస్యం జోడించి సూచించారు. నమ్మకానికి పునాదిగా జాతకం చెప్పించారు.

రోడ్డు మీద ఈ సుందర్రావు నిల్చున్నప్పుడు కుక్క తననే చూస్తూ కదులుతోన్న ఫీలింగ్‌తో ఇతను కదలటం, అదే సమయంలో ముష్టావతారం నుంచి దొంగావతారం దాల్చినవాడు ఓ డబ్బున్న వ్యక్తి దగ్గర బ్యాగ్ తీసుకోవాలని దూకి వాడి మీదకి ఎట్ దిసేమ్ టైమ్ మన సుందర్రావు కుక్కబారి నుండి తనను తాను కాపాడుకోవటం కోసం దూకటం, ఇవి నిజంగానే తన డబ్బు దొంగ బారి నుండి కాపాడడానికే ఇతడు దూకాడని నమ్మి ఆ డబ్బున్న వ్యక్తి మన సుందర్రావుని ఇంటికి తీసుకెళ్ళటం అతనికి ఈ కథలో "టైటిల్ రోల్" ఉద్యోగం ఇవ్వటం జరిగిపోతాయి. ఇదంతా మన వాడికి తన మనసులో భావం "ప్రేమ" ప్రాణం పోసినట్లు అయి అతని స్టయిల్‌నే మార్చేస్తాయి. తనను తాను ప్రేమికుడిగా మార్చుకుంటూ ఊహించుకుంటూ అవకాశం కోసం ఎదురు చూడటం జరుగుతాయి.

అయితే ఆమె కూడా అటువంటి '?లే' వేయడంతో మన సుందర్రావుకి ఆనందం పెరిగిపోయి ప్రేమపాఠాలు ఊదేస్తాడు ఇది బాగుంది.

సార్, నిజంగా ఇక్కడ అతడు జాబ్‌లో జాయిన్ అయినప్పటి నుండి అంటే అతనిలో ఓ వయసులో ఉన్న యువకుడు, దొరక్క దొరక్క జాబ్ దొరికినా కానీ ఓ అందమైన యువతి ఎదురుగా తన దగ్గరగా పరిచయం, మాట్లాడటం, ఈ చర్య నిజంగానే మనిషిలో ఉన్న ప్రేమానుభావాన్ని రేకెత్తిస్తాయి. ఇది సహజం. దీన్ని చాలా బాగా వ్రాసారు హాస్యంతో.

ఆమె ఏదో చెప్పాలనుకోవటం, తండ్రి రావటం అతడు ఇంటికెళ్ళి ఆ మాటలను స్ఫురించుకుంటూ మై మరచిపోతున్న సమయంలో పనిమనిషి లెటరు అమ్మగారు ఇచ్చారని ఇవ్వటం, చదవటం, ఆమె ఎవర్నో సుబ్బిగాడ్ని ప్రేమించిందని, మాష్టారు మాటలు వల్ల ధైర్యం వచ్చిందని, చీకట్లో ఆకాశవాణిలా "థేంక్స్" శబ్దం అతనికి విన్పించటం, వెనువెంటనే తండ్రి తన కూతురు లేచిపోవడానికి కారణం మీ కలం సుందర్రావే కావటం అనటం, నిజంగా హాస్యం కిక్ ఇచ్చినట్లుంది.

మొదట పరిచయం లేని కుక్క (అవిటిది) ద్వారా టైటిల్ రోల్‌ను డబ్బున్న వ్యక్తికి పరిచయం చేసి, తరువాత ఓ మంచి కుక్కను ఈ డబ్బున్న వ్యక్తికి ఇచ్చి ఆయనతో సుందర్రావు మీదకు కుక్కను 'ఉస్కో' మనిపించి మళ్ళీ రోడ్డు మీద పడవేసి తిరిగి మీ కలంలోకి తీసుకున్నారు ఫెంటాస్టిక్.

"కథ కథనం సినిమా స్టయిల్‌లో ఉంది
చాలా బాగుంది బాగా నచ్చింది
మనసులో ఎక్కడో గుచ్చింది నవ్వుతూ
ప్రతిచోట హాస్యం పండించారు.

-జి.ఎల్.గణపతి,
ఇ.నెం. 77/7, ఎల్.ఐ.జి, 4వ ఫేజ్, కెపిహెచ్‌బి కాలనీ, హైదరాబాదు-72

'హాసం' పత్రికలో మీ కలం నుండి జాలువారిన ప్రయి'వేటు' మాస్టారు కథ నా లాంటి యువసాహితీవేత్తలను కదిలించింది. దశాబ్దన్నరం పాటు పత్రికలకు దూరంగా వున్నప్పటికీ మీ కలం వాడి, వేడి ఏ మాత్రం తగ్గలేదనిపిస్తుంది ఈ కథ. పేరులోనే పెన్నిధి అన్న చందంగా సత్యా'నంద్'లోనే ఆనందం వుంది. హాస్య భరితంగా నవ్వులు - పువ్వులు పూయించిన ఈ కథ పది కాలాల పాటు పాఠకుల మదిలో స్థిరస్థాయిగా వుంటుందనుటలో ఎట్టి సందేహం లేదు. 'విల్లు అంబుల్లాంటి సర్టిఫికెట్స్‌తో ఆఫ్రికా అడవిలాంటి హైదరాబాద్ సిటీలో' అన్న వాక్య ప్రారంభమే పాఠకుల చూపులను అక్షరాల వెంబడి వాయువేగంతో పరిగెత్తించాయి. అన్నం వుడికిందా లేదా అన్నది ఒక మెతుకు చాలు. కథ బాగుందా లేదా అన్నది ఈ ఒక్క వాక్యం చాలు. సుందర్రావ్ లాంటి అమాయక జీవులు నేటి సమాజంలో కోకొల్లలు. 'ఆ అమ్మాయి నన్ను చూసి రోజు నవ్వుతుందిరా అని ఒకతను మరొక అతని అంటే మరి నన్ను చూసి కూడా నవ్వుతుంది అంటాడు. మూడో అతను వచ్చి ఎవరినైనా అలాగే చూస్తుంది ఆ అమ్మాయి. ఆ అమ్మాయి పుట్టు గ్రుడ్డి అంటాడు. సంధ్య కామెంట్స్ అన్నీ తనకే అన్నట్టు భ్రమపడిన సుబ్బారావు. ఆఖరికి అతనిచ్చిన ధైర్యంతో వేరొకరిని ప్రేమించి లేచిపోవడం పాఠకుల ఊహకి అందని ముగింపు. హాస్య కథల్లో చక్కని సెటైర్ అందించిన మీకు ధన్యవాదములు. సులభమైన శైలి, చక్కటి శిల్పంతో సామాన్య పాఠకుల మదిని పులకరింప జేసేలా మీ చేత అద్భుతమైన కథ వ్రాయించిన 'హాసం'కి అభినందనలు. మీ కలం నుండి అడపాదడపా అయినా మరిన్ని 'హాస్య గుళికలు' అందుకునే మహద్భాగ్యం మాకు కలగ జేయాలని ఆశిస్తూ.

-గాదిరాజు రంగరాజు, చెఱుకువాడ - 534 199, ఉండి మండలం

మీ కథ 16-30 నవంబరు 2001 'హాసం' పత్రికలో చదివి తెగ హాసించామంటే నమ్మండి. మా ఆవిడకు తెలుగు చదవడం రాకపోవడం (చిన్నప్పటినుంచి ఇతర రాష్ట్రాలలో వుండి హిందీ చదవడం వలన)తో నేను మీ కథను చదివి ఆమెకు విన్పించడమైనది. ఆవిడ కథ వింటూ కడుపుబ్బ నవ్వసాగింది. అలా కథను చదువు తున్న కొద్ది మరీ నవ్వడం ఎక్కువ చేయడంతో నిండు చూలాలైన ఆమె మరీ ఎక్కువగా నవ్వితే ఏం ఇబ్బంది వస్తుందేమోనని నేనే మధ్యలో చదవడం ఆపేసాను. అయినప్పటికీ మీ కథలోని పదాల గారడీకి ప్రశంసలు కురిపిస్తూ మరీ మరీ నా చేత చదివించుకొని విని పడిపడి నవ్వసాగింది. అసలు మీరు కథ టైటిల్‌లోనే తెగ నవ్వించేసారు (1) ప్రయి'వేటు' మాస్టారు 'హైజంప్' చూసి... రెచ్చిపోయిన గెడ్డం జాతకాల వాడు, (2) దుక్క ముష్టోడు, (3) నల్ల కుక్కను చూసి సుందర్రావ్ రెండడుగులు ముందరవేస్తే... కరెక్ట్‌గా కొలిచినట్టు ఆ కుక్క రెండడుగులు సుందర్రావు కేసి వేసింది. (4) 'కరవటం' అనే చిన్నకాలక్షేపం కోసం (5) ఇప్పుడు నువ్వేమి చేస్తున్నా వోయ్ సుందరం? అంటే 'నొప్పితో బాధ పడుతున్నా' ఇత్యాది పదాలు మరీ మరీ నవ్వించాయి. ప్రేమకొటేషన్స్ బాగా అనుభవమున్నట్టు రాసారు. మీ కలం నుండి ఇలాంటి మరిన్ని కథలు రావాలని కాంక్షిస్తూ-

- కోనేరు ఆదినారాయణరావు
తర్లాగడివూరు, గరుడభద్ర, శ్రీకాకుళం జిల్లా.

---

ప్రయి'వేటు' మాస్టారు వల్ల 'హాసం' ద్వారా తెరవెనుక ఉండి కనిపించక వినిపించే మీ వంటి కళానిపుణుల పరిచయం ప్రత్యక్షంగా కలుగుతున్న తరుణంలో మా అభినందన మందారాలు. మనం దేనికైతే భయపడ్తామో ఆ 'భయం' నీడల్లే వెంటాడ్తుందన్న నగ్నసత్యం సుందర్రావ్ కుక్కభయం చేత ఉద్యోగం. అమ్మాయి పరిచయం కలిగినా, యజమాని 'ఉస్కో' మాటకు పాపం సుందర్రావు బలవక తప్పలేదు - సుంద ర్రావు పాత్ర హాస్యరసపర సంభాషణలతో నవ్విస్తూ కవ్విస్తూ కొనసాగింది. ఏది ఏమైనా నిజం చెప్పొద్దూ..... మినీ థియేటర్‌లో చిన్న సినిమా చూసినట్లయింది. సినిమాల ద్వారానే కాకుండా ఇలా పత్రికల ద్వారా ప్రజలకు చేరువవ్వటం ఆనందదాయకం.

-నేమాన సుభాష్ చంద్రబోస్,
ఇలిసిపురం జంక్షన్, శ్రీకాకుళం టౌన్

**వచ్చిన 16 ఉత్తరాలలో పై నాలుగు బాగున్నాయని వాటిలో జి.ఎల్.గణపతి రాసిన లెటర్ బహుమతికి అర్హమైనదని సత్యానంద్ తెలిపారు.**

**ప్రకటించిన ప్రకారం బహుమతి గ్రహీతకు 6 నెలల పాటు 'హాసం' పత్రికను ఉచితంగా పంపుతున్నాము.**

**తక్కిన ముగ్గురికి 'హాసం' 1-15 డిసెంబరు సంచికను సముచితంగా పంపుతున్నాము.**

**-ఎడిటర్**

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త,
లలిత సంగీత విద్వాంసుడు, వాగ్గేయకారుడు
**శ్రీ ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.

## ఈ విశాల ప్రశాంత...

ప॥ ఈ విశాల ప్రశాంత ఏకాంత సౌధంలో
నిదురించు జహాఁపనా

1.చ॥ పండువెన్నెల్లో వెండి కొండల్లే తాజ్ మహల్
ధవళకాంతుల్లో నిదురించు జహాఁపనా

2.చ॥ నీ జీవిత జ్యోతి నీమధుర మూర్తి
ముంతాజ్ సతి సమాధి సమీపాన
నిదురించు జహాఁపనా ॥ఈ విశాల॥

### రచన, గానం, సంగీతం:
### ఎం.ఎస్.రామారావు

**తాళం:** తిశ్రగతి (కర్ణాటక సం॥)
దాద్రా (హిందుస్తాని సం॥)

ఈ పాటలోని పల్లవి 'మధ్యమావతి' రాగంలో సాగుతుంది. ఈ రాగాన్ని హిందుస్తాని సంగీతంలో మధ్మాత్ సారంగ్ అని పిలుస్తారు. ఈ రాగం యొక్క మూర్ఛన

**ఆరోహణ** : స రి మ ప ని స
**అవరోహణ:** : స ని ప మ రి స

ఆరోహణ, అవరోహణ రెండింటిలోను ఒకే రకమైన స్వరాలుంటాయి.

షడ్జము, చతుశృతి రిషభం, శుద్ధమధ్యమం, పంచమం, కైశికి నిషాదం.

1వ చరణం యొక్క బాణీ యీ క్రింద పేర్కొన బడిన స్వరాలతో కూర్చబడింది.

స రి గ మ ప ధ

షడ్జము, చతుశృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశృతి దైవతం.

ఇది ప్రత్యేకంగా ఒక రాగమని చెప్పడానికి వీలుండదు.

లలిత సంగీతంలో ఒక రాగానికి కట్టుబడి వుండాలనే నియమం లేదు. కనుక సాహిత్యంలోని భావాలకు అనుగుణంగా ఏ విధంగానైనా స్వరాలను కూర్చుకొని బాణీని రూపొందించవచ్చు. ఈ వెసులుబాటు లలిత సంగీతానికి వుంది.

2వ చరణంలో చాలావరకు 'శుద్ధసావేరి' రాగస్వరాలు వాడుకున్నారు. ఈ రాగాన్ని హిందుస్తాని సంగీతంలో 'దుర్గ' అని పిలుస్తారు. ఈ రాగం యొక్క

**ఆరోహణ** :స రి మ ప ద స
**అవరోహణ** :స ద ప మ రి స

షడ్జము, చతుశృతి రిషభం, శుద్ధమధ్యమం, పంచమం, చతుశృతి దైవతం.

ఆరోహణ, అవరోహణ రెండింటిలోను ఒకే రకమైన స్వరాలు వుంటాయి.

ఈ చరణంలోని చివరి భాగంలో తిరిగి మొదటి చరణంలో ఉపయోగించిన స్వరాలనే వాడుకోవడం జరిగింది.

ఈ పాటకు బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌ని పెండ్యాల నాగేశ్వరరావుగారు కంపోజ్ చేశారు. (ఈ విషయం రామారావు గారు నాతో చెప్పారు) ఒక సందర్భంలో పల్లవికి ముందు వచ్చే మ్యూజిక్‌లో సాధారణ గాంధారం వాడి శ్రీరాగం యొక్క పోకడను చూపించారు.




# ఎం.ఎస్. రామారావు
## (మోపర్తి సీతారామారావు)

తెలుగు చలన చిత్ర రంగంలో తొలి నేపథ్య గాయకుడు ఎం.ఎస్.రామారావు గారు. తెనాలి తాలూకా మోపర్రు గ్రామంలో 1921వ సంవత్సరం జూలై 3వ తేదీన జన్మించిన రామారావుగారు నిడుబ్రోలు హైస్కూల్లోను, గుంటూరు హిందూ కాలేజీలోను విద్యాభ్యాసం చేశారు. చిన్నతనం నుండి పాటలు పాడడంలో ఆసక్తి కనబరచేవారు. 1941వ సంవత్సరంలో ఇంటర్మీడియెట్ చదువుతున్నప్పుడు కళాశాలలో జరిగిన లలిత సంగీత పోటీలో ఆయనకు మొదటి బహుమతి లభించింది. ఆ పోటీకి అడవి బాపిరాజు గారు కూడా ఒక న్యాయ నిర్ణేతగా వచ్చారు. రామారావు గారి పాట విని సినీ రంగంలో ప్రవేశించమని ప్రోత్సహించారు. 1944వ సంవత్సరం నుండి చిత్రసీమలో 20 సంవత్సరాల పాటు అనేక చిత్రాలలో పాటలు పాడారు. దీక్ష, ద్రోహి, మొదటిరాత్రి, పాండురంగ మహాత్మ్యము, నా యిల్లు, సీతారామకల్యాణము, శ్రీరామాంజనేయ యుద్ధము మొదలగు సినిమాల్లో పాడారు.

"ఈ రేయినన్నొల్ల నేరవారాజా'' అనే నండూరి సుబ్బారావు గారు రచించిన పాటను 'తాసిల్దారు' సినిమాకై రామారావు గారు పాడారు. అదే ఆయన పాడిన మొట్టమొదటి సినిమా పాట. ఆ పాట నేర్చుకోవడానికి ఏలూరు వెళ్ళి నండూరి వారి యింట్లో వుండి ఆ పాటను నేర్చుకొని ఆ తరువాత సినిమాకి పాడానని రామారావుగారే ఒక సందర్భంలో నాతో చెప్పారు. సినీ దర్శకులు వై.వి.రావు, కె.ఎస్.ప్రకాశరావు, నటులు నాగయ్య, యన్.టి.రామారావు మొదలగు వారి ప్రోత్సాహంతో ఎన్నో పాటలు పాడారు. 'దీక్ష' చిత్రంలో "పోరా బాబూ పో'' అనే పాట ఆ రోజుల్లో చాలా పాప్యులర్ అయ్యింది. అదే పాటను తమిళ చిత్రానికి కూడా పాడి మంచి పేరు గడించుకున్నారు. రాజన్ - నాగేంద్ర సంగీత దర్శకత్వంలో 'నాగార్జున' అనే కన్నడ చిత్రానికి 'శాంతి సమాధాన' అనే పాటను పాడారు.

ఆయన పాడిన ప్రైవేటు రికార్డులలోని గీతాలు

"ఈ విశాల ప్రశాంత'' (తాజ్‌మహల్ మీద వ్రాసిన పాట), 'ఒహో హో పిల్ల దానా' మొదలైనవి బహుళ జనాదరణ పొందిన పాటలు.

ఆయన ఆకాశవాణి మద్రాస్ కేంద్రంలో ఎన్నో లలిత గీతాలను గానం చేశారు.

1964 తరువాత ఆయన మద్రాసు వదలి రాజమండ్రి వచ్చి ఒక గురుకులంలో 1975 వరకు పని చేశారు. ఆర్థికంగా చాలా కష్టాలు అనుభవించారు ఆ కాలంలో.

1970వ సంవత్సరంలో శ్రీ ఆంజనేయస్వామి వారి కృపచేత రామారావుగారు తులసీదాసు రచించిన 'శ్రీ హనుమాన్ చాలీసా'ను తెనిగించారు. ఆ తరువాత వాల్మీకి రామాయణంలోని 'సుందరకాండ'ను సులభ శైలిలో తెలుగులో గేయ రూపంగా వ్రాశారు.

1975లో సుప్రసిద్ధ జర్నలిస్టు గుడిపూడి శ్రీహరిగారు ఒకరోజు రామారావు గార్ని వెంట పెట్టుకొని ఆకాశవాణి హైదరాబాదు కేంద్రానికి వచ్చారు. రామారావు గారు 'సుందరకాండ'ను గేయరూపంగా వ్రాశారని తెలుపగా పాలగుమ్మి విశ్వనాథంగారు (ప్రొడ్యూసర్, ఆకాశవాణి) అప్పటి స్టేషన్ డైరెక్టర్ పుల్లెల వేంకటేశ్వర్లు గారిని కలిసి రామారావు గారు రచించిన విషయం చెప్పి ఆయనను స్టూడియోకు తీసుకువచ్చి రామారావు గారిని పాడమని 'సుందరకాండ'లోని కొంతభాగం డైరెక్టర్ గారు వినేటట్లు చేశారు. ఆయన ముగ్ధులై 'సుందరకాండ' మొత్తం ఎంత నిడివి వున్నా, రికార్డింగ్‌కి ఎన్ని టేపులు అవసరమైనా సరే వెంటనే రికార్డింగ్ జరిపించి ప్రసారం చెయ్యమని చెప్పారు. విశ్వనాథంగారు పూనుకుని రికార్డింగ్‌కి ఏర్పాటు చేయించారు. 20 రోజులు రామారావు గారు రేడియోకి వచ్చి 'సుందరకాండ' అంతా పాడారు. ఆ రామకార్యంలో వాద్య సహకారం అందించిన వారితోపాటు నేను కూడా పాల్గొని చిరతలు, 'మంజీర' తాళాలు వాయించి, కొన్ని భాగాలకి బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌ని కంపోజ్ చేశాను. కొన్నిటికి విశ్వనాథంగారు కంపోజ్ చేశారు. తరువాత ఆకాశవాణిలో 'భక్తిరంజని'

## ఈ రాగాలు ఆధారంగా కొన్ని సినీగీతాలు...

**మధ్యమావతి రాగంలో...**

1. సువ్వీ సువ్వీ సువ్వాలమ్మా (స్వాతిముత్యం)
2. సీతారాముల కళ్యాణము చూతము రారండి (సీతారామ కళ్యాణం)
3. నేడే ఈనాడే (భలే తమ్ముడు)
4. మబ్బులో ఏముంది (లక్షాధికారి)
5. చీటికి మాటికి చీటీ కట్టి (భలే అమ్మాయిలు)
6. ఆశా ఏకాశా నీ నీడను మేడలు కట్టేశా (జగదేక వీరుని కథ)
7. ఎన్నాళ్ళకో ఇలా విన్నానే కోయిలా (మా ఆవిడ మీదొట్టు మీ ఆవిడ చాలా మంచిది)
8. పడ్డానండి ప్రేమలో మరి (స్టూడెంట్ నెం.1)
9. దయ్యారె దయ్యారె దేఖోరె సాపీ బిచువా (మధుమతి)
10. ఆ... లౌట్‌కె ఆజా మేరే మీత్ (రాణీ రూప్‌మతి)

**శ్రీ రాగంలో...**

1. గోరింట పూచింది కొమ్మాలేకుండా (గోరింటాకు)
2. శ్రీరస్తు శుభమస్తు (పెళ్ళి పుస్తకం)
3. ఆకాశం దించాలా నెలవంక తుంచాలా (భక్త కన్నప్ప)
4. తెల్లవారక ముందె పల్లె లేచింది (ముత్యాల పల్లకి)

మధ్యమావతి రాగానికి శ్రీరాగానికి ఒక్క అవరోహణ లోనే తేడా ఉంటుంది.



కార్యక్రమంలో కొన్ని రోజులు వరుసగా 'సుందరకాండ' ప్రసారమయి రామారావుగారికి ఎనలేని కీర్తిని చేకూర్చింది. అప్పటి నుండి హైదరాబాదులోనే కాక, రాష్ట్రంలోని అనేక ప్రాంతాలలో ఆయన 'సుందరకాండ' సప్తాహాలు నిర్వ హించారు. ఆంజనేయ స్వామి వారి అపారకృపకు పాత్రులైన రామారావు గారికి పేదరికం పోయి ఆర్థికంగా మంచి స్థితిని పొందారు. ఆ తరువాత హెచ్.ఎం.వి. వారి ఆహ్వానంపై మద్రాసు వెళ్ళి 'సుందరకాండ'ను పాడి రికార్డు లుగా వెలయించారు. తరువాత ఆయన రామాయణంలోని బాలకాండ, కిష్కింధ కాండ, యుద్ధకాండలను కూడా గేయ రూపంలో తెనిగించారు. తరచూ ఆకాశ వాణిలో లలిత గీతాలను పాడుతుండే వారు. ఆయనతో ఎన్నో కార్యక్రమాలు రేడియోలో నేను రికార్డు చేశాను. నా సంగీతంలో కూడా కొన్ని పాటలు రామారావు గారు పాడారు. ఆయన తుది శ్వాసవరకు గాత్రం చెక్కు చెదరలేదు. హైదరాబాద్‌లోని చిక్కడ పల్లిలో శ్రీ త్యాగరాజగాన సభా సదనం వెనుకనున్న వీధిలో ఆయన స్వగృహం నిర్మించుకుని నివసించారు. 1977 ఏప్రిల్ 7వ తేదీన ఆంజనేయ స్వామివారి ప్రియతమ భక్తుడైన రామారావుగారికి అప్పటి మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి గారి ద్వారా "సుందరదాసు" అనే బిరుదు ప్రదానం జరిగింది. 1992 ఏప్రిల్ 20వ తేదీన రామారావుగారు దివంగతులైనారు.

**హైదరాబాదు నగర మునిసిపాలిటి వారు రామారావుగారి పేర డిసెంబరు 11వ తేది 2001 నాడు ఆయన నివాసముండిన ఆ వీధికి "సుందర దాసు ఎం.ఎస్. రామారావు వీధి" అని నామకరణం చేశారు.**

చలన చిత్రాలలోను, ప్రైవేటు రికార్డులుగాను, ఆకాశవాణిలోను అసంఖ్యాకంగా పాడిన పాటలు ఆయనకు ఎంతో కీర్తి ప్రతిష్ఠలు సంపాదించిపెట్టగా, శ్రీ ఆంజనేయ స్వామి వారికి అంకితమై వారి కృపతో రచించి గానం చేసిన "చాలీసా", "సుందరకాండ" ఆయనకు అజరామ రమైన కీర్తిని చేకూర్చి తెలుగు వారి హృదయాలలో శాశ్వతంగా నిలిచి పోయేటట్లు చేసి జీవితానికి సార్థకతను ప్రసాదించాయి. ●

---

**'శ్రీ రాగం'లో**

అవరోహణ: సనిపమరిగరిస (సాధారణ గాంధరంతో)

ఇంకొక సంప్రదాయం ప్రకారం ఇలాగ కూడా ఉంటుంది.

అవరోహణ: సనిపదనిపమరిగరిస (చతుశృతి దైవతంతో)

ఈ సౌలభ్యాన్ని ఉపయోగించుకుంటూ స్వరపరచిన సినీగీతాలు

1. చూడాలని వుంది అమ్మాచూడాలని వుంది (ముద్దుబిడ్డ)
2. జో లాలీ... (ధర్మదాత)

**శుద్ధ సావేరి (దుర్గ)...**

1. జానకి అనుకోలేదు రాముని సతికాగలనని ఏనాడు(రాజకుమార్)
2. పాడనా తెనుగు పాట (అమెరికా అమ్మాయి)
3. నీల మోహనా రారా (తొలి చరణం వరకు మాత్రమే) (డాక్టర్ ఆనంద్)

అవరోహణలో స,ద/మ,రి అనే స్వరాలను లాగినప్పుడు 'స' ని అంటిపెట్టుకున్న కాకలి నిషాదం (ని) 'మ'ని అంటి పెట్టుకున్న అంతర్గాంధారం (గ) ఛాయామాత్రంగా పలికిస్తారు. ఇవి జారుడు గమకాలలో వ్యక్తమౌవుతాయి.

ఈ పద్ధతి కర్ణాటక సంప్రదాయంలో ఒప్పుకోరు. ఎందుకంటే అలా పాడడం వల్ల అది 'ఆరభి రాగం' అవుతుంది. హిందుస్తానీ సంప్రదాయాలలో మాత్రం అంగీకరిస్తారు. శుద్ధసావేరి - దుర్గ రాగాలలో కనిపించేది ఈ తేడాయే!

లలిత సంగీతంలో - ఏ సంగీత పద్ధతిలోనైనా పాడే వీలుంది. ●



## పేరు-రిపేరు

✷ ప్రియమైన నీకు - ఇదే నా మొదటి ప్రేమలేఖ - మధురానగరిలో -నువ్వు నేను- ప్రేమించుకుందాం రా.

✷ రోజా - నువ్వు నాకు నచ్చావ్ - మనసంతా నువ్వే - నాలో వున్నప్రేమ - నీకోసం - నువ్వే కావాలి - నిన్నే ప్రేమిస్తా - నిన్నే పెళ్ళాడుతా.

-అడపా శివదుర్గ, భోగాపురం.

✷ అరుణాచలం - భద్రాచలం - చూడాలని వుంది.

- ఎస్.జ్యోత్నా సురేష్, కర్నూలు





## చిలిపిలిపి

**Six out** = ఆరుబైట

-జి.యస్.యన్.స్వామి, తాడేపల్లి గూడెం.

**Flying kiss krishna's mother My U Do** = గాలి ముద్దు కృష్ణమ్మ నాయుడు

-ఆర్.అప్పలరాజు, రెడ్డిపల్లి.

ఎమ్.ఎఫ్.హుస్సేన్ = మాధురి ఫెనటిక్ హుస్సేన్

- శ్రేష్ఠ, హైదరాబాద్

## డబుల్ రోల్

'కవి''తల' 'కవితల' పుట్టిల్లు

-రాయవరపు రవి, రామాయంపేట.

'ఏసీ' థియేటర్లో కూర్చున్నప్పుడు 'ఏసీట్లో' నైనా హాయిగానే వుంటుంది.

-శ్రీపాద శ్రీనివాస్, బొబ్బిలి.

ఆఫీసు డబ్బు 'స్పెండ్' చేశాడని రామారావుని 'సస్పెండ్' చేశారు.

-శ్రీమతి రమణి, మలక్‌పేట.



# కొంటె కొశ్చెన్లు తుంటరి జవాబులు




ప్ర. అమాయక చక్రవర్తి?
జ. జంటనగరాలలో జంటలు మాత్రమే ఉంటారనుకునే వాడు
ప్ర. అమాయక పండితుడు?
జ. మీరు గట్టి పిండం సార్ అని అంటే 'అయితే నా శ్రాద్ధానికి ఉక్కు పిండాలు పెట్టండి' అనేవాడు.
ప్ర. ఎవరి ముందూ చేయి చాచరాదు అని అంటే అర్థం ఏమిటి!?
జ. ఎదుటివాడి జేబులో మనమే చెయ్యిపెట్టి తీసేసుకోవాలి అని.

-వి. మంజురాణి , హైదరాబాద్

# చిలిపి కవిత

జీవితం అనే వంటకి
భర్త గ్యాస్ అయితే
భార్య నిరంతరం జ్వలించే స్టౌ
సంతానం 'ప్రెషర్' కుక్కర్
బంధువులు తప్పనిసరి
కూరగాయలు
స్నేహితులు
అవసరానికి ఆదుకునే
ఊరగాయలు

-శ్రేష్ఠ, హైదరాబాద్



# పేరడీ పేరేడ్



హ్రీం... హ్రీం... హ్రీం...
హ్రీంకారనాదాను సంధానమౌ జ్ఞానమే
కాష్మోరా మంత్రము ॥హ్రీంకార॥
భీకర స్వర గరళము
ఈప్సిత అరి మరణము ॥భీకర॥
భూతప్రేత మాంత్రికా స్ఫురితము
కాష్మోరా మంత్రము
తులసీదళమూ...
తులసీదళము వీరేంద్రుని
విరచిత నవలా రాజము ॥తులసీ॥
దార్కా కాద్రా బిస్తా విషాచి
ఝుళిపిత ద్రావణ చకితము



రక్కసి కలవాలమై నిశిరాత్రిలో నాట్యమై ॥రక్కసి॥
హుంకరించు భూతప్రేత తంత్రము
కాష్మోరా మంత్రము ॥హ్రీం॥
పైశాచ బుద్ధికి అసురత్వ లబ్ధికి
ఖేచరియే మార్గము
క్షుద్ర సాధనకు రుద్రశోధనకు
బేతాళుడే ప్రాణము
భూతరాజ హృదయమై
వల్లకాటి నిలయమై ॥భూతరాజ॥
శక్తి నొసగు రక్త త్యాగ మార్గము
శుచియె లేని నిశాచరుల దుర్గము
కాష్మోరా మంత్రము

'శంకరాభరణం' టైటిల్ సాంగ్‌కి పేరడీగా

-రాజా

# ఈ రూటే వేరు



పది'వే'లు = పది మార్గములు
అరవై = సగం ఎందుకు?
బాబ్జీ = బాబు గారూ!

-జి.యస్.యన్.స్వామి, తాడేపల్లిగూడెం.

క్లాసిక్స్ రీటోల్డ్

అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

# సాక్షి



కవిశేఖర పానుగంటి లక్ష్మీనరసింహారావు

# సింహాసనం ఒక్కటే! విక్రమార్కులెందరో..!!

జంఘాలశాస్త్రికి అప్పుడప్పుడు విచిత్రమైన కలలు వస్తూ ఉంటాయి.

ఓ రాత్రి కలలో...

అది దేశభక్తుల సభ. సభా మైదానం దేశభక్తులతో కిటకిటలాడుతోంది. సభనుద్దేశించి ఒక వక్త తన ఉపన్యాసం ప్రారంభించాడు.

"ఈ రోజుల్లో దేశభక్తి అందరి గుండెల్లో పొంగి పొర్లుతోంది. ఈ గుణం పుట్టుకతో వచ్చి చావుతో పోవల్సిందే! అంతేకాని నడి మంత్రపు సిరిలా వచ్చి పోయేదికాదు. లేకలేక మనవారికి దేశభక్తి వంటపట్టిందికాబోలు వీరావేశంతో వెర్రి వెర్రి కేకలేస్తున్నారు.

ఏమో? ఏం పని చేయడానికో? ఏం ఫలం అనుభవించడానికో? ఎవరికి తెలును? ఊహించడం ఎవరి తరం?

ఎక్కడ చూసినా దేశభక్తులే! బజారులో, సంత బయట, చెరువు ఒడ్డున, పశువుల సంతలో, మేదర గూడెంలో, హరిజనవాడలో, రైలు స్టేషనులో, దేశభక్తులు... 'నేల యీనినట్లు దేశభక్తులు... వందలు, వేలు, లక్షలు... ఇందరు దేశభక్తులు మనదేశంలో ఉన్న తరువాత మనకు ఇంకా కొరత ఏముంది? ఇంక దేశానికొచ్చిన లోటేంటి? ఏమీ లేదు కాబట్టి ఇదే స్వతంత్రరాజ్యం. స్వర్గలోకం"

ఇలా ప్రసంగం సాగుతుండగా... సభలోని దేశభక్తులు తమని చాలా ఘోరంగా అవహేళన చేస్తున్నాడని గ్రహించి 'ఇంతసేపు భరించాం ఇక నోరు మూసుకొని కూర్చోమని' కేకలేసారు. వేదిక దిగిపోకపోతే... దింపుతామని హెచ్చరించారు.

ఆ హెచ్చరింపులకు రెచ్చిపోయిన ఆ వక్త "దేశాన్ని రొంపిలోకి దింపిన మీకు నన్ను దింపడం ఓ లెక్కా? రవ్వంత వ్యతిరేకమాట సహించలేరు. మీకు దేశభక్తి ఎక్కడ? దేశభక్తి గలవారికి దేశానికున్న క్షమాశక్తి ఉండాలి. ఇంద్రియ నిగ్రహంలేని మీకు దేశభక్తి ఉందా?



పురుషసూక్తం

బొమ్మలు: బాలి




-నికోలస్ ఛామ్‌ఫోర్డ్




-ఇర్విన్ కాబర్

దేశభక్తుడు ఎంత వైరాగ్య సంపన్నుడో, ఎంత నిశ్చలహృదయుడో, ఎంత శాంతచిత్తముడో, ఎంత క్షమాదయా సంపన్నుడో, ఎంత దైవభక్తుడో మీకు తెలుసా?'' అని అన్నాడు.

ఉపన్యాసం సహించలేని దేశభక్తులు కొందరు... 'ఒళ్ళు తెలియక మాట్లాడుతున్నాడు తన్నాలి వాణ్ణి' అంటూ... వేదిక మీదికి ఉరికి వక్తను పడదోసి చెంపలు పగలకొట్టనారంభించారు. ఆ వక్తకు మోచేతి పోటులు - కాలి తన్నులు బలంగా తగిలాయి. ఆ దెబ్బలకు అతడు మరణించాడు. జనం నానా రకాలుగా చెప్పుకోసాగారు.

అంతలో ఎర్ర టోపీలు పెట్టుకొని లాఠీలతో పోలీసు వాళ్ళు వచ్చారు. ఇక్కడి దేశ భక్తుల్లో కొందరు ఇతన్ని చంపారు కాబట్టి మా పై అధికారి వచ్చేవరకు ఇక్కడి నుంచి ఎవరు కదలకూడదని ఆర్డర్ జారీ చేశారు. కొందరు ఇండ్లకు జారుకోబోతుండగా వారిపై పోలీసులు కేకలేస్తూ తిరగబడంతో సభ అంతా ఒకటే గోలగోల!

ఇంతలో భూమి క్రింద ఏదో గడగడ వణికినట్లు అయింది. జనం తూలి భయభ్రాంతులకు లోనయ్యారు. భూమి గడగడ ఎక్కువైంది. జనాల గుండెల్లో దడదడ కూడా ఎక్కువైంది. ఉన్నట్టుగా భూమిని చీల్చుకుని ఒక నవరత్న ఖచిత బంగారు సింహాసనం పైకి వచ్చి భూమిపై నిల్చింది. రెండు వజ్రాల సింహాలు దానిని మోస్తున్నాయి. నవరత్నాలు జిగేల్ జిగేల్‌మంటూ కనులకు మిరుమిట్లు గొలుపుతున్నాయి. దీనిని గురించి జనాల్లో చర్చ మొదలైంది. ఇది శ్రీరాముని సింహాసనమని కొందరు - విక్రమార్కుని సింహాసనమని మరికొందరు - ధర్మరాజు సింహాసనమని ఇంకొందరు చెప్పుకున్నారు. ఇంతలో తళుక్కుమని మెరుపు మెరిసినట్లుగా తాటికాయంత ఉల్క ఏటవాలుగా దిగి సింహాసనంపై నిల్చింది. అందరి కళ్ళు చీకట్లు కమ్మాయి. తిరిగి చూసేసరికి ఉల్క బదులు ఒక పురుషుని తలకాయ ఉంది. మొండెం ఎక్కడ ఉందో తెలియదు. తలకాయ నాలుగు వైపులకూ బొంగరంలా గిరగిర తిరిగి గంభీరంగా ఇలా పలికింది.



"ఇది భారతమాత పీఠం. నేనెవ్వరో మీకు తెలియనవసరం లేదు మీరందరూ దేశసేవకై ఇక్కడ చేరి దేశభక్తులు అనుకుంటున్నారు కాబట్టి మీరు ఒకరి తరువాత ఒకరు ఈ పీఠం దగ్గరకొచ్చి చేతితో తాకి కళ్ళకు అద్దుకోండి. మీకు భగవంతుడు మంచి చేయుగాక! మిమ్ములను దేశమాత రక్షించుగాక!''

సభలో ఉన్న ఒక న్యాయవాది ఇట్లన్నాడు. "ఓ మహాపురుషా! నేను న్యాయవాదిని. నెలకు 10వేల రూపాయలు సంపాదిస్తున్నాను. ఈ సంపాదన తృణప్రాయంగా వదిలి భారతమాత సేవకై నా తనువు అర్పించాను. కాబట్టి సింహాసనాన్ని తాకడానికి ఆనతి ఇవ్వండి'' అన్నాడు.

"సరే రావచ్చు'' - అన్నాడు మహా పురుషుడు.

న్యాయవాది సింహాసనం చేరడానికి ప్రయత్నించాడు. అతనికి జనం దారి వదిలారు. కాని ఒక అడుగు కూడా ముందుకు వేయలేక పోయాడు.

కళ్ళున్నాయి,

కాళ్ళున్నాయి, శక్తి వుంది. అన్నింటినీ మించి సింహాసనాన్ని తాకే ఆశవుంది. ఎంతో దీనంగా చుట్టుప్రక్కలవారిని చూసి "నాయనలారా! నన్ను ముందుకు తోయండి'' అని బ్రతిమాలాడు. ముందుకు తోసిన కొద్దీ వెనుకకు పోతున్నాడు. దాంతో "నన్ను రక్షించు'' అంటూ కేకలేసాడు.

"నాయనా! నీ తల్లిదండ్రులు భిక్షమెత్తి నీకు చదువు చెప్పించారు. వారు కడుపు మాడ్చుకుని నిన్ను ఇంత వాణ్ణి చేసారు. నెలకు పదివేలు



## పురుషసూక్తం

బొమ్మలు: బాలి




తను గనుక పట్టించుకుని గట్టిగా అరిస్తే రెండూ, రెండూ అయిదవుతాయని నమ్మే ప్రాణి - సృష్టిలో ఒక్క ఆడదిమాత్రమే.

-జార్జ్ ఇలియట్



ఒక స్త్రీకి తక్కిన ఆడవాళ్లు మెచ్చే మొగవాణ్ని నమ్మడానికి భయం - మెచ్చని మగాణ్ని వరించడానికి అయిష్టం

-ఏనటోల్ ఫ్రాన్స్

సంపాదిస్తూ ఉన్నా తల్లిదండ్రుల ఋణం తీర్చలేక పోయావు. కన్నవారికంటే దేశభక్తి ఎక్కువ కాదు. తల్లిదండ్రులమీద భక్తి లేనివాని దేశభక్తి నిజమైనది కాదు- మొదట నీవు ధనమంతా నీ తల్లిదండ్రుల పేరు మీద ప్రజా పనులకు ఉపయోగించు. అలా చేస్తే నీకు దేశభక్తి కుదురు తుందేమో చూద్దాం. ఇక నీవు వెళ్ళవచ్చు." అన్నాడు తలకాయ మహా పురుషుడు.

తరువాత మరొక దేశభక్తుడు ప్రయత్నించాడు. నిల్చున్న చోటే గుడు గుడుగుంచం ఆట ఆడతాడు గాని అడుగు ముందుకు వేయలేకపోయాడు. "నాయనా! నీవు వట్టి చపల చిత్తుడవు. నీకు డబ్బు-కీర్తి ప్రధానం కాని మరొకటి కాదు. నీకు ప్రజలందు విశ్వాసం లేదు. ప్రభువులందు అంతకంటె లేదు. ప్రభువులాదరించినపుడు ప్రజల్ని బాధించావు. ప్రభువులు నిరాదరణ చేసినప్పుడు ప్రజల పక్షం చేరి ఆర్భాటం చేసావు. ఇంతలో ప్రభుత్వంతో చేతులు కలిపి ప్రజల్ని దగా చేసావు. నిన్ను నీవే నమ్మవు. నీకు దేశభక్తి ముందు జన్మలో కలుగునేమో నాయనా!" అని చెప్పి,

"అయ్యా! మరెవరైనా ఈ పీఠాన్ని తాకి ధన్యులు కండి!" అని పలికాడు ఆ మహాపురుషుడు. ఇంతలో ఒకాయనొచ్చి "నేను బీదవాడిని, ఉపాధ్యాయుడిని. పదవిని వదలుకుని దేశసేవ చేయుచున్నాను. కాబట్టి ఈ సింహాసనాన్ని తాకుతాను" అంటూ ముందుకి రాబోయి.. రాలేక అలాగే ఉండిపోయాడు.



"నాయనా! ముందు రాబోవు జాతీయ పాఠశాలలో ఇంతకంటే ఎక్కువ వచ్చే జీతానికి, అధికారానికి ఆశపడి ఇందులో దిగావు. నీ త్యాగము స్వార్థపూరితమైనది. దేశభక్తి ప్రబోధితమైనది కాదు. నీకు ఆ ఆశ లేనప్పుడే అది దేశభక్తి కాగలదు." అని సెలవిచ్చాడా మహాపురుషుడు.

"నేను భక్తుణ్ణి కనుక ఈ సింహాసనాన్ని తాకుతాను"అంటూ మరొక దేశభక్తుడు పలికి రాబోతుండగా "నాయనా! నీవు రావద్దు. రాలేవు కూడాను. నీది చంచలమైన బుద్ధి. ఈ రోజు శృంగేరి స్వాములవారిని పూజిస్తావు. మరుసటిరోజు వితంతు వివాహతాంబూలానికి పోతావు. ఒక రోజు చేతివంట అంటావు. రాత్రిపూట స్టార్ హోటల్లో డిన్నర్ లాగిస్తావు. వగలు ఏంటినాచ్ మూవ్‌మెంట్‌లో సంతకము, రాత్రి పూట వేశ్యల ఇంట సల్లాపాలు. చిన్న వయసులో కలిగిన వ్యభిచార బుద్ధి పెద్దవయస్సులో పోతుందిగాని పెద్దవయసులో అలవాటుపడ్డ వేశ్యా సాంగత్యం మరుజన్మలో కూడా వదలదు. మనసు నిలకడ లేని వాడు దేశభక్తుడు కాడు. నీకు అది ఇది ఏదీ లేదు కనుక చాలు చాలు ఇక దయచేయి" అన్నాడు ఆ మహా పురుషుడు.

అంతమంది జనంలో చివరకు ఓ ఇద్దరు ముగ్గురు దేశభక్తులు మాత్రం సింహాసనం దగ్గరకి వచ్చి అతి సులువుగా ఆ రత్న ఖచిత బంగారు సింహాసనాన్ని స్పృశించి కళ్ళకు అద్దుకున్నారు. అంతటా "జయహో! భారతమాతకు విజయహో!" అంటూ దిక్కులు పిక్కటిల్లేలా ఆ మహాపురుషుడు అరిచిన అరుపులకు జంఘాల శాస్త్రికి తెలివొచ్చేసింది.

-ప్రకాష్ రాయపనేని



## పురుషసూక్తం

బొమ్మలు: బాలి

ఒక స్త్రీ వయస్సు తెలుసు కోవాలంటే ఆవిడ తోటికోడల్ని అడిగితే సరి!




-ఎడ్గార్ హోప్

స్త్రీ ఖచ్చితంగా క్షమాగుణం కనబరచగలదు - పొరబాటు ఆమె దయితే!



- అర్సెస్ హౌసేయ్

2001

జ్యూక్ బాక్స్

| | | | | | |
|---|---|---|---|---|---|
| చిత్రం | : | మనసంతా నువ్వే | బ్యానర్ | : | సుమంత్ ఆర్ట్ ప్రొడక్షన్స్ |
| నిర్మాత | : | ఎం.ఎస్.రాజు | దర్శకత్వం | : | వి.యన్.ఆదిత్య |
| సంగీతం | : | ఆర్.పి.పట్నాయక్ | ఈ పాట రచన | : | 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి |
| గానం | : | సంజీవని, ఉష | అభినయం | : | మాస్టర్ ఆనంద్‌వర్ధన్,జీబా |

# తూనీగా తూనీగా...



ఎం.ఎస్.రాజు



వి.యన్.ఆదిత్య



ఆర్.పి.పట్నాయక్



సిరివెన్నెల



సినిమాల్లో చిన్న పిల్లలు పాడుకునే పాటలు అనే టాపిక్‌ని దాదాపు ఒక ఎక్స్‌పరిమెంట్‌గా భావించే రోజులివి. ట్యూన్‌తో ఏదోరకమైన బంధమే తప్ప పాత్ర స్వభావం, ఔచిత్యంతో అసలు సంబంధం లేని మాటలలో పాటలొచ్చేస్తున్న ఈ తరుణంలో జీవన పయనంలో తొలి మజిలీని కూడా స్పృశించని పసిపిల్లలు సైతం పాడుతున్న లేదా పాడుకుంటున్న పాటలను గమనిస్తే అనర్థానికి ఎక్కువ అపార్థానికి తక్కువ అనే స్థాయిలో పాటలు ఉత్పత్తి అవుతున్న ప్రస్తుత వాతావరణంలో -

ఒక పిల్లల పాట - ప్రాయాన్ని మించని భాషతో రావటం వ్యాపార రీత్యా విడ్డూరం! సాహసం!! అభిరుచి రీత్యా అపురూపం-అభినందనీయం!!

అదే - 'మనసంతా నువ్వే' సినిమాలో 'తూనీగా తూనీగా' పాట! పాట సాహిత్యాన్ని జాగ్రత్తగా గమనించండి... అర్థంకాని మాట ఒక్కటైనా ఉండదు.





| | | |
|---|---|---|
| పల్లవి | : | తూనీగా తూనీగా |
| | | ఎందాక పరిగెడతావే |
| | | రావే నా వంక |
| | | దూరంగా పోనిక |
| | | ఉంటాగా నీ వెనకాలే రానీ సాయంగా |
| | | ఆవంకా ఈ వంకా తిరిగావే ఎంచక్కా |
| | | ఇంకానా చాలింక ఇంతేగా నీరెక్కా |
| | | ఎగిరేనా ఎప్పటికైనా ఆకాశం దాకా |
| చరణం 1 | : | దోసిట్లో ఒక్కో చుక్కా పోగేసి ఇస్తున్నాగా |
| | | వదిలేయకు సీతాకోక చిలకలుగా |
| | | వామ్మో బాగుందే చిట్కా నాకు నేర్పిస్తే |
| | | చక్కా |
| | | సూర్యుణ్ణే కరిగిస్తాగా చినుకులుగా |
| | | సూర్యుడు ఏడి |
| | | నీతో ఆడి |
| | | చందమామ |
| | | అయిపోయాడుగా |
| చరణం 2 | : | ఆ కొంగలు ఎగిరి ఎగిరి |
| | | సాయంత్రం గూటికి మళ్ళీ |
| | | తిరిగొచ్చే దారిని ఎప్పుడూ మరచిపోవెలా |
| | | ఓ సారటు వై పెళుతుంది |
| | | మళ్ళీ ఇటు వైపొస్తుంది |
| | | ఈ రైలుకి |
| | | సొంతూరేదో గురుతురాదెలా.... |
| | | కూకూ బండి మా ఊరుంది |
| | | ఉండిపోవె మాతో పాటుగా.... |

బాల్యావస్థలో అనుభవానికి రాని భావం అస్సలు ఉండదు. మచ్చుకు - కొంగలకి తిరిగొచ్చే దారెలా గుర్తుంటుంది... రైలుబండికి సొంతవూరేది...!! ఇలా!!!

సినిమా చూసి ఈ పాటను గనుక ఒక్కసారి కథతోపాటు నెమరేసుకో గలిగితే కథకి, పాట సాహిత్యానికి ఎంత చక్కగా రచయిత ముడిపెట్టాడో తెలుస్తుంది.

ఇద్దరు పిల్లలు పెద్దాళ్ళయి ఒకరి కోసం ఒకరు వెతుక్కుంటూ, దగ్గరైన తర్వాత ఒకరికొకరు అందని పరిస్థితిలో ఉంటూంటే - ఆ సన్నివేశాలకి పల్లవిలోని సాహిత్యానికి అన్వయించుకు చూడండి. ఆ ఇద్దరు పిల్లలు ఒకరికొకరు తూనీగలనుకొని ఆలోచించండి. ఎంత చక్కగా కుదిరిందో అర్థమవుతుంది.

కొంగలు ఎంత దూరం ఎగిరినా 'అసంకల్పిత అంగీకారచర్య'లా తిరిగి తమ గూటికి చేరిపోయినట్టు, హీరోయిన్ (రీమాసేన్) హీరో (ఉదయ్ కిరణ్)ని చేరగలిగింది. కానీ హీరో గుర్తించే స్థితిలో లేడు - హీరోయిన్ కోసం వెతుకుతున్నాడు. మధ్యలో సెకెండ్ హీరోయిన్ పక్కకి కథ కాస్త మళ్ళుతుంది. 'ఓ సారటు వైపెళుతుంది - మళ్ళీ ఇటు వైపొస్తుంది- ఈ రైలుకి సొంతూరేదో గురుతురాదెలా!?' అనే వాక్యాలు ఈ సన్నివేశాలకు సరిపోయేలా ఉంటాయి. అవి అలా ఉండగా...

ఆశీర్వచనం, నమస్కారం, వస్తునిర్దేశం... ఇవన్నీగాని, కొన్నిగాని ముందుగా సూచించటం కావ్య మర్యాద లక్షణాలు... అంటే కావ్యాలన్నీ ఎవరినైనా ఆశీర్వదిస్తూగాని, ఎవరికైనా నమస్కృతులు అర్పిస్తూగాని, ఎంచుకున్న వస్తువు ఇది అని సూచించే ఉపోద్ఘాతంతో గాని మొదలవుతాయి.

అటువంటి కావ్య మర్యాద ఈ పాటలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. కళ్ళు మూసుకుంటే దృశ్యానుభూతి 'మనసంతా నువ్వే' అనే స్థాయిలో ఆక్రమించుకుంటుంది. వసంతకాలం వస్తే కాకి ఏదో కోకిల ఏదో తెలిసిపోయినట్టుగా ఇలాంటి అవకాశాలు వచ్చినప్పుడే 'జమ అయిన' కవికి, 'నిజమైన' కవికి గల తేడా తెలిసిపోతుంది.

సూర్యుణ్ణి చినుకులుగా కరిగిస్తాగా అని అంటే 'సూర్యుడు ఏడీ... నీతో ఆడి చందమామ అయిపోయాడుగా...' అని బదులివ్వటంలో పాట అనే త్రాసులో కవి చమత్కారం ఒకవైపు భావుకుడి సృజనాత్మక బలం మరొకవైపు అటూ ఇటూ అయి నిలిచాయి. 'ప్రాయాన్ని మించిన భాష' అనే ముల్లు(?)లాంటి సూచికను గమనిస్తూ సమతూకంలో నడిపించాడు సీతారామశాస్త్రి.

సంగీత పరంగా చూసుకుంటే ఆకర్షణీయమైన ట్యూన్ ఒక ఎత్తయితే ఆర్కెస్ట్రయిజేషన్ మరొక ఎత్తు. షెహనాయ్, బ్యాగ్ పైపర్, మిజ్‌మైర్ అనే వాద్యాలు కీబోర్డులో పలుకుతాయి. ఈ మూడింటిని కీబోర్డ్‌లో మిక్స్ చేస్తూ ట్రాక్‌లో లైవ్ షెహనాయ్‌ని మరొక లేయర్‌తో కలుపుకుంటూ కావలసిన ఎఫెక్ట్‌ని అనూప్ అనే కీబోర్డ్ ప్లేయర్ ద్వారా రాబట్టుకున్నాడు సంగీత దర్శకుడు ఆర్.పి.పట్నాయక్. బ్యాగ్ పైపర్‌ని షెహనాయ్‌తో మిక్స్ చేయటం అనే ప్రక్రియ శంకర్-జైకిషన్ స్వర రచనలతో మనకు బాగా తెలుస్తూ ఉంటుంది. దొరికితే ఏవీయమ్ వారి 'చోరీ చోరీ' సినిమాలో శంకర్-జైకిషన్ స్వరపరచగా లత పాడిన 'పంఛీ బనూ ఉడ్‌తీ చలూ మస్త్ గగన్‌మే ఆజ్ నయా ఆజాద్‌కి దునియాకి గగన్‌మే' అనే పాటని విని చూడండి. ఇక బ్యాగ్ పైపర్ వాయిస్తే ఎలా ఉంటుందో 'సంగమ్'లో 'బోల్ రాధా బోల్ సంగమ్ హోగాకే నహీ' పాటని విన్నవాళ్ళకి, చూసిన వాళ్ళకి అనుభవమే! ఇదిలా ఉండగా రిథమ్‌లో తబలాని, డ్రమ్ బీట్‌ని మిక్స్ చేస్తూ టూ -ఫోర్ లో (2/4) వాయిస్తూ హార్స్‌బీట్ టెంపోని జత చేయటం వల్ల ఈ 'తూనీగా తూనీగా' పాటకి ఒక అందమైన ఊపు, చందమైన తూగు చేకూరాయి.

ఇవన్నీ తెరవెనుక... ఇక తెరమీది కొచ్చేసరికి... అరకులోయ, వర్షపు వాతావరణం, పచ్చపచ్చని చేలు, మట్టి రోడ్డు మీద వెళుతున్న జీపులో చిన్నమ్మాయి, ఆ వెనకే సైకిల్ టైర్‌ని కర్రపుల్లతో దొర్లించుకుంటూ పరుగెత్తే కుర్రవాడు, వాళ్ళిద్దరూ... మేకపిల్లకి క్యారెట్ తినిపించటం, వర్షంలో తడుస్తూ ఉయ్యాల లూగటం, తూనీగకి క్లిప్పు పెట్టడం, సీతాకోక చిలుక బట్టలకు పట్టుకొని ఒదలకుండా ఉండటం, రైలు పట్టాల పక్కనే ఉన్న మట్టి గుట్టలపై ఎక్కికూర్చుని అటూ ఇటూ వెళుతున్న రైళ్ళని చూడటం, ఆ పిల్లలిద్దర్నీ కావిడికి చెరోవైపున కూచోపెట్టుకొని మోసుకుపోయే ఓ కాపరి... ఇలాంటి సహజాతిసహజమైన షాట్లతో వీనుల విందైన పాటని కనువిందుగ ప్రేక్షకుల ముందుంచాడు దర్శకుడు ఆదిత్య.

'మనసంతా నువ్వే' చిత్రకథకుడిగా, నిర్మాతగా ఎమ్మెస్ రాజు ఈ పాట విషయంలో ఎంత బాధ్యతగా వ్యవహరించారన్న విషయాన్ని ఇదే సంచికలో 'ఇష్టపది' శీర్షిక నుంచి తీసుకుని, పైన ఉదహరించిన వాటితో కలుపుకుంటూ, పాటని మరొకసారి విని చూడండి... పాట మీ హృదయంలో జీవితాంతం తిష్టవేసుకుని ఉండిపోతుంది.

పాట అనే ప్రక్రియకుండే లక్షణం గాని లక్ష్యం గానీ అవేగా!

# న్యూస్ వ్యూస్

## ఉవాచ



"నాటకం, సినిమా, టీవీ - ఒక రంగం నుండి మరొకదానికి నేను అతి సులభంగా మారగలిగాను. ఈత వచ్చిన వాడికి చెరువైనా, బావైనా ఒకటే!"

-హాస్యనటుడు పద్మనాభం

"సంగీతరంగంలో చాలా దురదృష్టకరమైన పరిణామాలు వస్తున్నాయి. సాహిత్య పరంగా పాటల స్థాయి పడిపోయింది. హిందీభాష గురించి సరైన అవగాహన లేకుండానే చాలామంది హిందీ సినిమాలు తీస్తున్నారు. వాళ్లకు పరిచయమున్న కొద్దిపాటి మాటలు మాత్రమే ఉపయోగించి పాటలు రాయవలసి వస్తోంది. ఏదైనా మంచి పదం, వాళ్లకు తెలియనది, వాడాలంటే వంద సంజాయిషీలు చెప్పుకోవలసి వస్తోంది".

-గుల్జార్

"90 సినిమాలలో కథా నాయకుడిగా వేసి నవ్వించిన నేను ప్రస్తుతం నా నటజీవిత ద్వితీయార్థంలో ఓ వైవిధ్యమైన విలన్ పాత్ర చేసి ప్రేక్షకులను భయపెట్టాలని ఉంది".

-నరేష్



చాప్లిన్ హాస్యాన్ని హిందీ ప్రేక్షకులకు పంచి యిచ్చిన రాజ్‌కపూర్ జన్మదినం డిసెంబరు 14. ఈ ఏడాది జన్మదినోత్సవ సందర్భంగా ఆయన గౌరవార్థం పోస్టల్ డిపార్టుమెంటు ఒక స్టాంపును విడుదల చేసింది.

## బలవంతపు డాక్టరీ...



ఫ్రెంచ్ నాటక కారుడు మోలియర్ 1660లో రాసిన 'ది డాక్టర్ ఇన్ స్పైట్ ఆఫ్ హిమ్‌సెల్ఫ్' ఆయన ప్రసిద్ధికెక్కిన నాటకాల్లో ఒకటి. స్థూలంగా కథ ఇలా సాగుతుంది: ఒక కట్టెలు కొట్టేవాడు ఓ రోజు కోపంవచ్చి భార్యను నాలుగు తంతాడు. దాంతో ఆమెకు కోపం వచ్చి 'నీ పని చెప్తానుండు' అని కసిపెంచుకుంటుంది. ఓ డబ్బున్నాయన కూతురికి సడన్‌గా మాటపోతే దాన్ని నయంచేసే వైద్యుడి కోసం వెతుకుతూ ఇద్దరు మనుష్యులు వస్తారు. ఈ భార్య వాళ్ళతో తన భర్త బ్రహ్మాండమైన డాక్టరనీ, కానీ తిక్క మనిషి కాబట్టి ఆ ముక్క ఒప్పుకోడనీ చెప్పి ఉసిగొలుపుతుంది. దాంతో వాళ్ళు కట్టెలు కొట్టేవాణ్ణి నాలుగు తన్ని 'నాకు వైద్యం రాదు మొర్రో' అన్నా వినకుండా లాక్కెళతారు. ఇక తప్పదురా దేవుడా అని వాడు నాలుగు ముక్కలు బట్టీపట్టి అవీ ఇవీ పేలితే ఆ డబ్బున్నాయన, ఆయనింట్లో పనివాళ్ళు ఇంప్రెస్ అయిపోతారు. ఓ పనమ్మాయి మన దొంగవైద్యుడితో ప్రేమకలాపం సాగిస్తుంది కూడా - మధ్యలో దాని మొగుడు అడ్డం పడి వాళ్ళ ప్లాన్లన్నీ భగ్నం చేస్తున్నా...! మన డాక్టరుగారు గుండెకాయ కుడి చేతివైపు ఉందన్నా, లివర్ ఎడమ చేతివైపు ఉందన్నా పేషంటుకి నయం అయిపోతుంది. అసలు కథేమిటంటే. ఆమెకు ఏరోగమూ లేదు. ఒకతన్ని ప్రేమించింది. బలవంతంగా తన తండ్రి ఇంకోరితో పెళ్ళి చేయబోతూంటే తప్పించుకోవడానికి వేసిన నాటకం అది!

ఈ నాటకాన్ని నవంబరు 28న హైద్రాబాదులో 'ఎక్స్‌ప్రెషన్స్' బృందంవారు ప్రదర్శించారు. అందరి అభినయాలు బాగున్నా సాంకేతిక విలువలు దెబ్బతిన్నాయి.

## మరో గాంధారశిల్పం...?



క్రీస్తు పూర్వం భారతీయులు, గ్రీకులు తమ శిల్పకళను మేళవిస్తే గాంధారశిల్పం తయారయింది. మరి క్రీస్తు శకం 21వ శతాబ్దంలో గానకళలను మేళవిస్తే..? స్టాఫానోస్ కోర్కోలిస్ గ్రీసు దేశంలో ఓ పెద్ద మెగా-స్టార్. అతనికి మన ఇండిపాప్ సింగర్ అనైదా పాటంటే మక్కువ. అందుచేత తను సంగీతం సమకూర్చిన కొత్త ఆల్బమ్‌లో ఆమె పేర ఒక పాట పెట్టాడు. గ్రీసులో చిత్రీకరించిన ఈ పాటలో ఆమెతో కలిసి పాడాడు కూడా. ఆ పాట ప్రధానంగా గ్రీకుభాషలోనే ఉన్నా అనైదా పోర్షన్ మాత్రం హిందీలోనే ఉంటుంది. పాటలో గ్రీకు భాగం స్టాఫానోస్ రాస్తే, హిందీ భాగం బషీర్ షేఖ్ రాసారు. బి.యమ్.జి. క్రెసెండో వాళ్ళు రిలీజ్ చేసిన 'ది గ్రేటెస్ట్ హిట్స్ ఆఫ్ అనైదా'లో ఈ పాట లభ్యమవుతోంది. మ్యూజిక్ ఛానెల్స్‌లో కూడా వేస్తున్నారు.

## కామెడీద్వారా యశస్సు పొందిన యస్వీశేఖర్

తమిళ నాటకరంగం నుండి చలన చిత్ర రంగానికి వచ్చిన ఎస్వీ శేఖర్ మాతృ రంగాన్ని వదలలేదు. స్టేజిపై, సినిమా తెరపై హాస్యనటుడిగా ఎంతో పేరు తెచ్చుకున్న ఈ నటుడు గత పక్షం డిసెంబరు 8, 9 తారీకులలో హైదరాబాదులో తమిళ హాస్య నాటికలు ప్రదర్శించారు. ఇప్పటివరకు 22 కామెడీ డ్రామాలలో నటించి, 4300 ప్రదర్శనలు ఇచ్చాడాయన. ఒకసారి 28 రోజుల్లో 32 ప్రదర్శనలు ఇచ్చాడు. ఇంకోసారి 90 రోజుల్లో 110 షోస్. మరోసారి ఒకే రోజున 8 ప్రదర్శనలు ఇచ్చాడు. దీన్ని గిన్నెస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌కు పంపిస్తే మాకు అటువంటి కేటగిరీ ఏదీ లేదు, రికార్డు చేయడానికి అన్నారు వారు. లిమ్కావారు మాత్రం వేసుకున్నారు. ఆయన ఒక టీవి షోలో వింత ప్రయోగం చేశాడు. "ఎస్వీ శేఖర్ మీట్స్ ఎస్వీ శేఖర్" అనే ప్రోగ్రాంలో ఇంటర్వ్యూ చేసేవారు, చేయబడే వారు ఇద్దరూ ఒకరే కావడం విశేషం. ఇది కూడా లిమ్కా బుక్‌లోకి ఎక్కింది. ఆయన నటించిన తొలి టీవి సీరియల్ "వణ్ణకోలంగళ్" (రంగుల రంగవల్లులు) 8 సార్లు రీ - టెలికాస్టు అయి రికార్డు సృష్టించింది.



కుటుంబ తరహా హాస్యానికి పేరుబడ్డ శేఖర్ ఇప్పుడు 'పెరియప్పా' అనే పొలిటికల్ సైటర్ చేస్తున్నారు. "చో రిటైరయిపోయాక తమిళ నాటక రంగంలో ఏర్పడిన ఖాళీని భర్తీ చేయడానికే ఈ ప్రయత్నం" అన్నారు శేఖర్.

## మనసంతా నువ్వే



అభిరుచి ఉన్న నిర్మాతగా పేరు తెచ్చుకున్న వ్యక్తి ఎమ్మెస్‌రాజు. ఒక నిర్మాతగానే కాకుండా ఒక కథకుడిగా కూడా తన టేస్ట్ ఎలాంటిదో 'మనసంతా నువ్వే' ద్వారా ఋజువు చేశాడాయన. ప్రస్తుతం ఆడియో పరంగాను, సినిమా పరంగాను కలక్షన్ల వర్షంలో తడిసి ముద్దయిపోతున్న 'మనసంతా నువ్వే'లో 'మీకు నచ్చిన పాట ఏదని ఎమ్మెస్ రాజు గారిని అడిగితే 'తూనీగా తూనీగా' పాటని 'పేర్కొన్నారాయన. ఆ పాట అనుభవాలు చెబుతూ - "పసి హృదయాలు సింపుల్‌గా వెలిబుచ్చే అభిప్రాయాలు, ఒక ఏజ్‌కి ఎదిగాక కూడా గుర్తుండి పోయే వాక్యాలు - ఇవన్నీ ఈ పాట నాకు నచ్చడానికి కారణాలు. కావల్సిన ట్యూన్ సెలెక్ట్ చెయ్యడానికి చాలా టైమ్ తీసుకున్నాం. ఈ పాటకి సీతారామశాస్త్రి గారు ఒకే ఒక వెర్షన్ రాశారు. అదే ఓకే అయింది. లేకపోతే రెండు రోజుల పాటు రాత్రి పగలు అనుకుండా ఒకటే ఆలోచన! రెండో రోజు అర్ధరాత్రి ఒకటిన్నరకో రెండుకో సీతారామశాస్త్రి గారు 'తూనీగా తూనీగా' అని అన్నారు. ఆ ఓపెనింగ్ కోసమే వెయిట్ చేశాం. ఆ రోజే అనుకున్నాను. ఈ పాట పెద్ద రేంజ్‌లో హిట్ అవుతుందని అలాగే అయింది. పిల్లలు - ఆనందవర్ధన్, జీబా కూడా బాగా చేశారు. ఆ పాట అరకులో తీశాం. భరించలేని చలి, వర్షం ఎఫెక్ట్ కోసం ఫైరింజన్లు అనీ తెప్పించాం. ఆనంద వర్ధన్‌కి జ్వరం వచ్చేసింది. అయినా పాటకి బాగా ఇన్‌స్పైర్ అయి ఆ వర్షంలో జ్వరంతోనే బాగా చేశాడా కుర్రాడు. అలాగే ఆ అమ్మాయి జీబా కూడా బాగా చేసింది. అందుకే షూటింగ్ అయ్యాక ఒకరికి వాచ్, ఒకరికి గోల్డ్‌చెయిన్ స్పెషల్‌గా ఇచ్చాను" అని వివరించారు ఎమ్మెస్ రాజు.




## స్టూడెంట్ నెం.1



ప్రస్తుతం తెలుగు సినీ సంగీత ప్రపంచంలో ఎక్కువగా వినిపిస్తున్న పేర్లలో చక్రి పేరు ఒకటి. అతను కేవలం నాలుగైదు సినిమాలే చేసినప్పటికీ, అందులో ఒక్క సక్సెస్సే ఉన్నప్పటికీ మ్యూజిక్ డైరెక్టర్‌గా అతని రేంజ్ పెరిగింది. ఇప్పుడతను ఐదారు సినిమాలకి సంగీతాన్ని సమకూరుస్తూ బిజీగా ఉన్నాడు. క్వాంటిటీ కన్నా క్వాలిటీకి ప్రాధాన్యత నిచ్చే చక్రికి కీరవాణి సంగీతానిచ్చిన 'స్టూడెంట్ నెం.1'లో నచ్చిన పాట ఏదని అడిగితే ఇలా చెప్పుకొచ్చారు.

'ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి ఇక్కడే కలిశాము' పాట నాకు బాగా నచ్చింది. వయోభేదం లేకుండా అందరికీ నచ్చే పాట ఇది. ప్రతి ఒక్కరూ ఈ పాట వింటూ తమ కాలేజ్‌లైఫ్‌ని గుర్తుకు తెచ్చుకుంటున్నారు. తీపి జ్ఞాపకాలను మళ్ళీ నెమరు వేసుకుంటున్నారు. ఈ పాట వినగానే నిజంగా నా కాలేజ్ లైఫ్ అంతా గుర్తుకొచ్చింది. దాంతో మనసంతా నిండిపోయినట్టు అనిపించింది. కొద్దిగా కళ్ళల్లో నీళ్ళూరాయి కూడా. పాట విన్న వెంటనే చంద్రబోస్‌కి ఫోన్ చేసి నా ఫీలింగ్స్ చెప్పాను. సాహిత్యం, మరో పక్క సంగీతం చాలా హార్ట్ టచింగ్‌గా వున్నాయి" అన్నాడు చక్రి ఉద్వేగ భరతంగా.

## నువ్వు - నేను



నువ్వు - నేను 100 రోజుల పండుగను పూర్తి చేసుకొని 175వ రోజుకి ఎటువంటి సమస్యా లేకుండా చేరుకోబోతోంది. ఇన్నాళ్ళయినా ఆడియో విషయంలో ఆదరణ ఏ మాత్రం తగ్గలేదు. సికింద్రాబాద్ సంగీత్ సాగర్ ఫ్లోర్ మేనేజర్ దేవరాజ్ అదే మాటన్నారు. "గాజువాక పిల్లా పాట ఈ జనరేషన్‌కి బాగా పట్టేసిందండీ. వచ్చిన కష్టమర్లు ఇంకో క్యాసెట్ కొనడానికి వచ్చినా ఈ పాటని మీ సిస్టమ్‌లో వినిపించండి అని అడిగి మా స్పీకర్‌లో విని మరింత ఆనందపడుతున్నారు. ఇవాళ్టికీ మా ఒక్క షాపులోనే రోజుకి 10-15 సీడీలు, 50-60 క్యాసెట్లు 'నువ్వు నేను'వి అమ్ముడవుతున్నాయి" అని అన్నారు దేవరాజ్.

## నువ్వు నాకు నచ్చావ్



'నువ్వు నాకు నచ్చావ్' వంద రోజులు పూర్తి చేసుకుని ఇంకా విజయవంతంగా ప్రదర్శితమవుతోంది. బిజీ లిరిక్ రైటర్ కులశేఖర్‌ని ఈ సినిమాలో తనకు నచ్చిన పాట ఏదని అడిగితే 'ఒక్కసారి చెప్పలేవా నువ్వు నచ్చావని' పాటను పాడి మరీ వినిపించారు. ఈ పాట మిమ్మల్ని అంతగా ఆకట్టుకోవడానికి కారణమేమిటో చెప్పమంటే కులశేఖర్ ఇలా వివరణ ఇచ్చారు.

"ఈ పాటలో 'మన గుండె గుప్పెడంతా తన ఊహ ఉప్పెనంతా' అన్న వాక్యం సూపర్బ్‌గా వుంది. దాన్ని మించి వేరే ఎక్స్‌ప్రెషన్ లేనే లేదు. గురువుగారు సీతారామశాస్త్రి గారికి హేట్సాఫ్. ఆయనకి కాంప్లిమెంట్ ఇచ్చేంత సమర్థుడిని కాదు గానీ, ఆ ఎక్స్‌ప్రెషన్ మాత్రం నన్ను పట్టి కుదిపేసింది. ఇలాంటి ఎక్స్‌ప్రెషన్‌లు ఆ పాటలో ఇంకా చాలా వున్నాయి. అందుకే ఈ పాటని నేను బాగా ప్రేమించాను."

## ఆనందం




'ఆనందం' సినిమాప్లస్ ఆడియో ఈ రెండూ మొదట్లో స్లోగా పికప్ అయి తర్వాత అద్భుతమైన ఊపందుకున్నాయి. ఈ క్యాసెట్ గురించి సికింద్రాబాద్ సంగీత్‌సాగర్ సేల్స్ రిప్రజంటేటివ్ అబ్దుల్ ఈ క్యాసెట్ గురించి మాట్లాడుతూ "షాపుకి వచ్చిన వాళ్ళకి ముందు - ఇవి కొత్త రిలీజులండీ అని చెబుతూ ఉంటాం. అవన్నీ విని 'సరేగానీ ఆనందం ఉందా!?' అని అడుగుతున్నారు. ముఖ్యంగా 'కనులు తెరచినా కనులు మూసిన కలలు ఆగవేలా' పాటన్ని క్యాసెట్ కొనేటప్పుడు టెస్ట్‌గా వింటామని చెప్పి మొత్తం పాటంతా విని ఆ తర్వాతే కొంటున్నారు" అని అన్నారు.

## డాడీ



మొదట్లో కొన్ని సినిమాల్లో హీరోగానూ, మెయిన్ విలన్‌గానూ నటించిన రాజారవీంద్ర ప్రస్తుతం ఇంపార్టెంట్ కేరెక్టర్స్ చేస్తున్నారు. 'అందం' మొదలైన సీరియల్స్ ద్వారా బుల్లితెర ప్రేక్షకుల్లో ఓ స్పెషల్ క్రేజ్‌ను కూడా సంపాదించుకున్నారాయన. చిరంజీవికి ఎప్పుడూ సన్నిహితంగా మెలిగే రాజా రవీంద్ర 'డాడీ' సినిమాలో నెగిటివ్ కేరెక్టర్ పోషించారు. ఈ సినిమాలో ఆయనకి నచ్చిన పాట ఏమిటో తెలుసుకుందాం.

"లక్కీ లక్కీ ఎంతెంతో లక్కీ, ఈ లోకంలో పుట్టడమే లక్కీ లక్కీ లక్కీ" పాటంటే నాకు బాగా ఇష్టం. మనిషి జీవితంలో ఎలా వుండాలో మంచి వివరణ ఇచ్చారు పాటలో. ఓ సరికొత్త ఆశావాద దృక్పథం వుందీ పాటలో. చంద్రబోస్ కలం చిందులు బాగున్నాయి."

## ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం



ఇటు బుల్లితెరపైన, అటు వెండి తెరపైన చక్కటి నవ్వులు జల్లులు కురిపిస్తూ మంచి హాస్యనటుడు అనిపించుకున్నారు గౌతంరాజు. 'ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం'లో ఆయనది ఐదారు సీన్ల పాత్ర అయినా గానీ బాగా పేలింది. ఆయనకి మంచిపేరు తీసుకువచ్చిన ఆ సినిమాలో తనకి నచ్చిన పాట ఏమిటని అడిగితే

"హేపీ డే హేపీడే .... అమెరికానే ఎన్నారైనా ఏలినట్టుంది పాట అదిరింది. ఓ పక్క ట్యూన్ ఇరగదీస్తే, మరోపక్క రవితేజ అదరగొట్టాడు. ఈ పాటలో రవితేజ స్ప్రింగ్‌లా నర్తించాడు. ఈ పాట టీవీలో వస్తే చాలు. మా పిల్లలు, మా అన్నయ్య గారి పిల్లలు సౌండ్ బాగా పెట్టుకుని డాన్సులు వేస్తున్నారు. ఇక నా గురించి చెప్పాలంటే నేను కూడా ఆ పాట చూస్తూ స్ప్రింగ్‌లా ఊగుతున్నాను. నా డ్యాన్స్ చూసి మా పిల్లలు నవ్వుతున్నారనుకోండి" అని సరదాగా చెప్పుకొచ్చారు గౌతంరాజు.

## భద్రాచలం



'ఎన్‌కౌంటర్' సినిమాతో దర్శకుడై 'శ్రీరాములయ్య', 'జయం మనదేరా' మొదలైన హిట్ సినిమాలు చేసిన యువదర్శకుడు ఎన్.శంకర్. శ్రీహరి హీరోగా రూపొందించిన 'భద్రాచలం' పనికిమాలిన వాడని అనిపించుకున్న ఓ పల్లెటూరి యువకుడు తన దేశ కీర్తిపతాకను ప్రపంచమంతా ఎలా ఎగరవేసాడన్నదే ఈ చిత్ర కథాంశం. ఈ సినిమాలో ఒక ఫీల్, పాజిటివ్ యాటిట్యూడ్ వున్నాయి. ఈ సినిమాలో తనకు నచ్చిన పాట గురించి ఎన్.శంకర్ ఇలా వివరణ ఇచ్చారు. "ఒకటే జననం - ఒకటే మరణం, ఒకటే గమనం - ఒకటే గమ్యం, గెలుపు పొందే వరకూ అలుపు లేదు నీకు' అన్న పాటకే నేను ఫస్ట్ ర్యాంక్ ఇస్తాను. ఈ పాట కోసం చాలా పెద్దతతంగమే జరిగింది. గీత రచయిత సుద్దాల అశోక్ తేజ ఎన్ని పల్లవులు రాసినా నాకు నచ్చలేదు. ఇక వేరే వారితో రాయించాలనుకుని ఆఖరి ఛాన్స్‌గా 'ఏ మనిషి అయినా జననం, మరణం మధ్య వున్న కాలంలోనే ఏదైనా సాధించగలగాలి' అని చెప్పగానే అశోక్ తేజ ఉత్సాహంగా, 'ఒకటే జననం - ఒకటే మరణం, ఒకటే గమనం - ఒకటే గమ్యం' అని పల్లవి చెప్పారు. వెంటనే పాట ఓకే అయ్యింది. ఈ పాటలో మంచి సందేశం వుంది. సృష్టిలో పుట్టిన ప్రతి వ్యక్తి ఏ రంగంలోనైనా సరే ఏదైనా సాధించగలగాలి. అప్పుడైనా మిగతా వారికి ప్రేరణగా నిలుస్తాడు. అందుకే ఈ పాట నా మనసుని హత్తుకుంది" అన్నారు శంకర్.

## జాబిలి



'జాబిలి' సినిమాలో ఎమ్మెస్ నారాయణ కామెడీ మంచి హైలెట్ అయ్యింది. ప్రిన్సిపాల్ పాత్రలో ఆయన ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించారు. ఈ సినిమాలో తనకు నచ్చిన పాట గురించి ఆయన ఇలా వివరించారు.

"ఎస్వీ కృష్ణారెడ్డిగారి సినిమా పాటల్లో ఓ వైవిధ్యం కనిపిస్తుంది. ఈ సినిమాలో పాటల్లో కూడా అలాంటి వైవిధ్యం వుంది. ముఖ్యంగా 'గంగా యమునా గోదారి పుట్టిన చోట చూడు, ఒక్కో బొట్టే నీరై ఊరి ఏరై పారి నదిలా పొంగింది' పాట ఎక్స్‌ట్రార్డినరీగా వుంది. ఎక్స్‌ట్రా ఎనర్జిటిక్‌గా వుంది. పల్లవి చరణాల్లో పాజిటివ్ థింకింగ్ ఇమిడి వుంది. పాటలో యూత్‌కి మంచి మెసేజ్ వుంది. 'నువ్వే నీ సైన్యం కావాలి - నీ విశ్వాసం ఊపిరి నిండాలి, ఆ నింగి టార్గెట్టవ్వాలి - ఆశల సౌధం మన చుక్కానవ్వాలి' అన్న వాక్యాలు నాకు బాగా నచ్చాయి. 'నల్లని రాళ్ళను ఉలితో చెక్కి డిజైను చేస్తే శిల్పారామం, ప్రతి నిమిషాన్ని ప్రేమతో చెక్కి డిజైను ఇస్తే లైఫే శిల్పం' అని ఫినిషింగ్ టచ్ ఇవ్వడం బాగుంది. సుద్దాల అశోక్ తేజ చాలా బాగా రాసారీ పాటను".

## సుబ్బు



ఒక సంగీత దర్శకుడు మరో సంగీత దర్శకుడితో పాట పాడించడమనే ప్రక్రియ ఈ మధ్య అధికమైంది. ఇది మంచి సంప్రదాయంగానే పేర్కొనాలి. ఐదారు సినిమాలతోనే టాప్‌రేంజ్‌కి చేరుకున్న పట్నాయక్ ఇంతవరకూ తన సినిమాల్లోనే తప్ప బయట సినిమాల్లో పాడటమనేది జరగలేదు. అయితే ఇప్పుడాయన తొలిసారిగా 'సుబ్బు' సినిమాకి గాయకుడిగా పని చేసారు. ఈ సినిమాలో 'మస్త్ మస్త్ సంగతుంది' అనే పాటను అడిగి మరీ పాడించుకున్నారు మణిశర్మ.

ఈ విషయాన్ని పట్నాయక్ వివరిస్తూ - "ఫస్ట్ టైమ్ వేరే మ్యూజిక్ డైరెక్టర్ దగ్గర పాడటం జరిగింది. నా సినిమా కోసం మణిశర్మ థియేటర్‌కి వెళ్ళినప్పుడు ఆయన పిలిపించి 'సుబ్బు'లో పాట పాడమని అడిగారు. రిహార్సల్స్ చేయడం, పాట పాడడం, ఫైనల్ చేయడం.... ఇదంతా నలభై ఐదు నిమిషాల్లోనే జరిగిపోయింది" అని అన్నారు. ఈ పాటని మీతోనే పాడించాలని మణిశర్మ ఎందుకనుకున్నారని ప్రశ్నిస్తే - "ఆయన నాతో పాడించాలని ఎప్పట్నుంచో అనుకుంటున్నారు. అది ఇప్పటికి కుదిరింది. ఈ పాటని తెలుగు సింగర్‌తోనే పాడించాలని అనుకున్నారట. అనుకోకుండా నేను కలవడం, పాడటం జరిగింది" అని తెలిపారు పట్నాయక్. మీ పాటకి మణిశర్మ రెస్పాన్స్ ఏమిటని అడిగితే - "అది చాలా ఫాస్ట్ సాంగ్. నేను కూడా చాలా ఫాస్ట్‌గా పాడానని మెచ్చుకున్నారు. ఒక అగ్రశ్రేణి సంగీత దర్శకుడి ఆధ్వర్యంలో పాట పాడటం చక్కటి మధురానుభూతిని కలిగించింది" అని చెప్పారు పట్నాయక్.

## బాలీవుడ్ పై ప్యారడీ... 'బాలీవుడ్ కాలింగ్' ...



నగేష్ కుకునూర్ తన దర్శకత్వంలో తీసిన 'బాలీవుడ్ కాలింగ్' అనే కొత్త ఇంగ్లీషు సినిమా అందరి ప్రశంసలు అందుకుంటోంది. హిందీ సినిమాల తీరుతెన్నులపై తీసిన కామెడీ ఇది. వేషాల్లేని ఇంగ్లీషు నటుడొకడు ఇండియన్ సినిమాలో నటించడానికి ఒప్పుకొని ఇక్కడ పరిస్థితులు మింగుడు పడక ఇబ్బంది పడడం గురించి తీసిన సినిమా ఇది. సినిమా తీనస్తాండగా స్క్రిప్టు రాసుకోవడం, అన్నటైముకు యూనిట్ సభ్యులెవరూ రాకపోవడం, చిన్నప్పుడు తప్పిపోయి, చివర్లో అందరూ తిరిగి కలవడం లాటి థీమ్‌తో కథలు, - ఇవన్నీ చూసి మతిపోతుంది ఆ నటుడికి. దీనిలో ఇండియన్ డైరక్టరుగా ఓమ్ పురి అదరగొట్టేసాడట! పొగరుబోతు ఇండియన్ హీరోగా నవీన్ నిశ్చల్, ఏ దారిలోనైనా పైకి వచ్చేయాలని చూసే హీరోయిన్‌గా పెరిజాద్ జోరబియాన్ నటించారు.

ఈ సినిమాతీయాలన్న ఐడియా ఎలా వచ్చిందని డైరక్టరు నగేష్ కుకునూర్‌ను అడిగితే దీనిలో హాలీవుడ్ హీరోకు ఎదురయిన అనుభవాలు తనవేనన్నారాయన! 'హైదరాబాద్ బ్లూస్' తీసేముందు సినిమా నిర్మాణం గురించి తెలుసుకుందామని నేను ఇండియాకు వచ్చాను. తొమ్మిది గంటలకు అపాయింట్‌మెంటు ఇచ్చిన నిర్మాత 11 గం॥లకు వచ్చాడు. ఆయనొచ్చిన గంటన్నరకు నటీ నటులు వచ్చారు. వచ్చీరాగానే లంచ్ బ్రేక్ అంటూ పొలోమని లేచి వెళ్ళిపోయారు. అప్పుడే అనుకున్నా ఈ సబ్జక్ట్ మీద సినిమా తీయాలని! నవీన్ నిశ్చల్ ఇండియన్ హీరో పాత్ర అద్భుతంగా వేశాడు. తక్కిన వాళ్ళ గురించి నాకు ముందే ఐడియా ఉంది కానీ అతనింత బాగా నటిస్తాడని నేనూహించలేదు అన్నాడు... అంతా బాగానే ఉంది కానీ ఈ సినిమా స్క్రిప్టు మీ హాలీవుడ్ హీరోకి ముందుగానే ఇచ్చారా? లేక సెట్లో కూచుని రాశారా? అని అడిగితే ఫక్కున నవ్వి 'లేదులెండి స్క్రిప్టు ముందే ఇవ్వడం, అతను ఇండియాలో దిగేటప్పటికి కంఠస్తం చేసుకుని రావడం జరిగాయి' అన్నాడు నగేష్.

## డాక్టర్ టు యాక్టర్ - మధ్యలో సింగర్



ఇండీ పాప్ గాయకుడు కాకముందు పలాస్ సేన్ ఒక డాక్టర్. ఇప్పుడొక యాక్టరయ్యారు. గుల్జార్, రాఖీల కూతురు మేఘనా దర్శకత్వం వహిస్తున్న "ఫిల్‌హాల్"లో ఈయన హీరో అయితే ఆయన కంటె రెండంగుళాల పొడవున్న ఇంకో సేన్ (విశ్వసుందరి) హీరోయిన్‌గా వేస్తోంది.

## ఓపీ, ఆర్డీ లపై ఆశా



దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు వచ్చిన సందర్భంగా ఒక పత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ ఓ.పి.నయ్యర్ గురించి ఆశా భోంస్లే అన్నదిది - "ఓపి నయ్యరే నాకు బ్రేక్ ఇచ్చారని అందరూ అనుకుంటారు. కానీ నేనెవ్వరికీ ఆ క్రెడిట్ ఇవ్వను. బి.ఆర్.చోప్డా "నయాదౌర్"లో హీరోయిన్‌కి నాచే పాడించి చాలా రిస్కు తీసుకున్నారు. అదే నా తొలి భారీచిత్రం". నయాదౌర్‌కి ఓపి నయ్యరే సంగీతదర్శకుడని గుర్తున్నవారికి ఇది ఆశ్చర్యం కలిగించక మానదు. ఆర్.డి.బర్మన్ గురించి మాట్లాడుతూ ఆశా, "ఆయన ఓ మ్యూజికల్ జీనియస్. ఈ నాటి ఆశాను తయారు చేసినదాయనే, గజల్, కేబరే, విషాదగీతం - ఏదైనా నేను పాడగలనని నా మీద నాకు నమ్మకం కలిగించినది ఆయనే!" అంది. ఆర్.డీ.బర్మన్ మంచి పాటలన్నీ లతాకి ఇచ్చి రెండోరకం పాటలే ఆశాకు ఇచ్చారని ఓపినయ్యర్ ఓ ఇంటర్వ్యూలో అన్నారు. ఆశా అలా అనుకోవటం లేదన్నమాట!

# న్యూస్ ఫ్లాష్

## హంస గీతం



మూడు దశాబ్దాలలో నలభై పాప్ ఆల్బమ్స్‌ల పాటలు పాడి ప్రజలను మెప్పించడం మాటలు కాదు. అలాటి రికార్డు సృష్టించి బోల్డంత కీర్తి, డబ్బు సంపాదించిన ఈటన్ జాన్ గతపక్షం అమెరికాలో ప్రోగ్రాం ఇస్తూ తన లేటెస్టు ఆల్బమ్ "సాంగ్స్ ఫ్రమ్ ది వెస్ట్ కోస్ట్" తన ఆఖరి ఆల్బమ్ అని ప్రకటించేడు. శ్రోతల ఎదుట పాడడం తన కిష్టమే అయినా రికార్డుల కంపెనీల మతలబులంటే తన కసహ్యమనీ, అందుకే ఈ నిర్ణయం తీసుకున్నాననీ అన్నాడతను!

### డిస్నీకి బ్రేక్

వాల్డ్ డిస్నీ కంపెనీవారు తమ సబ్సిడియరీ కంపెనీను ఇండియాలో ప్రారంభిద్దామనుకుంటున్నారు. దీనిద్వారా ఇండియాలో వాల్డ్ డిస్నీ ఛానెల్‌ను ప్రారంభించడంతో బాటు, అమ్యూజమెంటు పార్కులు కూడా నెలకొల్పాలనుకుంటున్నారు. కానీ ప్రస్తుతం వారితో ఇండియాలో జాయింట్ వెంచర్ నడుపుతున్న కె.కె. మోదీ గ్రూపువారు, వాల్డ్ డిస్నీ ప్రతిపాదనను అంగీకరించేందుకు ముందు తమ అభ్యంతరాలను పరిగణించాలని ప్రభుత్వాన్ని కోరారు.

### ఎస్.సి. సిప్పీ మృతి

'పడోసన్', 'సాధూ ఔర్ సైతాన్', 'బాంబే టు గోవా' వంటి హిందీ హాస్య చిత్రాలనెన్నిటినో నిర్మించిన ఎస్.సి. సిప్పీ నవంబరు 25న మరణించారు. ఆయన కుమారుడు రాజ్ సిప్పీ డైరెక్టరు.

# దివ్య సంగీతాన్ని అందించే త్యాగరాజ ఆరాధనోత్సవాలు

సంగీత కళాకారులు, ఆరాధకులు జనవరి నెల ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తుంటారు. ఎందుకంటే ప్రతి సంవత్సరం జనవరి నెల మొదటి వారంలో తమిళనాడులోని తంజావూరు దగ్గరున్న తిరువయ్యూరులో త్యాగరాజ ఆరాధనోత్సవాలు జరుగుతాయి.

ఆ సమయంలో అక్కడ అడుగు పెట్టిన వారికి ఓ సంగీత ప్రపంచంలోకి అడుగిడిన అనుభూతి కలుగుతుంది. దేవాలయాలన్నీ సర్వాంగ సుందరంగా తయారవుతాయి. త్యాగరాజ కృతులు విన్పిస్తుంటాయి.

కర్ణాటక సంగీతానికి విశేష సేవలందించిన త్యాగరాజు, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితార్లు ఇక్కడే జన్మించారు.

దేశంలో అనేకమంది ప్రముఖ సంగీత కళాకారుల జ్ఞాపకార్థం సంగీత ఉత్సవాలు జరుగుతూనే ఉంటాయి.

బృందావన్‌లో స్వామిహరిదాస్ ఉత్సవం....

గ్వాలియర్‌లో తాన్‌సేన్ ఫెస్టివల్....

జలంధర్‌లో హర్‌బల్లభ్ ఉత్సవం...

మైహర్‌లో అల్లావుద్దీన్ ఖాన్ ఫెస్టివల్

వాటిల్లో కొన్ని అయితే

త్యాగరాజ ఆరాధనమహోత్సవానికి ఉన్న విశిష్టత వేరు.



### ఏమిటా ప్రత్యేకత?

ప్రతి ఏటా జనవరి నెల మొదటి వారంలో వందలు, వేల మంది సంగీత కళాకారులు, ఆరాధకులు, అభిమానులు అక్కడ చేరతారు. తిరువయ్యూరు పూర్తిగా సరిగమలతో నిండిపోతుంది. కళాకారులంతా ఎవరి ఖర్చులు వారు పెట్టుకుని రావాల్సిందే. నిర్వాహకులు కళాకారుల కోసం ఎలాంటి ప్రత్యేక సదుపాయాలు కల్పించరు. ఉత్సవాలకు హాజరైన కళాకారులు బస చేసేందుకు ఏర్పాట్లు కూడా ఎవరిమటుకు వారే చూసుకోవాలి. ఇందులో కూడా ఉత్సవాల నిర్వాహకులు కల్పించుకోరు.



మరో ముఖ్య విషయం ఏమిటంటే ఆరాధనోత్సవాల కచేరీలలో పాల్గొనే కళాకారులకి పారితోషికం చెల్లించరు.

### కళాకారులంతా ఒక్కటే....

అవును! ఇక్కడ జరిగే త్యాగరాజ ఉత్సవాల ప్రత్యేకతల్లో ఇది ఒకటి. గొప్ప, సామాన్య లాంటి భేదాలుండవు. ప్రముఖ కళాకారులైనా, ఔత్సాహికులైనా అంతా సమానమే. ఒక్కొక్కరికి ఇరవై నిముషాల సమయం కేటాయిస్తారు. ఆ సమయంలో త్యాగరాజ కృతులు మాత్రమే గానం చేయాల్సి ఉంటుంది.

### త్యాగబ్రహ్మకి నివాళి!

త్యాగరాజుని అందరూ త్యాగబ్రహ్మ అని పిలుస్తారు. ఇక్కడ హాజరయ్యే కళాకారులంతా వారు చేసే కచేరీలన్నీ త్యాగబ్రహ్మకి నివాళిగా భావిస్తారు. అందుకే ప్రత్యేక సదుపాయాలు కల్పించకపోయినా, పారితోషికం ఇవ్వక పోయినా కళాకారులంతా ఉత్సాహంగా హాజరవుతుంటారు.

### ఆరో రోజు అద్భుతం....

ఉత్సవం ఆరంభమైన రోజు నుంచి 'ఆరోదినం' కోసం సంగీతాభిమానులంతా ఎప్పుడెప్పుడా అని ఎదురు చూస్తుంటారు. ఆ రోజు ప్రముఖ కళాకారులంతా తిరువయ్యూరు వీధులలో కాలి నడకన తిరుగుతూ త్యాగరాజ కృతులు ఆలపిస్తారు. నిజంగా ఆ దృశ్యం చూసేవారికి ఒడలు పులకరిస్తాయి. ఎప్పుడో రెండు వందల ఏళ్ళ క్రితం త్యాగబ్రహ్మ ప్రతిరోజు ఇలా భిక్షాటన చేసేవారని ప్రతీతి.

ఎమ్.ఎస్.సుబ్బలక్ష్మి, సెమ్మాన్‌గుడి శ్రీనివాస్ అయ్యర్, టి.బృంద, అరియకుడి రామానుజన్ అయ్యంగార్ వంటి ప్రముఖ కళాకారులు ప్రతి ఏటా ఈ ఉత్సవాలలో పాల్గొంటారు. ఆరో రోజు జరిగే భిక్షాటన కార్యక్రమంలో పాల్గొని 'త్యాగరాజ పంచరత్న కృతులు' ఆలపిస్తారు.

-ఎ.అమృతలక్ష్మి





## నాగరత్నమ్మాళ్ కృషి

బెంగుళూరుకి చెందిన నాగరత్నమ్మాళ్ కృషిని ఈ సందర్భంలో ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఒక రోజు ఆవిడ విషపూరితమైన పాలు తాగబోతుండగా త్యాగరాజ స్వామి కనబడి ఆవిడని ఆపివేసినట్టు నాగరత్నమ్మాళ్‌కి కన్పించింది. ఆవిడ వెంటనే తిరవయ్యూరు వెళ్ళి త్యాగరాజస్వామి సమాధిని దర్శించారు.

త్యాగరాజ స్వామి సమాధి నిర్లక్ష్యానికి గురికావడం చూసి ఆ దేవదాసి తన ధనం వెచ్చించి సమాధి స్థలాన్ని కొనుగోలు చేసి ఓ దేవాలయం నిర్మించి అందులో త్యాగరాజ స్వామి పాలరాయి విగ్రహాన్ని ప్రతిష్ఠించారు.

1949లో నాగరత్నమ్మాళ్ తన ఆస్థులన్నింటిని ఓ ట్రస్టుకి రాసేసారు. ప్రతి సంవత్సరం త్యాగరాజ సంగీత ఆరాధన మహోత్సవం ఏ విధంగా జరపాలో తగిన సూచనలు చేసారు. ఆ సూచనల ప్రకారం నేటికీ ఉత్సవాలు జరపబడుతుండటం విశేషం.

త్యాగరాజ స్వామి సమాధి ఎదురుగా కావేరి నది ఒడ్డున నాగరత్నమ్మాళ్ సమాధి కూడా ఉంది.

అశోక్ కుమార్ అనగానే మహానటుడు గుర్తుకు వస్తాడు. కానీ ఆయన గాయకుడు కూడా. సాక్షాత్తూ సరోజినినాయుడే ఆయన పాటను మెచ్చుకున్నారు. తన తొలి చిత్రాలలో పాటలు తనే పాడుకున్నాడు. ఆ తర్వాత "ఆశీర్వాద్" చిత్రంలో "రేల్ గాడీ... రేల్ గాడీ" పాట పాడి తొలిసారిగా రాప్‌గానాన్ని శ్రోతలకు పరిచయం చేశాడు. అంతేకాదు... బాంబే టాకీస్ అధినేతగా ఉండే రోజుల్లో ఎస్.డి.బర్మన్ వంటి సంగీత దర్శకులు బొంబాయి ఫీల్డులో నిలదొక్కుకునేందుకు ఎంతో సహకరించాడు.... గత పక్షం డిసెంబరు 10న తన 90వ యేట కీర్తిశేషుడైన అశోక్‌కుమార్‌కు అశృతర్పణం-

# తొలి రాప్ గాయకుడు అశోక్‌కుమార్



బిహార్‌లోని భాగల్పూర్‌లో అమ్మమ్మ గారింట 1911 అక్టోబరు 13న జన్మించిన అశోక్‌కుమార్ తండ్రి కుంజలాల్ గంగూలీ మధ్యప్రదేశ్‌లోని ఖాండ్వాలో వకీలుగా పని చేసేవారు. ఆయన తన ముగ్గురు కొడుకులకు 'కె'తో ప్రారంభమయ్యేట్లా పేర్లు పెట్టారు. కుముద్, కల్యాణ్, కిశోర్ ముగ్గురూ సినిమా నటులయ్యారు. కుముద్‌ను అశోక్ అని పిల్చేవారు. సినిమాల్లోకి వచ్చాక అది అశోక్‌కుమార్



'మేరీసూరత్ తేరీ ఆంఖేఁ' లో అనాకారి గాయకుడి పాత్రలో

అయింది. కల్యాణ్ అనూప్‌కుమార్ అయిపోయాడు. కిశోర్ మాత్రమే పేరు మారకుండా ఉండిపోయాడు. వాళ్లకు ఒకే ఒక సోదరి... సతీరాణి. ఆమెను శశధర్ ముఖర్జీ అనే విద్యార్థికుడికి ఇచ్చి పెళ్లి చేస్తే ఆయన సినిమాల్లోకి టెక్నీషియన్‌గా ప్రవేశించాడు. ఆయన కారణంగానే అశోక్‌కుమార్ సినిమా రంగంలోకి ప్రవేశించాడు.

ఇంటర్‌దాకా ఖాండ్వాలో జబల్‌పూర్‌లో బి.ఎస్.సి చదివి, లా చదవడానికి కలకత్తా వెళ్లిన అశోక్‌కుమార్‌కు జర్మనీ వెళ్లి సినిమా డైరక్షన్ నేర్చుకోవాలన్న ఆశ పుట్టింది. అప్పటికే బావగారు శశధర్ బొంబాయిలో బాంబే టాకీస్ అనే ప్రఖ్యాత

సినీ నిర్మాణ సంస్థలో సౌండ్ ఇంజనీర్‌గా పని చేస్తున్నాడు. ఆయన ప్రోద్బలంతో బాంబేటాకీస్ అధినేత హిమాంశురాయ్‌ని కలిసి రికమెండ్ చేయమన్నాడు. ఆయన "మా వద్దే అప్రెంటీస్‌గా చేరి నేర్చుకోవచ్చుగా, ముందు ఏక్టింగ్ నేర్చుకో" అన్నాడు. స్క్రీన్ టెస్ట్ చేసిన దర్శకుడు ఫ్రాంజ్ ఆస్టెన్ 'నీ దవడ ఎముక పలకలుగా ఉంది. నటనకు పనికిరావ'న్నాడు. అశోక్ అక్కడే అసిస్టెంటు కెమెరామన్‌గా చేరి, ఎడిటింగ్ శాఖలోనూ, లేబరీటరీ అసిస్టెంట్‌గాను పని నేర్చుకున్నాడు. 8 నెలల తర్వాత "జీవన్‌నయ్యా" (1936) సినిమా తీస్తుండగా దాని హీరో నజ్మల్ హుస్సేన్ హఠాత్తుగా మాయమయిపోయాడు, హిమాంశురాయ్ బలవంతం మీద అయిష్టంగానే అశోక్ హీరో వేషం వేయవలసి వచ్చింది.

అశోక్‌కుమార్ నటించిన రెండో చిత్రం "అఛూత్ కన్యా" (1936) సూపర్‌హిట్ అయింది. అందుకు కారణం హీరోయిన్ దేవికారాణి అందం, అభినయం మాత్రమే! అశోక్‌కుమార్‌కి అందగాడని పేరు తప్ప గొప్ప నటుడిగా



తొలి హిట్ 'అఛూత్‌కన్య'లో దేవికారాణితో...



'చల్తీకానామ్ గాడీ'లో సోదరులు కిశోర్, అనూప్‌లతో...



'ఆశీర్వాద్'లో కళాపిపాసి అయిన జమీందారుగా....

అనుకోలేదెవ్వరూ. అతను నటనను సీరియస్‌గా తీసుకోవడం మొదలుపెట్టిన తర్వాతనే, ధైర్యం చేసి నెగటివ్ రోల్స్ వేయడం మొదలు పెట్టిన తర్వాతనే అతని ప్రతిభ వెలికి వచ్చింది. క్రమంగా అశోక్ వేయులేని పాత్ర అంటూ లేకుండా పోయింది. కాలంతో బాటు మారుతూ రకరకాల పాత్రలు వేసి 'న భూతో న భవిష్యతి' అనిపించుకున్నాడు. ఎన్నో అవార్డులు అందుకున్నాడు.

అప్పట్లో నటీనటులు ఎవరిపాటలు వారు పాడుకునే వారు. అశోక్‌కుమార్ కూడా 'జీవన్‌నయ్యా', 'అఛూత్‌కన్యా' చిత్రాలలో పాటలు పాడారు. సరస్వతీ దేవి సంగీత దర్శకత్వంలో అఛూత్‌కన్యలో అతను పాడిన హిట్ డ్యూయెట్. "మై బన్‌కీ చుడియా, బన్ మే బన్ బన్ బోలూరే..." దేశమంతా ఆలపించింది. అలాగే అతను పాడిన 'చల్ చల్ రేనే జవాన్....' (బంధన్) కూడా సూపర్‌హిట్. ఝూలా లీలా బిట్నీస్‌తో కలిసి నటించిన ఝులా (1941)లో పాటలన్నీ అతనే పాడాడు.

'అఛూత్‌కన్యా' సినిమా గురించి విన్న పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఆ సినిమాను చూద్దామని అనుకున్నారు. ఆయనకోసం ఏర్పాటు చేసిన ప్రత్యేక ప్రదర్శనకు ఆయనతో బాటు ఇందిర, సరోజినినాయుడు కూడా హాజరయ్యారు. సరోజిని నాయుడుకి క్రమంగా నిద్ర ముంచుకు వచ్చింది. తెరపై అశోక్ కుమార్ "ఖేత్ కీ మూలీ, బాగ్ కీ ఆమ్" పాడే దృశ్యం వచ్చినప్పుడు ఆమెకు మెలకువ వచ్చింది. పాట ఆమెకు బాగా నచ్చింది. "ఎవరా కుర్రాడు? బాగా పాడుతున్నాడే!" అని అడిగిందామె. ఆమె పక్కనే కూచున్న అశోక్ సిగ్గుపడుతూ "నేనే, మేడమ్" అన్నాడు. "బ్రేవో, యంగ్‌మాన్. కంగ్రాట్యులేషన్స్!" అందామె. ప్రథమ శ్రేణి కవయిత్రి, నైటింగేల్ ఆఫ్ ఇండియా బిరుదాంకితురాలు, నిష్కర్ష వాఖ్యలకు పేరుబడ్డ సరోజిని నాయుడు అభినందనలను అందుకున్న అశోక్‌కుమార్ పులకించి పోయాడు.

డైరెక్టర్ అవుదామనుకుని సినిమా రంగంలోకి ప్రవేశించిన అశోక్‌కుమార్ తన కోరికను "ఎయిట్ డేస్" (1946)కు దర్శకత్వం వహించడం ద్వారా తీర్చుకున్నాడు. సినిమా పూర్తయాక ఏమనుకున్నాడో ఏమో సినిమాను ఎడిట్ చేసిన దత్తారామ్ పై పేరు దర్శకుడిగా వేసేశాడు. ఆ సినిమాను అందరూ మర్చిపోయారు. ఇప్పుడు నెగటివ్ కూడా దొరకదు. అగ్నిప్రమాదంలో కాలిపోయిందట. మంచి సినిమాలు తీయాలన్న తృష్ణతో అశోక్‌కుమార్ నిర్మాతగా మారాడు. బావగారు శశధర్ ముఖర్జీ ఫిల్మిస్తాన్ సంస్థను మొదలు పెట్టినప్పుడు అతను భాగస్వామిగా చేరాడు. అక్కడ చక్కటి చిత్రాలు నిర్మిస్తుండగానే తన మాతృసంస్థ బాంబే టాకీస్ చిక్కుల్లో పడిందని తెలిసి 28 లక్షలు వెచ్చించి దాని నిర్వహణ బాధ్యతను తీసుకున్నాడు. బాంబే టాకీస్ ద్వారా ఎన్నో గొప్ప చిత్రాలు నిర్మించాడు. ఎందరో గొప్ప



దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు బహుమతి ఉత్సవంలో...

చిత్రరంగానికి బర్మన్ దక్కాడు.

**బాం**బే టాకీస్ నడిపే రోజుల్లో అశోక్‌కుమార్ బొంబాయికి పిలిపించిన వంగ ప్రముఖులలో బిమల్‌రాయ్ ఒకరు. ఆయన వద్ద ఎడిటర్‌గా ఆయనతో బాటు వచ్చిన హృషీకేశ్ ముఖర్జీ దరిమిలా గొప్ప దర్శకుడిగా పేరు తెచ్చుకున్నాడు. 1968లో హృషీకేశ్ అశోక్ వద్దకు వచ్చి, "దాదామొనీ, నీకు అవార్డు తెచ్చి పెట్టే పాత్ర ఒకటి ఉంది" అన్నాడు. "అవార్డులకంటే నాకేమీ ఆశ లేదు. కానీ కథ చెప్పు. పాత్ర బాగుంటే వేస్తా" అన్నాడు అశోక్. నిజానికి ఆ పాత్రకు అతనికి జాతీయ స్థాయిలో 'భరత్' ఎవార్డు వచ్చింది. ఆ సినిమా "ఆశీర్వాద్". శివనాథ్ చౌదరీ అనే ఒక జమీందారుకి సంగీత సాహిత్యాలంటే చాలా మక్కువ. మామూలు ప్రజలతో కలిసి ఢోలక్ వాయిస్తూండే వాడు. అది అతని భార్యకు రుచించక పోట్లాడుతూంటుంది. కూతురంటే ఇష్టం కొద్దీ ఆమె ధార్ష్టీకం భరిస్తూంటాడు జమీందారు. చివరికి జమీందారిణి పేదవాళ్ల గుడిసెలు కాల్పించేస్తుంది. ఆమెతో గొడవ పడి ఇల్లు వదిలి ఊళ్లు పట్టుకు తిరుగుతాడు జమీందారు. ఒక ఊళ్ళో పార్కులో పడుక్కుని ఉండగా చిన్నపిల్లలు పరిచయమవుతారు. వాళ్లను ఆడించడానికి ఈ కవి అప్పటికప్పుడు ఓ పాట కట్టి పాడతాడు. ఆ పాటే "రేల్ గాడీ, రేల్ గాడీ చుక్, చుక్ చుక్ చుక్, బీచ్ వాలే స్టేషన్ బోలే రుక్ రుక్ రుక్ రుక్" అంటూ సరదాగా, హాయిగా సాగే ఈ పాటకు వసంతదేశాయ్ సంగీతం సమకూర్చారు. రాప్ (అప్పటికి ఆ పేరు రాలేదు) ధోరణి గానానికి తెరతీసిందా పాట. అప్పటిదాకా పెద్దవాళ్లకే అశోక్ కుమార్ నటన అంటే నచ్చేది. దెబ్బకి ఆరేడేళ్ల పిల్లలకు కూడా అశోక్‌కుమార్ అభిమాన నటుడయి పోయాడు.

నిర్మాతగా అశోక్‌కుమార్ నిర్మించిన మంచి చిత్రాలలో "మేరీ సూరత్ తేరీ ఆంఖే" (1963) ఒకటి. "ఉల్కా" అనే బెంగాలీ నాటకంపై ఆధారపడిన ఈ సినిమాలో నాయకుడు ఒక అనాకారి అయిన సంగీత కారుడు. ఎస్.డి.బర్మన్ సంగీతాన్ని అందించిన ఈ చిత్రంలో అనేక గొప్ప పాటలు. "పూఛో న కైసే", "నాచే మన్ మోరా మగన్" ఉన్నాయి. సంగీతంపై మక్కువతోనే అశోక్‌కుమార్ అనాకారి హీరోగా నటించి, చిత్రం నిర్మించే సాహసం చేశాడనుకోవాలి. అదృష్టవశాత్తూ ప్రజలు దాన్ని ఆదరించారు. "బికారి రాముడు", "దైవమగన్" (కోటీశ్వరుడుగా తమిళం నుండి తెలుగులోకి డబ్ అయింది). "రక్తసంబంధాలు" సినిమాలకు ప్రేరణ అయింది. అదేవిధంగా "కల్పన" (1960) సినిమాను ఓ.పి.నయ్యర్ సంగీత దర్శకత్వంలో సంగీత, నృత్య ప్రధాన చిత్రంగా నిర్మించాడు అశోక్‌కుమార్. దక్షిణాది తారలైన పద్మిని, రాగిణిలను కథా నాయికలుగా నటింప జేసాడు.

అశోక్ కుమార్ సహకారంతో పైకి వచ్చిన మ్యూజికల్ జీనియస్ అతని సోదరుడు కిశోర్‌కుమార్. తన కంటె 19 ఏళ్లు చిన్న అయిన కిశోర్ జీవితాన్ని తీర్చిదిద్దింది అశోక్‌కుమారే. డబ్బు పంపి చదివించినదీ, సినిమా రంగానికి రమ్మనమని ప్రోత్సహించి "జిద్దీ" చిత్రంలో చిన్న వేషం ఇప్పించినదీ, నటుడిగా అతనికి కష్టకాలం వచ్చినప్పుడు స్టేజిషోలు ఇమ్మనమని ప్రోత్సహించినదీ, అతని చిత్రంలో చిన్న వేషం ఇప్పించినదీ, నటుడిగా అతనికి కష్టకాలం వచ్చినప్పుడు స్టేజి షోలు ఇమ్మనమని ప్రోత్సహించినదీ, అతని ఆరోగ్యం గురించి మందలించినదీ అశోక్‌కుమారే. కిశోర్ తొలి రోజుల్లో అతన్ని హీరో చేద్దామని తన "అఛూత్‌కన్యా"ను పునర్నిర్మిద్దామని కూడా ఆలోచించాడు అశోక్. ఆ రోజుల్లో అశోక్‌కుమార్ పాడిన పాటలను తల్లిదండ్రుల వద్ద పాడి మెప్పించి చిన్నారి కిశోర్ డబ్బులు సంపాదించుకునేవాడు కూడా!

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**



కుటుంబ సభ్యులతో...




భగవంతుడు అందరికీ అన్నీ ఇవ్వడు. బోల్డన్ని సుఖాలు ఇస్తూనే ఏదో ఒక లోపం పెడతాడు. ఆ విషయం తెలిసినా మనం పక్కవాణ్ని చూసి ఏడ్చుకుంటూనే ఉంటాం! వాడికేంరా హాయిగా ఉన్నాడు. అని.

మా ఊరికి ఆనందరావు వచ్చిన కొత్తల్లో మేమూ అలాగే అనుకున్నాం. వేసవికాలం సెలవుల్లో మేమందరమూ మా ఊరికి వెళ్లడం అలవాటు. సముద్రం పక్కనే ఉండడం వల్ల కాబోలు మా ఊరికి కడలిలంక అనే పేరు వచ్చింది. సెలవులకు పాత ఫ్రెండ్సందరం కలిసి, రెండు నెలలు సరదాగా గడిపి, ఎవళ్ల ఊళ్లకి వాళ్లు వెళ్లడం రివాజు. ఆ ఏడాది ఆనందరావు కొత్తగా వచ్చాడు. మా ఊరివాడు కాదతను. మా ఊరి సముద్రపుగాలి గొప్పదనం ఎవరిదగ్గరో విని కులాసాగా గడిపిపోదామని వచ్చాడట! ఆరడుగుల పొడుగు, ఆటల్లో మేటి, డబ్బున్న వాలకం - ఇవన్నీ చూస్తే మేమందరం కుళ్లుకోవడంలో తప్పేముంది?



# జాలీ టైములో జాలి కథలా?

కానీ అతని హృదయంలో ఆరని మంట ఉంటుందని ఎవరూహించగలరు? సూరిగాడు చెప్పేదాకా అతన్నీ, ఆరనిమంటనూ కలిపి ఎవరూ ఊహించలేకపోయాం. పోనీ గుండెల్లో ఆరని మంట ఉన్నవాడు ఊరుకోక పోయి, పోయి సూరిగాడి లాటి వాడితో చెప్పుకోవడ మేమిటి? అని ఆశ్చర్యపోయాం మేమంతా. నిజానికి సూరిగాడే ఆనందరావు దగ్గరకు పోయాడట. ఊరికెవరైనా రాగానే వెళ్లి వాడి విషాదగాథ చెప్పి ఊరడిల్లడం వాడి కలవాటు. ఊళ్లోవాళ్లంతా విని, విని ఇక వినడం మానేస్తే వాడు మాత్రం ఏం చేస్తాడు? తను బస్సెక్కినప్పుడల్లా తనకు సీటు దొరక్కపోవడం గురించి, సీటు దొరికినా అటువైపు ఎండ పడడం గురించి, ఎండ పడకపోయినా, అమ్మాయిలు వేరేవైపు కూచోడం వాడు చెప్పినది ఊళ్లోవాళ్లు వినడం మానేశారు. దాంతో వాడు శ్రోతలగురించి నిరంతరం వేటలో ఉంటాడు.

ఆనందం దగ్గరికి వెళ్లి మనవాడు సొద మొదలుపెట్టగానే ఆనందం కాస్సేపు ఊరుకుని తన కథ చెప్పాడట. దాంతో సూరిగాడు లాటి వాడు కూడా నోరు మూసుకోవలసి వచ్చింది. మద్దెలతో మొరపెట్టుకోవడం రోలు తరమా? ఓటమి నంగీకరించిన సూరిగాడు ఊరుకుంటే బాగుణ్నా? అబ్బే, మాలో ప్రతీ ఒక్కడికీ ఆనందం గాథ వినిపించాడు. చెప్పడానికి ముందే ఇంకెవ్వరికీ చెప్పకూడదన్న కండిషన్ పెట్టడం ఒకటి! రహస్యం దాచాలన్న తాపత్రయమూ కొద్దీ అనుకునేరు, అబ్బే, ఇంకోళ్లకి ఇది వినిపించే అవకాశం తనకెక్కడ తప్పిపోతుందోనన్న భయం.. అంతే!

ఇంతకీ జరిగిందేమిటంటే - సూరిగాడు తన గాథ సగంలో ఉండగానే ఆనందం ఆపేయమన్నాడట.

"ఏదీ విషాదఘట్టం ఇంకా మొదలవ్వందే" అంటూ సూరిగాడు లబలబ లాడాడు.

"నా కథ వింటే నేనడిగినా నువ్వే ముందుకుసాగవ్" అన్నాడు ఆనందం.

తన కథ కంటె రసవత్తరమైన మలుపులు ఇంకెవ్వరికుంటాయన్న ధీమాతో "చెప్పు చూద్దాం" అన్నాడు సూరిగాడు. కానీ ఆనందం కథ విన్నతర్వాత అతనికి సలాం కొట్టి వచ్చేసాడట!

"ఏం, అతనిది అంత పెద్ద ట్రాజెడీయా?" అని ఉడుక్కున్నాడు కథ వింటున్న బుజ్జిగాడు.

"మరి! ప్రేమించిన అమ్మాయితో పెళ్లి కాకపోవడం.."

మేమంతా ఫెళ్లున నవ్వాం. ఇదో పెద్ద ట్రాజెడీనా? ఆ మాటకొస్తే నేను ఆరుగురిని ప్రేమించి కూచున్నాను. ఒక్కరితోనూ పెళ్లయ్యే ఛాన్సు లేదు. అంతమాత్రం చేత హిస్టరీ బుక్స్‌లోకి ఎక్కేద్దామని చూడడం అత్యాశ కాదూ!?

"ఆగండోయ్, చెవలాయిలూ, ఆపాటి దాననికయితే నేను తోకముడుచుకుని వచ్చేసేవాణ్ననుకున్నారా? వాళ్ల ప్రేమ ఫలించి పెద్దలు పెళ్లికి ఒప్పుకున్నారు కూడా."

'మరింకేం!?' కథ ఎటువైపు నడుస్తోందో మాకు అర్థం కాలేదు.

సూరిగాడు కాస్సేపు సస్పెన్స్ మేంటేన్ చేసి - "కానీ ఆ అమ్మాయి పెళ్లిరోజునే చచ్చిపోయింది." అని డిక్లేర్ చేశాడు.

'పాపం' అని మేమనేలోపుగానే "..ఇతని చేతుల్లోనే రాలిపోయింది." అని చేర్చాడు.

ఇక మేమందరమూ కూడా నోర్మూసుకుని అతన్ని మించిన ట్రాజిక్ హీరో లేడని ఒప్పుకోవలసివచ్చింది. ఇక మీద మేం వెళ్లి అతనికి మా కథలు ఏం చెప్పినా చిన్నపిల్లల కథల్లా ఉంటాయని ఏకగ్రీవంగా ఒప్పుకున్నాం. మా కష్టాల గురించి అతని దగ్గర నోరు మెదిపే సాహసం చేయలేదు. మేం సాహసించమని నిర్ధారించుకున్న తర్వాత సూరిగాడు తక్కిన విశేషాలు కూడా చెప్పాడు. ఆ పోయిన అమ్మాయికి వచ్చిన రోగం ఏమిటో పెద్ద పెద్ద డాక్టర్లే తెలుసుకోలేక కళ్లు తేలేసేరనీ, ఆమె చేసిన గాయం ఆనందం గుండెల్లో ఇంకా పచ్చిగానే ఉందనీ, కావాలంటే స్కాన్ చేయించి చూసుకోవచ్చనీ..వగైరా, వగైరా.

ఊరు ఊరంతా ఆనందం అంటే జాలి చూపించనారంభించారు. అసలే దుఃఖ సముద్రంలో మునిగి ఉన్నవాడిని మరింత బాధపెట్టడం భావ్యం కాదనుకుని అతని జోలికి పోలేదెవ్వరూ. అమ్మాయిలు కూడా అతని జోలికి పోకుండా మా వెంటే ఉంటారని ఆశపడ్డాం మేం! కానీ ఆడవాళ్లు బహుచిత్రమైనవాళ్లు. జాలిపడి, ఆ జాలితో ప్రేమించడం వాళ్ల లక్షణం కాబోలు. ఆనందం ట్రాజిక్ హీరో అని తెలిసిన దగ్గర్నుంచీ ఊళ్లో ఆడవాళ్లందరికీ అతని మీద మోజు మరింత పెరిగిపోయింది. ఇంకో అమ్మాయిని అంత గాఢంగా ప్రేమించిన వాడు మననేం పట్టించు కుంటాడన్న ఇంగితం లేకుండా మాలాటి వాళ్లనందరినీ గాలికి వదిలేసి ఆడపిల్లలు వాడి వెంటపడ నారంభించేరు. మామూలు పరిస్థితుల్లో అసూయపడేవాళ్లమే కానీ, ఇలా ప్రేయసి చావు కళ్లారా చూసినవాడిని ఏం ఆడిపోసుకుంటామని మేమూ ఊరుకున్నాం.



ఇంకా అలా ఊరుకునే వాళ్లమే కానీ ఊళ్లోకి కొత్తగా దిగిన హరిత కూడా అలాగే ప్రవర్తించడం నాకు నచ్చలేదు. హరిత చాలా అందంగా ఉండడం ఒక కారణమైతే, ఆమె మా ఊరిది కాకపోవడం మరో కారణం. ఆమె సుబ్బయ్యగారి మేనకోడలు. మామయ్యను చూడడానికి వచ్చింది. మళ్లీ ఏడాది వస్తుందేమో, అప్పుడు మన ప్రయత్నాలు మనం చేసుకోవచ్చన్న ఆశ లేదు. ఈ ఏడాదే మన ఖర్మ కాలి ఆనందం తగలడ్డాడు. పాపం మరీ అంత తిట్టుకోవడం కూడా సబబు కాదేమో! అతని హంగూ, ఆర్భాటం చూస్తే అసూయగానే ఉంటుంది. చాలామంది అది చూసి మోసపోయేవారు. అతను మంచి మూడ్‌లో ఉన్నప్పుడు సందు చూసి తమ పురాణం విప్పి అతని సానుభూతి పొందుదామని చూశేవారు. కానీ వాళ్లు మొదలుపెట్టిన ఐదు నిమిషాల్లోనే అతని కళ్లు చెమ్మగిల్లేవి, వీళ్ల కష్టాలకు కాదు, 'హు, నా కష్టాల ముందు మీవెంత!' అన్నట్టు ఉండేవి అతని చూపులు. దాంతో అతని చేతుల్లో ప్రాణాలు విడిచిన అమ్మాయి గుర్తుకువచ్చి వీళ్ల నీరుకారిపోయి, తమ నిరుత్సాహాన్ని తమలోనే దాచుకునేవారు.

హరిత, ఆనందం చాలా దగ్గరయ్యారనే చెప్పాలి. కుర్రాళ్లం అందరూ కలిసి, బాడ్మింటను కోర్టు వేసి ఆడుతూంటే వాళ్లిద్దరూ ఒక జట్టుగా ఆడేవారు. రింగు ఆడినప్పుడు, షటిల్ ఆడినప్పుడూ అంతే! ఇద్దరూ కలిసి సముద్రానికి పోయి ఈతలు కొడుతున్నారని స్థానిక డిటెక్టివ్‌ల భోగట్టా. ఇక వీళ్లిద్దరూ పెళ్లి చేసుకోవడం ఖాయంరా అనుకుంటున్న రోజుల్లో ఓ సారి ఆనందం మా ఇంటికి వచ్చాడు.

మనిషి సాంఘిక జీవి. కష్టం, సుఖం ఇతరులతో పంచుకుందామని చూస్తాడు. ఒక్కోప్పుడు అలా చెప్పుకోకపోతే పొట్ట పగిలిపోతుందన్న భయం కూడా వేస్తుంది. ఆనందం అందరి దగ్గరా హుందాతనం మేంటేన్ చేసిన వ్యక్తి కాబట్టి తన ప్రేమగాథ చెప్పడానికి చాలా రోజులు తటపటాయించే ఉంటాడు. ముఖ్యంగా తను ఎవరి జాలిగాథా చెప్పనివ్వటం లేదు కాబట్టి, ఎవరూ వినరన్న భయం కూడా కావచ్చు. అలా అని ఊరుకుని తాత్సారం చేస్తే, తీరాచేసి పొట్ట పగిలిపోతే? పొట్ట కాపాడుకోవాలని గట్టిగా అనుకున్నాడేమో, ఆ రోజు తెగించి నా దగ్గర తన గోడు చెప్పబోయాడు.

"నేను హరితను ప్రేమించాను" అని మొదలెట్టాడు.

ఇందులో నాకేం విశేషం కనబడలేదు. అరడజను మంది అమ్మాయిలతో నేను చేసిందదే!

"...హరిత కూడా నన్ను ప్రేమిస్తున్నానని చెప్పింది."

మరీ మంచిది. నా అరడజను మంది అమ్మాయిలకు ఇలా చెప్పాలన్న మంచి ఆలోచన ఎప్పుడూ రాలేదు.

"మరి పెళ్లి చేసుకోవడానికి నీకు అభ్యంతరం ఏమిటి?" అడిగేశా.

"నాకు లేదు. హరితకు ఉంది. నాకూ, హరితకు మధ్య అరుణ నిలిచింది".

"ఈ అరుణ ఎవరు?"

అరుణ అంటే పెళ్లిరోజున ఆనందం చేతుల్లో చనిపోయిన అతని ప్రియురాలుట. చచ్చిపోయిన అమ్మాయి అడ్డుపడడం ఏమిటి?

"అరుణ అంటే అరుణ కాదు, ఆమె స్మృతి". "నువ్వెప్పుడూ ఆమెను మరవలేవు, ఎవరే దుఃఖ గాథ వినిపించినా నీకు ఆమె చావు గుర్తుకువచ్చి కళ్లల్లో నీళ్లు తిరగడం గమనించాను. నీ గుండెలోనుండి ఆమె ఎన్నటికీ తొలగలేదు. ఇక నాకు చోటెక్కడిది?" అంది హరిత" అన్నాడు ఆనందం.

"ఆ పాయింటూ కరెక్టే"

"నీ మొహం కరక్టు, అసలు అరుణ అంటూ ఉంటేగా?"

"లేకుండానే చచ్చిపోయిందా?"

"అసలు లేదయ్యా మొగడా, నేనే పుట్టించి, నేనే చంపేసా.."

"అదేం పోయేకాలం?" అని అడిగాను ఆశ్చర్యంగా.

అప్పుడు చెప్పుకొచ్చాడు. "నువ్వు పట్నంలో పనిచేస్తావు కాబట్టి ఒకళ్లతో ఒకళ్లు మాట్లాడుకోవడం తక్కువేమో కానీ నేను పనిచేసే పల్లెటూళ్ళో మాత్రం మహా ఎక్కువ. ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం అంటే ఏమిటి? వాడి కష్టాలు వీడూ, వీడి కష్టాలు వాడూ వినడం. వినేవాడున్నాడు కదాని చెప్పేవాడు మరీ రెచ్చిపోతాడు. వాడు ఎక్కడ సుఖపడిపోతున్నాడని మనం ఏడుస్తున్నామోననుకుని కనబడగానే కష్టాలన్నీ ఏకరువు పెడతాడు. గేదె ఈనినా కష్టమే. సైకిలు పంచరయినా కష్టమే. ఎల్‌కేజీ చదివే కొడుకు పలక పారేసినా కష్టమే. పక్కింటి పిల్లవాడికి నాలుగు ఇంగ్లీషు మాటలు వచ్చాయన్నా కష్టమే. అందరి కష్టాలూ వినడానికి నేనే దొరికానులా వుంది. నా మొహం తయారీ అలా ఏడ్చింది. అందరికీ లోకువైపోయాను. అందరి సొదా వినలేక విసుగువచ్చింది. అందుకే ఖర్చయితే అయిందని సెలవురోజుల్లో ఇక్కడకు వచ్చిపడ్డాను..."

"....అర్థమయ్యింది నీ బాధ. ఇక్కడకు వచ్చి చూస్తే సూరిగాడు తగిలాడు.."

"అవును. అది చూశాక ఇక్కడకు వచ్చాక కూడా ఆ గోడు తప్పదనిపించింది. దాంతో ఒళ్ళు మండి అరుణను పుట్టించి, అర్జంటుగా చంపేశాను. అప్పుడు ఇలా హరిత అనే అమ్మాయి వస్తుందని, నా మనసు దోచుకుంటుందని నాకేం తెలుసు? అరుణ కథ విన్నవాళ్లెవరూ నా దగ్గర ఏడుపులు ప్రారంభించే సాహసం చేయలేదు. హమ్మయ్య జాలికథలు వినక్కరలేకుండా ఈ వెకేషన్ జాలీగా గడిచిపోతుందని సంతోషించాను కానీ ఇప్పుడు ఇలా...'' అని మొరపెట్టుకున్నాడు ఆనందం.

అంతా విని ఓ పాయింటు లేవనెత్తాను. "నువ్విప్పుడు సానుభూతి కోరుతున్నావు చూశావా? అలాగే అందరూను. బోరుకొడితే కొట్టవచ్చు గానీ బొత్తిగా ఇలా విషాదగాథ లల్లేయడమా?'' అని మందలించాను.

మందలించాక ఓదార్చాను. చివరగా "నిజం చెప్పేయి. హరిత అర్థం చేసుకుంటుంది'' అన్నాను.

హరిత అర్థం చేసుకోలేదు. 'నువ్వు అబద్ధం చెప్పినది. అప్పుడా ఇప్పుడా' అంది. మాటలు మానేసింది. ఇక మనవాడేం చేస్తాడు? కొన్నాళ్ళు ఊరుకున్నాడు. ఆ తర్వాత ఓ రోజు వచ్చి,

"నా గోడు వినిపించి బోరుకొట్టానన్న కోపంతో కావాలని తప్పుడు సలహా ఇచ్చావా?" అని అడిగి చూశాడు.

"అబ్బే. అదేం లేదు. నువ్వలాగే మొహం వేలాడేసుకుని తిరుగుతూండు. ఎప్పటికో అప్పటికి హరిత జాలిపడి ఓకే అంటుంది."



అని ఓదార్చాను.

సరే, మనవాడు భగ్న ప్రేమికుడి స్టయిలు మేంటేన్ చేయాలి కాబట్టి రోజూ మధ్యాహ్నం (అప్పుడయితేనే బీచ్‌లో ఎవరూ ఉండరుట) ఒక్కడూ వెళ్ళి అలా గంటల తరబడి సముద్రం కేసి చూస్తూ గడపడం మొదలుపెట్టాడు. అలా చూస్తూ పాటలు అవీ పాడి ఆ మూడ్ నిలబెట్టాలని ప్రయత్నించేవాడు కానీ సమయానికి సరైన పాటలు గుర్తొచ్చేవి కాదుట. అక్కడకు వెళ్ళాక శూన్యంలోకి చూడాలా, దిగంతాలలోకి చూడాలా అని కూడా ఒకటి రెండు సార్లు అడిగేడు నన్ను, పీతలు పీక్కుండా చూసుకుంటే చాలని చెప్పాను నేను.

ఒక రోజు ఆనందం అలాటి ఒక మధ్యాహ్నం సముద్రతీరాన గడుపుతున్నాడు. అనుకుంటాం గానీ శూన్యంలోకి చూడడం అంత తేలికైన పనేమీ కాదు. అలా చూసి, చూసి విసుగుపుట్టిందేమో చల్లగాలికి నిద్ర పట్టేసింది. అలా ఎంతసేపు నిద్రపోయాడో కానీ చటుక్కున మెలకువ వచ్చి చూస్తే సముద్రం హోరుమంటోంది. బీచ్‌కి వచ్చి దుఃఖపడాల్సింది పోయి ఇలా పడి నిద్రపోయినందుకు సిగ్గుపడి లేచి కూచుని మళ్ళీ డ్యూటీ ఆరంభించాడు - అదే... సముద్రంలోకి చూస్తూ కూచోడం.

అంతలోనే పక్కనున్న రాళ్ళగుట్ట అవతల ఏదో అలికిడయితే తల తిప్పి చూశాడు. అక్కడ హరిత ఉంది. తను కూడా ఇతనిలాగే విషాదం అభినయించడానికి వచ్చి. చల్లగాలికి నిద్రపోయింది. నిద్రలేచి, సిగ్గుపడింది కానీ ఆనందంలా మళ్ళీ డ్యూటీలో చేరే ఉద్దేశ్యం పెట్టుకోకుండా ఇంటి కెళ్ళి నిద్రపోదామనుకుని లేచింది. లేచి ఆనందాన్ని చూసి నిరసనగా తల తిప్పుకుని, అవతలివైపు నడిచింది.

దూరంగా కెమెరా ఫోకస్‌లోంచి వెళ్ళిపోతున్న హరితను చూడగానే ఆనందానికి మంచి ఏడుపు పాట గుర్తుకువచ్చింది. హమ్మయ్య అనుకుని అది అందుకున్నాడు. అంతలోనే హరిత తిరిగి వెనక్కి రావడం మొదలుపెట్టింది. సినిమాలో ఆ పాట ఉన్న సిట్యుయేషన్‌లో క్రమంగా హీరోయిన్ వీపు ఫేడౌట్ కావడం తప్ప మొహం మళ్ళీ ఫ్రేములోకి రావడం ఉండదు. కానీ హరిత మొహం ఫ్రేములోకి వచ్చేస్తూండడంతో ఆనందం కంగారు పడి పాట ఆపేశాడు. హరిత తనను క్షమించిందా? తను ఏ పరిస్థితిలో అబద్ధం ఆడాడో గ్రహించిందా? అని ఆలోచిస్తూండగానే హరిత అతని వైపు రావడం, అతని పక్కగా నడుచుకుంటూ ముందుకు వెళ్ళిపోవడం జరిగింది.

హరిత వీపు మళ్ళీ కనబడగానే ఆనందానికి పాట మళ్ళీ గుర్తుకువచ్చింది. తన మీద తనకే బోల్డు జాలి వేసింది. పాడుతున్న గొంతు గద్గమయింది. కళ్ళు మూసుకుని పాడుతూ తాదాత్మ్యం చెందాడు. మూసుకున్న కళ్ళల్లో ఆ సినిమా హీరో మెదిలాడు. అతి కొద్ది సేపట్లోనే తనగా మారిపోయాడు. ఆ మూడ్‌లోనే పాట పూర్తయేది కానీ హరిత కంఠం వినబడి ఆగిపోయింది.

"నేనేం నీ మీద జాలితో వెనక్కి రాలేదు'' అంది హరిత కటువుగా.

కళ్ళు విప్పి, హరిత ఎదురుగానే నిలబడడం చూసి, నవ్వబోయి ఆమె ఏదో అన్నదని మాత్రం గ్రహించి, అంతకంటె ఎక్కువ గ్రహించలేక "ఆఁ ...'' అన్నాడు.

హరిత తను అన్నది రిపీట్ చేసి పక్కనే ఉన్న బండ మీద కూలబడింది, ఇసుకలో విసురుగా నడవడం వలన కలిగిన అలసట పోగొట్టుకోవడానికి.

ఆమె అలా అన్నా. హరితలో పాత ప్రేమను పునరుద్ధరించవచ్చని ఆనందరావుకి ఆశ పుట్టింది జోక్ చేయబోయాడు. "జాగ్రత్త ఆ బండ మీద అలా కూచోకు. అక్కడో పీత కాపురం పెట్టింది. తన మీద ఎవరైనా కూచుంటే నొచ్చుకుంటుంది.'' అని.

హరిత నవ్వలేదు. "మొన్నోసారి నేను కూచుంటే అది ఒప్పుకోలేదు'' అని చూశాడు ఆనందరావు. ఊహూఁ, హరిత నోరు విప్పలేదు.

ఆమె చూపంతా సముద్రం మీదే ఉంది. సముద్రం బాగా పొంగుతోంది. అలలు విపరీతంగా వస్తున్నాయి. విసిరికొడుతూ వచ్చి బండల మీద విరిగిపడుతున్నాయి. ఆకాశం అంతా చీకటయినట్టయింది. ప్రళయం ముంచుకొచ్చినట్టుంది. ఆ రోజు పున్నమో, అమావాస్యో గుర్తులేదు కానీ సముద్రం హఠాత్తుగా పోటెత్తుతోందని ఆమెకు తెలిసివచ్చింది.

ఆమె భయం చూసి ఆనందం దగ్గరికి వచ్చి హరిత చేయి పట్టుకున్నాడు. హరిత చేయి విదిలించి కొట్టలేదు. 'అటూ, ఇటూ ఎటు చూసినా నీళ్ళే. మనం

నిలబడిన కొండ ఒక్కటే మిగిలింది. కొద్ది నిమిషాల్లో అదీ మునిగిపోతుంది.' అనుకుంది. మొహం పాలిపోయింది. తన మీద తనకే చాలా జాలి వేసింది. ఇరవై రెండేళ్ళు కూడా నిండకుండా, - మొగుడూ, పిల్లలూ సంగతి సరేసరి, - కనీసం ప్రేమికుడు కూడా లేకుండా చచ్చిపోతున్నందుకు కళ్ళ వెంబడి నీళ్ళు వచ్చాయి.

"మన జాలికథకు ముగింపు ఇదేనా?" అన్నాడు ఆనందం ఆవేశంగా. చుట్టూ ఉన్న సముద్రాన్ని సంజాయిషీ అడుగుతున్నట్ట నిపించింది హరితకు.

వెంటనే దృఢనిశ్చయం చేసుకుంది. "ఆనంద్, ఈ ఆఖరిఘడియల్లో నీ వద్దనుండి దాచాల్సింది ఏదీ లేదు. నేను నిన్ను ప్రేమించాను. నీ అబద్ధం నాకు కోపం తెప్పించినా రెండు రోజుల్లోనే అది పోయింది. పంతం మాత్రం మిగిలిపోయింది. అందుకే నీకు దూరంగా మసిలేను. మృత్యువుకు దగ్గరయిన ఈ వేళ నీకు నేను, నాకు నువ్వు ఉన్నాం." అంది ఏడుస్తూ.

"ఆ మాట కాస్త దగ్గరగా వచ్చి చెప్పవచ్చుగా" అంటూ ఆనందం అక్కున చేర్చుకున్నాడు. హరిత అతని గుండెల మీద తలపెట్టి వెక్కివెక్కి ఏడవసాగింది.

కాస్సేపు చూసి ఆనందం ఇక ఉండబట్టలేక అడిగేశాడు. "నీకు చల్లగాలి అస్సలు పడదా?" అని.

ఇంతటి గంభీరమైన సమయంలో ఆనందం అలాటి సిల్లీ ప్రశ్న వేయడం ఆమెకు నచ్చలేదు. "చచ్చిపోయేవాళ్లకు చలీ, గిలీ ఏముంది? అయినా నీ వెచ్చని కౌగిలిలో ఉండగా నేను మృత్యువుకు భయపడను" అంది ఎమోషనల్‌గా.

"అదే నేనూ అనుకుంటున్నాను. ఈ పాటికే న్యుమోనియా రావడం, చచ్చిపోవడం దాకా ఎందుకు ఆలోచిస్తున్నావా అని." అంటూ నాన్చాడు ఆనందం.

"యూ ఫూల్. న్యుమోనియా వల్ల కాదు, సముద్రం అలలు వచ్చి మనను ముంచేస్తాయి. ఇద్దరూ ఛస్తాం." అని అరిచింది హరిత అసహనంగా.

ఆనందానికి అర్థం కాలేదు. "ఈ కొండ మీద ఉండగా అలలు మన్నేం చేస్తాయ్? ఇంతకు ముందు ఇలా పోటు రావడం , వెనక్కి మరలడం రెండుసార్లు చూసాను. ఇక్కడ ఉండగా భయం దేనికి?" అని అడిగాడు ఆశ్చర్యంగా, అయోమయంగా.

హరిత ఉలిక్కిపడింది. అంటే అలలు ఇక్కడ దాకా రావా? చావుభయం లేదా? మరి తను తొందరపడి మనసులో మాట చెప్పేసిందే!?

హఠాత్తుగా తన మీద తనకు ఇంకో రకమైన జాలివేసింది హరితకు. చావు గురించి కాదు, మనసు విప్పి చెప్పేసి లోకువైపోయినందుకు. ఆ జాలి లోంచి బయటపడేందుకు ఆనందాన్ని "యూ చీట్" అంటూ వెనక్కి తోసేసింది.

అప్పటికి గానీ హరిత ప్రవర్తనకు కారణమేమిటో ఆనందానికి అర్థం కాలేదు.

ఆ రోజు మధ్యాహ్నం వాళ్ళిద్దరూ మాత్రమే ఉన్నచోట జరిగిన విషయాలు నాకెలా తెలిసాయని మీరు ఇప్పటిదాకా అనుకుంటూ ఉండవచ్చు. నాకు ఆనందమే చెప్పాడు. చెప్పడం ఇక్కడ దాకానే చెప్పాడు. తర్వాత ఆనందం ఏం చేసి ఆమె కోపం పోగొట్టాడో కానీ వారం తిరక్కుండా వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకున్నారు.

-ఎమ్బీయస్ ప్రసాద్

సుమారు 300 చిన్న కథలు, 70 పైచిలుకు నవలలు, ఇంకాఎన్నో మ్యూజికల్స్ రాసి విలక్షణ హాస్యానికి పేరుబడ్డ పి.జి.ఉడ్ హౌస్ "విల్లన్స్ హోలీడే" కథ ఆధారంగా సాగిన ఈ రచనలో పాత్రలు, స్థలాలు పాఠకుల సౌకర్యార్థం మన వాతావరణానికి అనుగుణంగా మార్చబడ్డాయి.



పి.జి.ఉడ్ హౌస్




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. తరుణులు (గుండమ్మకథ ... అలిగినవేళనే)
   ఎ) గోపికలు బి)యౌవనవతులు
   సి) సమయము తెలిసి ప్రవర్తించువారు
   డి) పొరుగువారు
2. తెలిమంచు (మాంగల్యబలం...తెలియని ఆనందం)
   ఎ) ఉదయపు మంచు బి) సన్నని మంచు
   సి) చలికాలపు మంచు డి) తెల్లని మంచు
3. కాలుడు (పాండవ వనవాసము... దేవా, దీనబాంధవా)
   ఎ) కాలమునెరిగినవాడు బి) దేవేంద్రుడు
   సి) యముడు డి) శత్రువు
4. తెమ్మెర (చదువుకున్న అమ్మాయిలు...వినిపించని)
   ఎ) తేలికైన గాలి బి) తూరుపు గాలి
   సి)దక్షిణపుగాలి
   డి) తెల్లవారుఝామున ఉండే గాలి
5. నిరతము (మాయాబజార్..నీ కోసమె)
   ఎ) తపస్సు బి) అవిచ్ఛిన్నము.
   సి) శారీరకవాంఛలేనిది డి) లోతైన
6. వల్లి (మురిపించే మువ్వలు..నీ లీల పాడెద దేవా)
   ఎ) ప్రియురాలు బి) భార్య
   సి) కన్య డి) కుమారస్వామి భార్య
7. నయగారము(మహామంత్రి తిమ్మరసు..తిరుమల)
   ఎ) ప్రియోక్తి బి) అలుక
   సి) ప్రేమ డి) భయము
8. నెత్తావి(శ్రీకృష్ణార్జునయుద్ధం..మనసు పరిమళించెనే)
   ఎ) చోటు బి) పూలు
   సి) సువాసన డి) మొక్క
9. కుందనం (భద్రాచలం..చెలియా కన్నులలో)
   ఎ) గంధపుచెక్క బి) వెండి
   సి) శుద్ధమైన బంగారం డి) శిల్పం
10. సనాతనం (సుబ్బు..డుయూ)
   ఎ) పాతది బి) స్వంతం
   సి) మరచినది డి) శాశ్వతం

### జవాబులు

1) b 2) d 3) C
4) C 5) b 6) d
7) a 8) C 9) C
10) d

# భారతదేశాన్ని ఆరాధించిన

# బీటిల్ - జార్జ్ హారిసన్

**రాక్ సంగీత ప్రపంచంలో ఎన్ని బ్యాండ్స్ అయినా రావచ్చు, పోవచ్చు. కానీ బీటిల్స్ స్థానం మాత్రం సుస్థిరం. వారి హెయిర్‌స్టయిల్ అయితేనేం, పాడే తీరయితేనేం ప్రపంచం మొత్తాన్ని ఓ ఊపు ఊపింది. 1960లో నలుగురు యువకులు పాల్ మెక్‌కార్ట్‌నీ, జాక్ లెన్నన్, రింగో స్టార్, జార్జ్ హారిసన్‌లు కలిసి ఓ గ్రూపుగా ఏర్పడి తమ పాటలు తామే రాసుకుని, పాడి, ఆడి సంగీత లోకాన్ని ఉర్రూతలూగించారు. ఈ మధ్యే బీటిల్స్‌కు సంబంధించిన వస్తువులు వేలం వేస్తే 50,000 పౌండ్లు వచ్చాయంటే వారంటే ఎంత క్రేజ్ ఉందో అర్థమవుతుంది. 1970లో బ్యాండ్ విడిపోయినా స్వయం ప్రతిభతో వెలిగినవారిలో ఒకడైన హారిసన్ మొన్న నవంబరు 29న తన 58వ యేట క్యాన్సర్ వల్ల మరణించాడు. పండిట్ రవిశంకర్ శిష్యుడిగా, మహేష్‌యోగి భక్తుడిగా భారతీయులకు ఆత్మీయుడైన హారిసన్ స్మృతులు కొన్ని...**



బీటిల్స్ గ్రూపులో గిటారిస్ట్‌ఐనా హారిసన్ అందరికంటే పిన్న వయస్కుడు. శాంత స్వభావుడు. తక్కిన సభ్యులకు ఆధ్యాత్మిక గురువు కూడా. హారిసన్ 13వ ఏట స్వంత గిటారు కొనుక్కుని తన స్కూలుమేటయిన పాల్ మెక్ కార్ట్‌నీతో చేతులు కలిపాడు. పాల్ ద్వారా లెన్నన్ పరిచయమయ్యాడు. అప్పటికే వెన్నన్ క్యారీ మెన్ అనే బ్యాండ్ నడిపేవాడు. ఓ సారి ఓ గిటారిస్టు రాకపోతే హారిసన్‌ను వాయించమన్నారు. అప్పటి నుండి అతని ప్రతిభ అందరికి తెలియవచ్చింది. చుక్‌బెర్రీ, కార్ల్ పెర్కిన్స్‌ల పద్ధతిలోనే హారిసన్‌కు గిటారు వాయించడం ప్రాక్టీసు చేశాడు. హేంబర్గ్‌లో బీటిల్స్ పాడడానికి వెళ్లినప్పుడు హారిసన్ వయస్సు పదిహేడే కావడంతో అతనికి వాయించడానికి వర్క్ పర్మిట్ ఇవ్వనన్నారు. దాంతో వాళ్లు వెనక్కు మరలవలసి వచ్చింది.

హిందీ సినిమా "జాన్‌వర్"లో షమ్మీకపూర్, రాజశ్రీలపై చిత్రీకరించిన "దేఖో అబ్‌తో కిస్‌కో నహీ హై ఖబర్" అనే పాట విని ఉంటారు. బీటిల్స్ పాడిన "ఐ వాంట్ టు హోల్డ్ యువర్ హ్యాండ్" అనే పాటకు కాపీ అది. దానిలో షమ్మీకపూర్ బీటిల్స్ స్టయిల్ విగ్గు పెట్టుకుని నటించాడు కూడా.

బీటిల్‌గా ఉండడం హారిసన్‌కు విసుగు పుట్టించింది.. "ఐ.. మీ.. మైన్" అని 1979లో రాసిన పుస్తకంలో "మనకంటూ ఓ వ్యక్తిత్వం, ప్రైవసీ అనేది ఉండాలి. బీటిల్స్‌గా మాకు అది దక్కలేదు. జూలో కోతుల్లా తయారయ్యాం" అని వాపోయాడు. ఫాస్ట్‌లైఫ్‌తో అతను విసిగిపోవడానికి కారణం అతనిపై హిందూ మతప్రభావమేనని కొందరు అంటారు. తనకు సితార్ నేర్పిన రవిశంకర్ కోరికపై 1971లో బంగ్లాదేశ్ బాధితులకై అతడు "ఎయిడ్ స్టయిల్" అనే బ్యాండ్ ఏర్పాటు చేసి నిధులు సేకరించాడు.

హారిసన్ 1966లో హృషీకేశ్‌కు వచ్చి భారతదేశంలో ప్రేమలో పడ్డాడు. ఆ తర్వాత పండిట్ రవిశంకర్ వద్ద సితార్ నేర్చుకుని "హెల్ప్" అనే సినిమాలో సంగీతం సమకూర్చడానికి సితార వాయిద్యాన్ని ఉపయోగించాడు. అంతేకాదు. "నార్వీజియన్ వుడ్", "గర్ల్", "లూసీ ఇన్ ది స్కై" వంటి పాటల్లో ఆ వాయిద్యాన్ని అతి లాఘవంగా ఉపయోగించాడు. రవిశంకర్ కుమార్తె అనూష్కా అతన్ని "అంకుల్ జార్జ్" అని పిలుస్తుంది. రవిశంకర్ తయారుచేసిన "శంకర్ ఫ్యామిలీ అండ్ ఫ్రెండ్స్", "ఫెస్టివల్ ఆఫ్ ఇండియా" రికార్డు ఆల్బమ్స్‌లో



సితార్ నేర్చుకునే రోజుల్లో గురువు రవి శంకర్‌తో జార్జి హరిసన్



రాక్‌సంగీత ప్రపంచంలో ఝుంఝామారుతం-బీటిల్స్

హారిసన్ పాలు పంచుకున్నాడు. ట్రైమ్స్ మ్యూజిక్ గ్రూపు వారి "చాంట్స్ ఆఫ్ ఇండియా"లో కూడా అతని భాగస్వామ్యం ఉంది.

బీటిల్స్ ప్రజల్లో ఎంత క్రేజ్ పుట్టించారంటే ఒక్కోప్పుడు అది వారికి ప్రమాదకరంగా పరిణమించింది. 1980లో నలుగురిలో ఒకరైన జాక్ లెన్నన్‌ను ఒక వీరాభిమాని కాల్చిచంపేశాడు. హారిసన్‌పై కూడా 1989లో మతిభ్రష్టుడైన ఒక అభిమాని దాడిచేసి కత్తితో అనేకసార్లు పొడిచాడు. దాన్నుంచి బయటపడినా క్యాన్సర్ నుండి తప్పించుకోలేకపోయాడు హారిసన్. 1988లో తనకు గొంతు క్యాన్సర్ ఉందని ప్రకటిస్తూనే సిగరెట్లు తాగడం వల్లనే తనకీ గతి ప్రాప్తించిందని స్టేటుమెంటు కూడా ఇచ్చాడు. ఈ సంవత్సరం మార్చిలో లంగ్‌సర్జరీ జరిగింది. ఆ తర్వాతే బ్రెయిన్ ట్యూమర్ ఉన్నట్లు కనుగొన్నారు.

ఇంగ్లండులోని లివర్‌పూల్‌లో 1943 ఫిబ్రవరి 25న ఒక బస్ కండక్టరుకు కొడుకుగా పుట్టిన హారిసన్ బాగానే గడించాడు. లండన్‌లో 100 గదుల భవంతిలో నివసించేటంతగా సంపాదించాడు. "మై స్వీట్ లార్డ్..." పాట చేసినప్పుడు పేరు బాగానే వచ్చింది. కానీ డబ్బు అంతకన్నా బాగా పోయింది. ఆ పాట 1963 నాటి "హీ ఈజ్ సో ఫైన్ బై షిఫాన్స్..." అనే పాట నుండి స్ఫూర్తి పొందిందని చెప్పి 1976లో కోర్టు అతని భారీ మొత్తంలో - సుమారు 6 లక్షల డాలర్లు -పెనాల్టీ విధించింది. అది హారిసన్ 1981 నాటికి చెల్లించగలిగాడు. చిత్రమేమిటంటే ఈ లోపున బీటిల్స్‌కి మేనేజరుగా వ్యవహరించిన ఎలెన్ క్లెయిన్ ఆ పాట హక్కులు కొనేసుకుని ఆ డబ్బు వసూలు చేసుకున్నాడు. హారిసన్ హ్యాండ్‌మేడ్ ఫిల్మ్‌స్ అనే నిర్మాణ సంస్థ ప్రారంభించి "లైఫ్ ఆఫ్ బ్రియాన్" వంటి చిత్రాలు నిర్మించాడు కూడా. వాటిలో చాలా సినిమాలు ఫెయిలయ్యాయి. ఒకటి మాత్రం బాగా హిట్ అయింది.

నవంబరు 29న అతను లాస్ ఏంజిలిస్‌లో ఒక మిత్రుని ఇంట మరణించే సమయానికి అతని ప్రస్తుత భార్య ఒలీవియా, 24 ఏళ్ల కుమారుడు ధానీ అతనితోనే ఉన్నారు. అతని మొదటి భార్య ప్యాటీ బాయిడ్ ఒక మోడల్. "ఎ హార్డ్ డేస్ నైట్" అనే చిత్రంలో చిన్న పాత్ర కూడా వేసింది. 1966లో వారి వివాహం జరిగింది. 1970లో హారిసన్ మెక్‌కార్ట్‌నీతో "లెట్ ఇట్ బీ" చిత్రీకరణ సమయంలో అందరి ముందరా గొడవపడ్డాడు. గ్రూపు విడిపోయాక సాటి గిటారిస్టు ఫ్రెండయిన ఎరిక్ క్లాప్‌టన్‌తో కలిసి "బాడ్జ్" అనే పాట పాడాడు. వారిద్దరి మధ్య ఈ వ్యాపారబంధం పెరుగుతూండగానే ప్యాటీకి, క్లాప్‌టన్‌కి మధ్య సాన్నిహిత్యం పెరిగింది. 1977లో ప్యాటీ హారిసన్‌ను వదిలేసి క్లాప్‌టన్‌ను పెళ్లి చేసుకుంది. సహృదయుడైన హారిసన్ ఆ పెళ్లికి హాజరయ్యి ఆ జంటను ఆశీర్వదించాడు కూడా. భారతీయ ఆధ్యాత్మికత అతనికి పూర్తిగా వంట బట్టిందనుకోవచ్చు.

మహేశ్‌యోగి ప్రవచనాలకు ఆకర్షితుడైన హారిసన్ తక్కిన బీటిల్స్‌ను కూడా ఆయన భక్తులుగా మార్చాడు. కానీ వాళ్లందరూ ఆయన్ని వదిలి వెళ్లిపోయారు. లెన్నన్, మెక్‌కార్ట్‌నీ అయితే "సెక్సీ సాదీ (సాధూ అనేమో) వాట్ హేవ్ యూ డన్? యూ మేడ్ ఏ ఫూల్ ఆఫ్ ఎవిరీవన్" అనే పాట రాసి ఆయన్ని వెక్కిరించాడు కూడా. హారిసన్ మాత్రం మహేశ్ యోగిపై తన నమ్మకాన్ని పోగొట్టుకోలేదు.

బీటిల్స్ గ్రూప్‌లో పాటల రచయితలుగా లెన్నన్ - మెక్‌కార్ట్‌నీలకు బాగా పేరు వచ్చినా హారిసన్ కూడా చక్కటి పాటలు రాసేడు. 'డోంట్ బాదర్ మీ..' (అతన్ని వ్యక్తిత్వాన్ని తెలియపరిచే పాట అంటారు.) "హియర్ కమ్స్ ది సన్..." 'సంథింగ్' పాటలు అతను రాసినవే! బీటిల్స్ గ్రూపు విచ్ఛిన్నమయిపోయాక అతను చేసిన సింగిల్స్, "మై స్వీట్ లార్డ్..." వంటివి హిట్ అయ్యాయి. "ఆల్ థింగ్స్ మస్ట్ పాస్" అని వేదాంతధోరణిలో రాసిన పాట కూడా బాగా ప్రజాదరణ పొందింది. "వైల్ మై గిటార్ జెంట్లీ వీప్స్" అన్న పాట అతని మరణవార్త విన్న అభిమానులకు గుర్తుకు రావడం సహజం.

హారిసన్ మృతిపై తన దిగ్భ్రాంతిని వ్యక్తపరుస్తూ రవిశంకర్ "జార్జి నాకు శిష్యుడే కాదు మంచి ఫ్రెండు కూడా. అతని మరణం నాకెంత దుఃఖాన్ని కలుగజేస్తోందో మాటల్లో తెలియబరచలేను" అని వాపోయారు.



పాట ప్రాక్టీసు చేస్తున్న బీటిల్స్

-కమ్యూనికేటర్ ఫీచర్స్

# హారిసన్ ఆఖరికోరిక తీరేనా?



హారిసన్ ఇటీవలి ఫోటో

హిందూ దేశాన్ని ప్రేమించి, హిందూమతాన్ని ఆరాధించిన జార్జ్ హారిసన్ ఓ పక్కా హిందువులా తన చితాభస్మం గంగలో నిమజ్జనం కావాలని కోరుకున్నారు. హారేకృష్ణ సొసైటీలలో సభ్యుడైన హారిసన్ 3 నెలల క్రితం వారణాశికి వచ్చి అక్కడ కట్టబోయే హారేకృష్ణ మందిరానికి 10 లక్షల డాలర్ల విరాళం ఇస్తానని ప్రకటించాడు.

హారిసన్ మరణానంతరం హారేకృష్ణ సొసైటీవారు అతని భార్యకు, కుమారుడికి నిమజ్జనం సంగతి గుర్తు చేశారు. గంగానది అనేక వేల మైళ్ల పొడవున ప్రవహిస్తుంది కాబట్టి ఎక్కడో అక్కడికి కుటుంబసభ్యులు రహస్యంగా వచ్చి అస్తినిమజ్జనం చేస్తారని పుకార్లు పొక్కాయి. చనిపోయిన 13 రోజుల్లోగా కాశీలోనే కలుపుతారనుకున్న హారిసన్ అభిమానులు, పాత్రికేయులు అక్కడ గుమిగూడారు. హారిసన్ భార్య, కుమారుడు స్విట్జర్లండులోని లుగానోకు ఎక్స్‌పోర్టు లైసెన్స్ పొందారని లండన్‌లోని 'సండేటైమ్స్' పత్రిక ఓ కథనంలో పేర్కొంది. లుగానోలో హారిసన్‌కు 14 గదుల భవంతి ఉంది. చితాభస్మాన్ని ఆల్ప్స్ పర్వతాలలో చల్లుతారా లేక సంవత్సరీకంలోపున గంగానదిలో కలుపుతారా అన్నది ఇంకా తెలియదు. హారిసన్ కుటుంబసభ్యులు ఈ విషయమై పెదవి మెదపటం లేదు.



ఆధ్యాత్మిక గురువు మహేష్ యోగితో



గంగానది

## భద్రాచలం NEVER GIVE UP

### తారాగణం

**శ్రీహరి, సింధు, రూప,**
కోట శ్రీనివాసరావు,
మల్లిఖార్జునరావు,
బాబూమోహన్, విజయ్‌చందర్,
ఏవీయస్,
గుండుహనుమంతరావు

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో 'హాసం' పత్రిక అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది

### సాంకేతిక వర్గం

రచనాసహకారం: వైయస్ కృష్ణేశ్వరరావు
పాటలు: వేటూరి, సుద్దాల అశోక్‌తేజ, చంద్రబోస్.
సంగీతం: వందేమాతరం శ్రీనివాస్
ఫోటోగ్రఫీ: జస్వంత్
మేకప్: కల్లపారి భాస్కర్ రెడ్డి
కాస్ట్యూమ్స్: కానూరి బ్రదర్స్
హెయిర్ డ్రస్సర్స్: విజయ్, సరోజ
స్టిల్స్: ఇవివి. శ్రీను
కథ-మాటలు: పోసాని కృష్ణమురళి
నిర్మాత: కాట్రగడ్డ లోకేష్
స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: ఎన్.శంకర్

8




## సుబ్బు

### తారాగణం

**జూ॥ ఎన్.టి.ఆర్., సోనాలి జోషి,**
బ్రహ్మానందం, ఏవీయస్,
ఎమ్మెస్‌నారాయణ,
ధర్మవరపు సుబ్రహ్మణ్యం, బెనర్జీ,
కళ్ళు చిదంబరం

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు **'రాజా'** పర్యవేక్షణలో 'హాసం' పత్రిక అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది

### సాంకేతిక వర్గం

సంగీతం: మణిశర్మ
పాటలు: సీతారామశాస్త్రి, అశోక్‌తేజ, కులశేఖర్, జాలాది
ఫోటోగ్రఫీ: విజయశ్రీ
నిర్మాతలు: ఆర్.శ్రీనివాస యాదవ్, హరికుమార్ యాదవ్
కథ, స్క్రీన్‌ప్లే - దర్శకత్వం: రుద్రరాజు సురేష్ వర్మ

8



రచన: సుద్దాల అశోక్‌తేజ **1** గానం:వందేమాతరం,ఉష

అ: ఇదే నా పల్లెటూరు - ఇదే నా తల్లిగారు
మా ఊరి పాడిపంట - రాములోరి దీవెనంట
తల్లి గోదావరి నీళ్ళు - కడిగె సీతమ్మ పాదాలు
ఊరంతా... హోయ్... హోయ్... హోయ్...
మనసంతా... హోయ్... హోయ్... హోయ్...
ఇదే నా పల్లెటూరు - ఇదే నా తల్లిగారు
మావూరి పాడిపంట - రాములోరి దీవెనంట...
ఆ: రామునికి బాణ మొకటి - భార్య సీతమ్మ ఒకటి
ఆ రాముడంటి కొడుకు - ఇంటింటా వుంటే ఒకడు
ఊరంతా... హోయ్... హోయ్... హోయ్...
మనసంతా జాయ్... జాయ్... జాయ్...
అ: ఒక దేవుడే తనకు - ఒక ధర్మమే తనది
హనుమంతుడే మనకు - ఆదర్శమే అయితే
ఊరంతా... హోయ్... హోయ్... హోయ్...
మనసంతా... హోయ్... హోయ్... హోయ్... ॥ఇదే నా॥
ఆ: తొలకరిలో వాన చుక్క - రుచి చూస్తే తేనెచుక్క
భూమితల్లి మోముపైన - చిన్న గరిక నవ్వుతుంటే...
ఊరంతా... హోయ్... హోయ్... హోయ్...
మనసంతా... జాయ్... జాయ్... జాయ్...
అ: ఆలమంద పాలధార - మీటుతున్నదో సితార
కడుపునిండ పాలుతాగి - లేగదూడ ఆడుతుంటే
ఊరంతా... హోయ్... హోయ్... హోయ్...
మనసంతా... హోయ్... హోయ్... హోయి
ఇద్దరు: ॥ఇదేనా॥



ఆ2: ఆట చూసి ఆడియన్స్
కళ్ళు మిటకరించి గుటకలెయ్యగ ॥చేసేత॥
ఆ2: రేసుకారులే నాకిష్టం క్యాష్ కార్డులే నాకిష్టం
పిల్లషోకుల బ్రహ్మచారుల నీలి జోకులే నాకిష్టం
ఆ1: తెల్లముగ్గులే నాకిష్టం... నల్లమబ్బులే నాకిష్టం
బోసినవ్వుల చిన్న పాపల బుగ్గసొట్టలే నాకిష్టం
ఆ2: థాయిలాండ్ నాకిష్టం ఆ1: తాతవూరు నాకిష్టం
ఆ2: రిస్ట్‌బ్యాండ్ నాకిష్టం ఆ1: తిరుపతి దారం నాకిష్టం
ఆ2: కోటి మందితో క్యూ కట్టించే నా కులుకే నాకిష్టం
ఆ1: మంచి మనిషితో ముడిపెట్టించే
నామనసే నాకెంతో ఇష్టం ...ఆ... ॥చేసేత॥
ఆ2 మాట కలపడం న్యాైజం మనసు లాగడం నా నైజం
మాట కలుపుతూ.. మనసు లాగుతూ మధువు చిలకడం నా నైజం
ఆ1: చేయి కలపడం నా నైజం.. చెలిమి చెయ్యడం నా నైజం
చేయి కలిపిన చెలిమి కొరకు చివరంటూ నిలవడం నా నైజం
ఆ2: పరుగనేది నా నైజం ఆ1: పరువే అన్నది నా నైజం
ఆ2: పగటి కలలు నా నైజం ఆ1: తీపి కలలు నా నైజం
ఆ2 ఘడియ ఘడియలో ఉడుకుడుడుకుగా.. గడపడమే నా నైజం
ఆ1: గడప పసుపులా.. గుడికి ప్రమిదలా బ్రతకడమే నా జీవిత నైజం.. ఆ..
ఆ2: ఆ... ॥చేసేత॥
ఆ1: సాసస సాసస సాసస రిమపద సాసస సాసస సాసస
సా సరిసరిస గసగసగ పదపమపమ సరిసరిస
గసగసగ పదపమపమ
ఆ2: హే...
ఆ1: సాసాస ససాసాస గసగ పదప మపమ రిమరి సరి సగస
ఆ2: హే... ఆ1: ఆ...



రచన: సుద్దాల అశోక్‌తేజ **1** గానం: కె.కె

వైవా వైవా వైవా ప్రామిస్ చేయవా
చెప్పగలిగే మనసే ఓపెన్ చెయ్యవా
చూపు చూపు నడుమ వంతెన వేయవా
ప్రేమకోసం ప్రేమా వైవా ॥వైవా॥
నాకు నీకు నడుమ వంతెన వెయ్యవా
ప్రేమకోసం ప్రేమా వైవా... వా
మనిషిని మించిన వండర్ భూమండలాన ఇకలేదు వైవా వైవా
నవ్వలేని కంప్యూటర్ కొనగోటికైనా సరిపోదూ వైవా వైవా
కలుపు చేయి దోస్తీచేయి ప్రేమించేయి తగువేలనే
పావురాయి శాంతిదాయి మనిషిపై పగలేలనే ॥వైవా॥
కాలేజి కాంపౌండే మన ఫ్యూచర్ చౌరస్తాలే వైవా వైవా
ఎవరు ఏంకావాలో తేలాల్సింది ఇక్కడనేలే వైవా వైవా
మెరుపుధారా మేరేయారా మనచుట్టూరా చేరే టైం ఇదే
ప్రేమ ధారా పంచుకోరా ప్రేమద్వారా నా పిలుపిదే ॥వైవా॥

రచన: జాలాది **2** గానం: మల్లికార్జున్, సునీత

అ: ఎల్ ఓ వి ఇ పాసయ్యాను నీరజా
హీరోలా నిన్నేలుకుంటా ప్రేమజా
ఆ: ఎల్ ఐ ఎఫ్ ఇ చదవాలండీ లవ్ డియర్
ఆ తరువాతే అన్నీ ఖాయం డోంట్ ఫియర్
అ: రోజు రోజు నీ మోజులన్నీ డైలీ లవ్‌లీ డైరీలో చేర్చగా
లిపిలిప్ నీ ముద్దు క్లిప్‌తో సరదా పరదాలే దాటగా
ఆ: నన్నల్లుకో గమ్మత్తుగా ఈ నెచ్చిలే నీ సొత్తుగా
అ: ఓ యస్సుగా లవ్ కిస్సుగా వెచ్చగా నులివెచ్చగా



రచన: కులశేఖర్ **6** గానం: ఆర్.పి.పట్నాయక్, గంగ

అ: మస్తు మస్తు సంగతుంది నీలోపోరి
పస్తులుంచమాకే నన్ను డైలీ ప్యారీ
ఆ: లుక్కు తోటి చంపమాకు ఐయామ్ సారీ
మూడు ముళ్ళు వేసినాకే మిగతా స్టోరీ
అ: చాంగ్ బళా చెంగువలా వేసావే చకోరి
ఆ: ఎందుకయా నిందలలా చేసేయి సవారి
అ: వస్తవ పిల్లో ముద్దిస్తవ హల్లో
ఆ: వస్తను బావో ఏం చేస్తవో ఏమో ॥మస్తు॥
అ: జున్ను ముక్క లాంటి సోకు నీదంటివే
కన్ను కప్పి పారిపోకే నా యంటీవీ
ఆ: వెన్నపూస రాసి నేను పెంచా బాడీ
నిప్పుతోటి కట్టమంటే ఎట్టా జోడీ
అ: జోకులేయకోయమ్మో చాలు కామెడీ
ఆ: కేకలేయకోరయ్యో నైటు బి రెడీ
అ: అవునంటే హుషారు
నీతోటే షికారు హార్టు బీటు స్పీడాయె... ఛలో...ఛలో ॥మస్తు॥
ఆ: ఆకు చాటి పిందె లాగ ఎన్నో డేసు
ఎండకన్ను ఎరగకుండా వున్నా బాసు
అ: కూత కొచ్చినాది ఈడు దేఖో పిల్లో
కొత్త విద్య నేర్చుకోవా కౌగిలి బళ్ళో
ఆ: కబురులింక చాలించి మొదలు పెట్టవె
అ: మదన మంత్రమేశానా వదిలి పెట్టవె
ఆ: ఈ కన్యా కుమారి సైయంటే తయ్యారి
నైటు రౌండు లేద్దామా ఛలో ఛలో... ॥మస్తు॥

ఎదనిండా చిరునవ్వే -చిరునామై ఉంటున్నా
నిన్నే వీడని నీడవలె
నీతో వుంటా ఓ నేస్తం
నమ్మకమే మనకున్న బలం
అ: నీలి కళ్లలో -మెరుపు మెరవాలి
కారు చీకట్లో -దారి వెతకాలి
గాలి వానల్లో -ఉరుమై సాగాలి
తగిలే గాయాల్లో -ధ్యేయం చూడాలి... ॥ఒకటే జననం॥
ఆ: నిదరోక నిలుచుంటా - వెన్నెలలో చెట్టువలె
నీకోసం వేచుంటా -కన్నీటి బొట్టువలె
అడుగడుగూ నీగుండె -గడియారం నేనవుతా
నువు నడిచే దారులలో -ఎదురొచ్చి శుభమౌతా
రాశిగ పోసిన కలలన్నీ
దోసిలి నిండా నింపిస్తా
చేతులు సాచిన స్నేహంలా...
ఆ: ముట్టుకున్నావా - మువ్వ అవుతుంది
పట్టుకున్నావా - పాటే అవుతుంది
అల్లుకున్నావా - జల్లె అవుతుంది
హత్తుకున్నావా - వెల్లువౌతుంది. ॥ఒకటే జననం॥

రచన: చంద్రబోస్ **5** గానం: కవితా సుబ్రహ్మణ్యం, జస్పిందర్ నరూలా

ఆ1: చేనేత చీరకట్టి
చేమంతి పూలు పెట్టి
పాడనా తెలుగు చిలకలా
ఆ2: స్కిన్ టైట్ షార్ట్ చుట్టి
స్లీవ్‌లెస్ టాపుకట్టి
ఆడనా ఆంగ్లనెమలిలా
ఆ1: పాట వింటూ
శ్రోతలంతా చిటికెయ్యరా ।2।



రచన: వేటూరి **2** గానం:ఉదిత్‌నారాయణ్,స్వర్ణలత

ప.అ: కుడ కుడ రోడ్డులో పిల్లవుంది ।2।
అది రానంటుంది
నన్నే రమ్మంది ॥కుడ॥
పూల చెట్టు మీద పాలపిట్టవోలే పిల్ల ఉంటదండి
సన్నజాజిలాగ కన్నె నడుం భలే సన్నగుంటదండి
ఆ: ఒక తీయని - మాటుందని
ఇక సందేల చేసైగ చేసిందిరో... ॥కుడ॥
అ: కాటుకనలు పెట్టదుగానీ - కత్తిలాంటి కళ్లపిల్ల
వాలుచూపు చూసిందా దిగుతుందీ ముల్లు
ఆ: చూడకుండా ఉండలేవు
చూడగానే తట్టుకోవు
అదిజున్ను పాలబుగ్గ
తీగలేని మల్లెమొగ్గ
అ: నీ చెంపలో ఓ చక్కని చిన్నారి నొక్కుంది
ఆ: నీ రాకతో ఆ బుగ్గలో గన్నేరు పూసింది
అ: అది కొంగుతో - నా గుండెను
ఇక ముడిపెట్టి ముడుపల్లే దాచిందిరో ॥కుడ॥
అ: చెరువులోన కడవతో వంగి-నీళ్లతోన నింపుతువుంటే
రోడ్డుమీద లారీలు టెంపోలు లైను
ఆ: వచ్చినోళ్లు ఎందరున్నా
నచ్చినోడు ఒక్కడేలే
చక్కనోడు పక్కనుంటే
ఎక్కడున్నా స్వర్గమేలే
అ: నీ మాటలో ఏమున్నదో మత్తెక్కిపోతుంది



తను మన జంటలో కోట కట్టిందట
అ: ఈ బంధమే పంచ ప్రాణాలుగా
పెంచుకోవాలట పంచుకోవాలట
ఆ: నీ కోసమే నీ కోసమే నే ఉన్నాను తెలుసా
నాకు నీ స్నేహమే ఊపిరైంది తెలుసా
అ: విన్నావో లేదో నువ్వీ సంగతి
లోకాన ప్రతివారు అంటున్నది
ఆ: కళ్లారా మనకేసి చూసేందుకే
చూపుంది అన్నారు నిజమా అది
అ: ఏ... నీమనసు ఆమాట ఔనేమో అనలేదా
అనుమానంగా ఉన్నదా
ఆ: ఆ... జనమంతా అనుకుంటే కడదాకా
నిలిచేలా సాగాలి ముచ్చట ॥ఈ బంధమే॥
ఆ: నాలోనా ఏ వింత దాగున్నది
చిత్రంగా చూస్తావలా దేనికి
అ: అసలైన సంతృప్తి కలిగుంటుంది
ఈ బొమ్మ చెక్కాకే ఆ బ్రహ్మకి
ఆ: ఓ... ప్రాణం ఇద్దరిలా కనిపిస్తూ ఉంది ఇలా
సగభాగం నువ్వు కాదా
అ: ఓ... నీలోనా సగమయ్యేలా అదృష్టం నాదైనా
కలలాగే అనిపించదా ॥మన కోసమే॥



ఆ: ఫిఫ్టీ ఫిఫ్టీ లైఫిస్తుంది క్లాసుగా
అ: అందుకే ఎల్ఓవిఇ నీరజా
ఆ: చిలిపి చిలిపి కౌగిళ్లోన ఆ సిగ్గే సీమంతమాడగా
ఊహలన్నీ ఉయ్యాల మంచమై నువ్వే నేనై పాడగా
ఆ: లవ్ పోస్టులో వేసేయ్యనా సెల్‌ఫోన్‌లో చెప్పెయ్యనా
ఆ: అది అందితే నే చూడనా తొలి బంధమై నేనుండనా ॥ఎల్ఓవిఇ॥

రచన: కులశేఖర్ **3** గానం:మనో, సునీత

హరీ హరా హరీ హరా హరీ హరా
ఆ: చలికాలంలో దొరికావంటే హరి ఓం హరా
పరువాలన్నీ సెగ దుప్పట్లో షరబషరా
ఆ: అందాలన్నీ అందిస్తాగా హరి ఓం హరా
జతగా వస్తే జరిపిస్తావా
యమజాతరా
అ: ఓ పాలపిట్ట తెగ ఊగాలే ఇట్టా
నీ వయ్యారం ఉయ్యాలూగేలా
ఆ: ఓ ఇంటి వోడా అరె నా ఇంటివోడా
నువ్వాడాలి నాతో రంగీలా ॥హరీ॥
అ: వారాలు వర్జాలు చూడాలిగా ఓయమ్మో ఆగమ్మో
ఆ: ప్రాయాల కజ్జాలు ఆపేదెలా అమ్మమ్మో చెప్పమ్మో
అ: అందాల ముద్దబంతి బాలికా
పంతాల పొద్దు గుంకనీయకా
ఆ: చూస్తావే బుద్దుడల్లే తారకా ఓసారి ముద్దు మంత్రమేయకా
అ: రాకాసి పిల్లా చిరు సిగ్గేలేదెల్లా ఇక నీతోటి వేగేది ఎల్లాగా
ఆ: ఓ ఇంటివోడా అరె నా ఇంటివోడా తెగ సిగ్గంటే గడిచేదెల్లాగ ॥హరీ॥
ఆ: తెల్లార్లు ఇల్లాగే సాగాలయ్యో యాగాలు త్యాగాలు

ఆ: ఈ మాటలు నువ్వంటెనే గమ్మత్తుగుంటుంది
అ: అసలింతకి ఆపిల్లని
నా కల్లోన చూశాను అంతేనురో... ॥కుడ॥

రచన: సుద్దాల అశోక్‌తేజ **3/6** గానం: కుమార్‌సాను, స్వర్ణలత

అ: ఓ... ఓ... చెలియా కన్నులలో
దాగెనులే వెన్నెల సోయగమె
ఆ: నా కురులల్లో నిను దాచేస్తా
అ: నా ఊపిరితో మంత్రం వేస్తా
ఆ: యవ్వనపు తీపి సోయగాల హోయిలీల
తుఫానై నీలో వీస్తా... ॥ఓ॥
ఆ: కోరి ఇచ్చె పెదవుల్లో - ముద్దు తీయగ వుంటుంది
అందమంతా అందుకో
అ: ఎప్పుడేది మీటాలో - గుట్టు తెలిసిన వాణ్ణమ్మో
భారమేసి ఒదిగిపో
ఆ: నన్ను తడిమి తెలుసుకోరా - వన్నెముడి యాడుందో
అ: మెలికలెన్నో తెలుపుతున్న - కన్నెబడి నీదమ్మో
ఆ: నా మోము నీ చిలిపి వానల్లో తడవాలి
అ: అది నీవు తెలవారి అద్దాన్ని అడగాలి
ఆ: సందేహం నాకులేదు ఓహో మోహదేహ
దాహాలే తీరే ఆహా ॥ఓ॥
ఆ: గుప్పెడంత గుండెల్లో - నిప్పులేని మంటుంది
తేనె జల్లు చల్లిపో
అ: పాలువెన్న చక్కెరలె - జాలువారె చుక్కవులె
జారి ఎదపై వాలిపో



ఆ: కండరాల మెరుపు చూసి గడపదాటొచ్చాను
అ: కుందనాల తనువు మీదే మనసు పారేశాను
ఆ: చల్లారిపోరాదు ఈ వేడి జాబిల్లి
అ: అల్లాడిపోవాలి పరువాల సిరిమల్లి
ఆ: ఉత్సాహం చూపి అల్లుకోర ఆశతీర
దాసోహం... నీకే... నేను ॥ఓ...॥

రచన: సుద్దాల అశోక్‌తేజ **4** గానం: శంకర్ మహదేవన్, చిత్ర

ఔట్ ఆఫ్ ది డార్క్‌నెస్
కేమ్ ది లైట్
ఆల్ లైట్స్ బిగేన్ ఇన్ ది డార్క్‌నెస్
వుయ్ ఆర్ ఆల్ మూవింగ్ టువార్డ్ ది లైట్... కమ్
స్టెప్ విత్ మి ఆన్ దిస్ జర్నీ ఆఫ్
లైఫ్ టైమ్
అ: ఒకటే జననం - ఒకటే మరణం
ఒకటే గమనం - ఒకటే గమ్యం
గెలుపు పొందేవరకు - అలుపులేదు మనకు
బ్రతుకు అంటే గెలుపు - గెలుపు కొరకే బ్రతుకు
కష్టాలు రానీ - కన్నీళ్ళు రానీ
ఏమైనా కానీ - ఎదురేది రానీ
ఓడిపోవద్దు - రాజీపడొద్దు
నిద్రే నీకొద్దు - నింగి నీ హద్దు
ఆ: ॥ఒకటే జననం॥
ఆ: రాబోయే విజయాన్ని - పిడికిలిలో చూడాలి
ఆ గెలుపు చప్పట్లే -గుండెలలో మోగాలి.
నీ నుదిటి రేఖలపై -సంతకమే చేస్తున్నా



అ: అయ్యారె అల్లర్లు ఆఫాలమ్మో తాయారు ఏంజోరు
ఆ: ఆ నీలి మబ్బుల్లోన ఆగుమా
మావంక చూడకింక చంద్రమా
అ: కెరటాలా నిచ్చెనుంటే సాధ్యమా
ఆ నింగి తాకలేవు సంద్రమా
ఆ: ఓ పూలరంగ అరె నా సామిరంగా
ఒకటవ్వాలి రారా సారంగా
అ: రాకాసి పిల్లా చెలరేగద్దే అలా
నా ముందు టింగరి వేషాలా ॥హరీ॥

రచన: జాలాది **4** గానం: మనో

ప: డుయూ హియర్ మి
లేడీస్ అండ్ జెంటిల్‌మెన్
డు యూ లవ్ మి
డుయూ లవ్ యువర్
మమ్మి అండ్ డాడీ
సై నాట్
సో దట్
డు లవ్ మదరిండియా
యూ టు లవ్ ఇండియా ॥డు॥
జననీ జన్మభూమినీ
స్వర్గమన్న దొక కవి కులం
ఏది అది ఎక్కడో
వెతకమంటుంది
గురుకులం
గుండె పిండుకుని తాగిన
గుక్కెడు పాలు
గురుతులేనప్పుడు
పోతపాల సీసాలకోసమై
పరుగులాటలే ఎప్పుడు
సో దట్ వాట్ యూ సే
ఐ లవ్ మై ఇండియా
లవ్ యూ మదరిండియా
యూటు లవ్ ఇండియా
డు లవ్ మదరిండియా
చ:ఆకాశంలో ఆ సూర్యుడు ఒక్కడే
అభ్యుదయంలో నాదేశమొక్కటే
ఆ సూర్యుడు ఎప్పుడు
తూర్పు దిక్కునే ఎంచుకు



పుడతాడు
కళ్యాణ తిలకమై కన్నతల్లి
ఒడిలోనే వుంటాడు
అలాంటిదేరా నా భారతదేశం
సనాతనంలో సమిష్టి దేశం
ఆ సనాతనం తనపునాదిలోనే
సంకరమౌతుంటే
ఆ అభ్యుదయానికే సభ్య
సమాజం సమాధి కడుతుంటే
తర తరాల దాస్యం
తెంచుకున్న ఈ స్వరాజ్య దేశంలో
యువ తరాలు
మళ్లీ పరాయి భిక్షకు పరుగులూ
తగునా ॥ఐ లవ్॥
చ: పరాయి దేశంలో
కిరాయి కోసమని
స్వదేశ జ్ఞానం సమాధి
కడుతుంటే
ఆ కూలి డబ్బు డాలర్లలోనే
సుఖ జీవనముందంటే
ఆ పాలి కాపు నీ పాలి శత్రువై
తిరిగి వెళ్లమంటే
కడుపు తీపికే కన్నీళ్ల రోదనై
కన్న తండ్రికే అది మూగ వేదనై
ఆ నారు పోసి నీరెట్టినోళ్లకు
ఫలితం ఏముంది?
ఈ పుణ్య భూమిలో
పుట్టినందుకు ప్రతిష్ఠ ఏముంది?
ఆ కీర్తి ప్రతిష్ఠల
హిమాలయాన్నే సిగలో
ముడిచిన తల్లికి
దురాగతాల తురాయి
పువ్వులు అలంకరించుట
న్యాయమా ధర్మమా ॥ఐ లవ్॥

రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి **5** గానం: కీరవాణి, కవితా సుబ్రహ్మణ్యం

అ: నా కోసమే నాకోసమే నువ్ ఉన్నావు తెలుసా
నాకు నీ స్నేహమే ఊపిరైంది తెలుసా
ఆ: మన కోసమే ప్రేమ పుట్టిందట

## ఫంక్షన్స్‌లోగాని, నలుగురు కూర్చుని సరదాగా నవ్వుకునే సమయాల్లోగాని సులభంగా ప్రదర్శించడానికి పనికొచ్చేలా ధారావాహికంగా 'హాసం' సమర్పిస్తున్న కామెడీ స్కిట్‌లలో రెండవది ఇది.



# కళ్ళలో పెళ్ళి పందిరి కనపడ సాగే....

-రాజా

**చేతిలో కొన్ని కవర్లతో అనంత్ అడుగు పెడతాడు. సోఫాలో గుండు హనుమంతరావు పడుకొని నిద్రపోతూ ఉంటాడు షర్టు లేకుండా**

అనంత్ : (మెల్లగా) హనుమంతరావు గారూ... హనుమంతరావు గారూ... (హనుమంతరావు చలించడు)

అనంత్ : (కోర్టు మాడ్యులేషన్ + వేలంపాట మాడ్యులేషన్‌తో) గుండు హనుమంతరావు గారూ... ఒకటోసారి, గుండు హనుమంతరావు గారూ... రెండోసారి, గుండు హనుమంతరావు గారూ... మూడోసారి..

గుండు : (ఉలిక్కిపడి లేచి, నోరుకొట్టుకుంటూ)అయ్యయ్యయ్యో... ఎవరండీ బాబూ... (అనంత్‌ని చూసి) ఓరి... నువ్వా... ఎవరైనా వింటే ఇల్లువేలం వేసేస్తున్నారనుకుంటారు తెలుసా?

అనంత్ : అనుకుంటే అనుకోనీ గురూ... నీ ఇల్లు వేలం వేసేస్తున్నారని - వాడెవడో అనుకుంటే... - 'ఒద్దుబాబూ అలా అనుకోవద్దూ హనుమంతరావు ఫీలవుతాడు' అని అడ్డుకోడానికి నాకేం హక్కుంది!? పోనీ అనుకోనీ గురూ... అలాగైనా ఓ మనిషికి ఆనందం కలిగించిన వాణ్ణవుతాను.

గుండు : ఓరి మిత్రద్రోహీ... ఉండు నీ పనిచెప్తా... ఇంతకీ వచ్చిన పనేంటో ఏడు...

అనంత్ : (చేతిలోని శుభలేఖలు దులుపుతూ గర్వంగా నవ్వుకుంటూ) హు హు హు హు... ఇది ఏడుస్తూ చెప్పేది కాదు... నవ్వుతూ ఇచ్చేది... అంతకన్నా ముందు... ఈ గెటప్పేంటి బాబూ... (గుండు పొట్ట చూపిస్తూ) కిరాణా షాపులో బెల్లంకుండలాగా... షర్టేసుకో

గుండు : అలాగా... సరే అయితే... (సోఫాపైన వేసి ఉంచిన షర్టు తీసి 'పెదరాయుడు'లో రజనీకాంత్ కండువా వేసుకున్న స్టయిల్లో 'ష్' మంటూ తిప్పి భుజంమీద వేసుకుంటాడు.) ఇప్పుడు కానీ... ఆ నవ్వుతూ ఇచ్చేదేంటో... ఇవ్వు

అనంత్ : నిజంగా హైదరాబాద్‌లో ట్రాఫిక్ లెవెల్ గురూ నీది... ఎంత బాగా అర్థం చేసుకున్నావు... నమస్తే అన్న! జోహారు...(దండం పెట్టేస్తాడు)

గుండు : మరి నువ్వేగా షర్టు వేసుకో అన్నావు... వేసుకున్నాను... తొడుక్కో అని అంటే తొడుక్కునే వాణ్ణి (షర్టు తొడుక్కుంటూ) ఇంతకీ వచ్చిన పనేంటో చెప్పు... ఊరికే రావుగా...

అనంత్ : ఊరికే రావటం ఎలా కుదుర్తుంది గురూ! ఉన్న ఆస్తులన్నీ రాసిస్తే గానీ తీసుకురారుగా ఆటోవాళ్ళు... సరే... ఇదిగో పెళ్ళి శుభలేఖ...

గుండు : శుభలేఖా... ఎవరి పెళ్ళీ...? ఎక్కడా? ఎప్పుడూ?

అనంత్ : ఖర్మగురూ... అన్ని వివరాలూ అందులోనే ఉంటాయి కదా... కాస్త ఓపిక చేసుకొని చదవొచ్చుకదా...

గుండు : ఎదురుగా నువ్వున్నావు కదా... చెప్పొచ్చుకదా...

అనంత్ : సరే... నా పెళ్ళి... నువ్వు రావాలి... మొదటి శుభలేఖ నీకే... ఓకే!?

గుండు : నీకు పెళ్ళా...?

అనంత్ : లాడెన్‌కి నోబుల్ శాంతి బహుమతి వచ్చినట్టు ఆ ఆశ్చర్యం ఏంటి గురూ... ఏం చేసుకోకూడదా?

గుండు : అది కాదు అనంతూ... నీ మీద ఎన్ని ఆశలు పెట్టుకొన్నాను నేను?

అనంత్ : నా మీద నువ్వు ఆశలు పెట్టుకోవడం ఏంటి అసహ్యంగా... ఎవరైనా వింటే డిఫరెన్స్‌లొచ్చేస్తాయి గురూ బావుండదు.

గుండు : అది కాదోయ్... మా బంధువుల్లో పెళ్ళి కాని ఆడపిల్లలు ఎంతో మంది ఉన్నారు వాళ్ళలో ఎవర్నయినా నువ్వు చేసుకోకపోతావా అని...

అనంత్ : సారీ గురూ! నేనంటే నీకింత ఇష్టం అని నాకు తెలీదు... సారీ... మాది లవ్ మ్యారేజీ... అందుకనీ...

గుండు : లవ్ మ్యారేజా... అంటే... నీక్కాబోయే శ్రీమతి బాగా అడ్వాన్సుడా?
అనంత్ : ఎందుకూ?
గుండు : ఏం లేదూ ఇన్నాళ్ళూ పెళ్ళికి దూరంగా భీష్మించుక్కూచున్న నిన్ను ఆకస్మాత్తుగా ముగ్గులోకి దించేసిందంటే...
అనంత్ : అదేం లేదు గురూ షీ ఈజ్ జస్ట్ ఎ విలేజ్ గర్ల్... పల్లెటూరి పిల్ల... పల్లెపడుచు...
గుండు : పట్నం వచ్చిన పతివ్రత!... ఆపెయ్ నీ సినిమా టైటిల్స్... పల్లెటూరి పిల్ల అయితేనేం... ఈ రోజుల్లో వాళ్ళుకూడా



ఎంత అడ్వాన్స్‌డ్‌గా ఉన్నారో తెలుసా?
అనంత్ : నాక్కాబోయే శ్రీమతి అంత తెలివైంది కాదు గురూ 'షీ ఈజ్... జస్ట్ ఎ ఫాధర్ చాట్ డాటర్' అంతే!
గుండు : ఫాదర్ చాట్ డాటరా!? అంటే ఏమిటి సోదరా?
అనంత్ : తండ్రి చాటు పిల్ల
గుండు : ఆహా... ఇది ఇంగ్లీషా... తెలుగా బాబూ
అనంత్ : టింగ్లీష్
గుండు : శభాష్...! అయితే నీక్కాబోయే మావగారు చేశారన్నమాట... నిన్ను ట్రాపు... నేనెక్స్‌పెక్ట్ చేశా
అనంత్ : అప్పుడే ఎక్స్‌పెక్ట్ ఎలా చేశావు గురూ? నేను చెప్తోంది ఇప్పుడే కదా
గుండు : అదే... అదే ఎక్స్‌పీరియన్స్ అంటే...
అనంత్ : ఇది చాలా అన్యాయం గురూ! మీ వాళ్ళ పిల్లల్ని చేసుకోలేదని... ఏవేవో ఊహించుకుని నాక్కాబోయే వాళ్ళని అంత దారుణంగా అంటావా...? ఇదేం బాలేదు
గుండు : బాగా వెనకేసుకొస్తున్నావే... అంత అందంగా ఉంటుందా మీ ఆవిడ?
అనంత్ : (కళ్ళు మూసుకొని ఊహించుకుంటూ) చక్కని చుక్క
గుండు : నువ్వు టక్కరి దొంగవా?
అనంత్ : (తన్మయత్వంతో) అతిలోక సుందరి
గుండు : ఓహో దిగేడండి జగదేకవీరుడు... డెఫినిట్‌గా ఇదేదో వశీకరణం బాపతే...
అనంత్ : (కొద్దిగా తెప్పరిల్లి) ఏ కరణం...?
గుండు : కరణం కాదు, మునసబు కాదు... వశీకరణం... వశీకరణం...
అనంత్ : వశీకరణం అంటే...
గుండు : ఉంగరాలు అవీ పెట్టేసి లొంగదీసేసుకోవడం...
అనంత్ : ఆ ఎక్స్‌పీరియన్సు కూడా ఉందా గురూ నీకు
గుండు : నాక్కాదు... మా బాబాయ్‌కి...
అనంత్ : అంటే ఇప్పుడేమైనా ఫ్లాష్‌బ్యాకా
గుండు : యా... అయామ్ గోయింగ్ టు ఫ్లాష్ యువర్ బ్యాక్ (వీపు మీద చరుస్తాడు అనంత్ బోర్లా పడతాడు. అతన్ని లేపి...) మా బాబాయ్... శివప్రసాద్ (ముఖంలో ముఖం పెట్టి ) అందరూ ప్రసాద్ అంటారు ఆయన్ని...
అనంత్ : (ఏడుపు ముఖంతో) అందరూ కలిసి మూకుమ్మడిగా అనక పోతే ప్రసాద్ కాదా ఆయన!?
గుండు : రెచ్చిపోయి చచ్చు జోకువెయ్యకుండా పుచ్చొంకాయలా చచ్చినట్టు విను
అనంత్ : పుచ్చొంకాయలు ఫ్లాష్ బ్యాకులు కూడా వింటాయన్నమాట... సరే చెప్పు
గుండు : ఆ ప్రసాద్‌కి ఒక అమ్మాయి తండ్రి జలంధర్ ఉంగరం పెట్టేసి తన కూతురుకి లొంగిపోయేలా చేశాడు.
అనంత్ : ఉంగరాల్లో అంతశక్తే గనక ఉంటే లాడెన్‌కి తొడిగేస్తే ఈపాటికి అమెరికాకి లొంగిపోతాడుగా...
గుండు : కరక్టే... తొడగడానికి ముందు వాడు దొరకాలిగా...
అనంత్ : ఎన్ని కొత్త కొత్త విషయాలు వింటున్నా గురూ... హుఁ... గురూ ఓ చిన్న సందేహం
గుండు : అడుక్కో
అనంత్ : ఆఁ ! అడుక్కోవాలా!? అడుగూ అనొచ్చుగా
గుండు : హు హు హు హు... ఇలాగే ఓసారి 'అడుగూ' అన్నాను ఓ రాస్కెలు తనింట్లో స్కేలు తీసుకొచ్చి 'ఇదిగో నువ్వడిగిన అడుగు' అని అన్నాడు. అంచేత అప్పట్నించి అలా అనడం మానేశా
అనంత్ : ఆహా ఎన్ని గొప్ప ఫ్లాష్ బ్యాకులున్నాయి తండ్రీ వీడి దగ్గిర...
గుండు : ఇంతేనా ఇంకోటి కూడా ఉంది.
అనంత్ : ఇదే లాస్టా...?
గుండు : అది నువ్వు ఇవాళ లేచిన వేళావిశేషం మీద ఆధారపడి ఉంటుంది.
అనంత్ : కరక్టే... ఇవాళ లేచి ఎవడి ముఖం చూశానో ఏంటో
గుండు : బహుశా అద్దంచూసుకొని ఉంటావు... ముందిది అఘోరించు...



అనంత్ : సరే చెప్పు

గుండు : దసరా బుల్లోడు సినిమాలో పద్మ నాభంని ఓ గాడిదకి ఇచ్చి పెళ్ళిచేస్తారు... ఆ సీను గుర్తుందా...

అనంత్ : ఉంది... ఉంటే...!?

గుండు : నాకెందుకో నిన్ను చూస్తుంటే ఆ సీను గుర్తుకొస్తోంది.

అనంత్ : గురూ... ఇది చాలా అన్యాయం గురూ... ఇప్పటిదాకా నువ్వెన్ని అన్నా ఊరుకొన్నాను. కానీ ఒక గాడిదను పెళ్ళి చేసుకునే అడ్డగాడిదలా కనిపిస్తు న్నానా నేను...? మీ వాళ్ళ పిల్లల్ని చేసుకోలేదని అంత మాటనకు గురూ... ప్లీజ్...

గుండు : పిచ్చివాడా... అంతా నిశ్చయం అయిపోయాక నువ్వెవర్ని చేసుకుంటే నాకేం... మనిషిని చేసుకుంటే నాకేం, గాడిదని చేసుకుంటే నాకేం, కుక్కని చేసుకుంటే నాకేం, పందిని చేసుకుంటే నాకేం... హో హో హో హో ఓ హో హో హో హో

అనంత్ : ఏంటి గురూ ఆ నవ్వేంటి ఏం జరిగింది...?

గుండు : ఏం జరిగిందా... ఇదిగో ఇక్కడ చూడు (శుభలేఖ చూపిస్తూ) పెళ్ళి కూతురు పేరు ముందు ఏం ఉంది...?

అనంత్ : చి॥సౌ॥ అని వుంది

గుండు : అంటే

అనంత్ : అదేంటి గురూ ఆ మాత్రం తెలీదా చి॥సౌ॥ అంటే 'చిరంజీవి సౌభాగ్యవతి' అని

గుండు : అది తెలుసు లేవోయ్... ఇందులో 'సౌ' అన్నది ఎలా ప్రింట్ చేయించావు అని

అనంత్ : యస్ ఓ డబ్ల్యు అని

గుండు : యస్ ఓడబ్ల్యు -సౌ... అంటే ఇంగ్లీషులో ఏంటో తెలుసా

అనంత్ : ఊహు

గుండు : డిక్షనరీ చూడు తెలుస్తుంది.

అనంత్ : ఫర్లేదు చెప్పు గురూ

గుండు : నా నోటితో నేను చెప్పలేను ఇదిగో డిక్షనరీ... తీసి చూడు... తెలుస్తుంది.

అనంత్ : ( డిక్షనరీ తీసి చూసి) యస్...ఓ...డబ్ల్యు... సౌ... అనగా ఆడపంది... ఆఁ !

గుండు : ఓ హో హో హో హో... బలే... భలే పిల్లని చేసుకుంటున్నావు... శభాష్... నాకు చాలా ఆనందంగా ఉంది... హో హో హో

అనంత్ : అయ్య బాబోయ్... ఆ శుభలేఖ ఇటివ్వు గురూ ఇప్పుడే మళ్ళీ ప్రింట్ చేయించాలి (లాక్కొని పారిపోతాడు).

గుండు : పిచ్చివాడు... నాతో పెట్టుకున్నాడు... లేకపోతే మా వాళ్ళ పిల్లల్ని చేసుకోకుండా ఇంకో పిల్లని చేసుకుంటాడా... మళ్ళీ కనబడనీ... మరో డోసిస్తా...

......... కట్..........

పాఠకులకు దృశ్యానుభూతిని కలిగించటంకోసం పాపులర్ ఆర్టిస్టుల పేర్లను వాడుకోవటం జరిగింది. అందుకు వారికి కృతజ్ఞతలు. ఇటువంటి కామెడీ స్కిట్‌లను, కామెడీ ట్రాక్‌లను పాఠకులు కూడా పంపవచ్చు. తగిన పారితోషికం తప్పకుండా ఉంటుంది.

-ఎడిటర్

ఏదైనా ఒక విషయం మీద వ్యాఖ్యానించాలన్నా, యదార్థాన్ని యథాతథంగానే కాకుండా కొండకచో అందంగా కూడా చెప్పాలన్నా కోట శ్రీనివాసరావుని మించిన వారులేరు.



సినిమాల్లో అవసరం ఉన్నా లేక పోయినా సంస్కృతం మాటలు, కొటేషన్లు, ఛందస్సులు ఇరికించెయ్యటం, ప్రాసకోసం నానా పాట్లు పడడం లాంటివి చూసి భవిష్యత్తులో ఇలాటి పాటలు కూడా రావచ్చునంటూ వ్యంగ్యంగా కోట విసిరిన ఓ రెండు చెళుకులివి.

(1) నాపరాతి బండమీద నాతిచరామి
సగంసుఖం సగంసుఖం సదాస్మరామి

(2) నజభజ జజర నా వీపుతోమరా
సభరన మయవ సబ్బుబిళ్ళ ఇవ్వరా

ఇంటర్వ్యూ

# "నాకు అంతటి అదృష్టం కూడా లేదన్న బాధ కలుగుతుంటుంది"

-ఏసుదాస్

కష్టాల గమకాల్లో ఆరోహణలు,
అవరోహణలు చేసిన ఆ కంఠం,
హృదయ స్పందనలతో కలిపి
హృద్యమైన గమకాలుగా
పలికిస్తుంటే -
జనారణ్యంలో ఊపిరి సలపని
మనసు ఏ సాగరతీర సమీపానికో
క్షణంలో చేరి తరగని
సుధామధురిమల్ని ఆస్వాదిస్తుంది.
ఆ కంఠం ఏసుదాసుదేనని
ఆ కంఠంతో పరిచయమున్న
వారెవరైనా ఇట్టే గ్రహించేస్తారు.
ఏసుదాస్ ఇటీవల
హైదరాబాద్ వచ్చిన సందర్భంగా
ఆయనతో
జరిపిన ఇంటర్వ్యూ విశేషాలు:



**మీ కుటుంబ వివరాలు చెబుతారా?**

నాన్నగారు ఆగస్టీన్ జోసెఫ్, అమ్మపేరు ఎలిజబెత్. అయిదుగురు సంతానంలో నేనే పెద్దవాడ్ని. నాన్నగారు మంచి గాయకుడు, నటుడు, భాగవతార్‌గా పేరుతెచ్చుకున్న వ్యక్తి. నా శ్రీమతి పేరు ప్రభా ఏసుదాసు. మా దాంపత్య జీవితానికి ముప్పై ఏళ్లు . ప్రభ సంగీత ప్రపంచంలో నాకు చేదోడు వాదోడుగా ఉంటున్నారు. నాకు ముగ్గురు మగపిల్లలు. వినోద్, విజయ్, విశాల్. రెండోవాడు విజయ్ సంగీతంలో శిక్షణ పొందుతున్నాడు.

**సంగీతంలో మీ బాల్య, యువ్వన దశల అనుభవాలను కొన్నింటిని వివరిస్తారా?**

నన్ను సంగీతంలో ప్రయోజకుడ్ని చేయాలని నాన్నగారు ఎన్నో కలలు

కనేవారు. నాటకాల్లోనూ గాన సభల్లోనూ నేను ఆయనతో కలిసి పాడేవాడ్ని. ఆయనకి నన్ను సంగీత కళాశాలలో చేర్పించాలని కోరిక. ఆర్థిక అవరోధాల్ని అధిగమిస్తూ తిరుణిత్తారయని ఆర్.ఎస్.వి. సంగీత కళాశాలలో చేర్పించారు. కుటుంబ పరిస్థితుల ప్రభావం నా జీవితాన్ని నీడలా వెంటాడ కూడదని నాన్నగారు ఎంతో ప్రయత్నించేవారు. సంగీత శిక్షణలో నా రెండో అధ్యాయం తిరువనంతపురం స్వాతి తిరునాళ్ సంగీత అకాడమిలో ప్రారంభమైంది. ప్రిన్సిపాల్ ప్రఖ్యాత సంగీతజ్ఞుడు శెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్. సంగీతంలో చక్కటి దారి దొరికిపోయిందని సంతోషపడ్డాం. అప్పుడే నాన్నగారు మంచం పట్టారు. నేను శిక్షణ మధ్యలోనే ఆపేసి సొంతఊరికి వెళ్లి ఇల్లు గడవడానికి వేరే పనులు చూసుకోవాల్సి వచ్చింది. మనసు మాత్రం పాట మీదే. సంగీతంలో పలుచోట్ల అవకాశాల గురించి ప్రయత్నించాను. నీ గొంతు పనికిరాదు పొమ్మన్నారు.



**మీ కెరీర్ టర్నింగ్ పాయింట్...**

మద్రాస్ నుంచి లెటర్ రావడమే. నా ప్రాణమిత్రులు మత్తయి గోపాలకృష్ణన్ నా చేతిలో డబ్బులు పెట్టారు. నేను మద్రాస్ రైలెక్కాను. 1961 నవంబర్ 14 తేదీని మద్రాస్, భరణి రికార్డింగ్ థియేటర్.... తొలి పాటకి సంగీత దర్శకత్వం వహించిన ఎం.బి.శ్రీనివాస్ గారు, మళయాళ చిత్ర దర్శకులు కె.ఎస్.ఆంథోనీగారు నన్ను అప్పుడే ఎంకరేజ్ చేశారు. ఆ కాలం మలయాళ సినిమాకి స్వర్ణయుగం, దేవరాజన్ మాస్టారు, దక్షిణామూర్తి స్వామిగారు, అర్జునన్, బాబూరాజ్‌లంటి మహామహులున్న కాలంలో నేను మలయాళ సంగీత రంగంలో అడుగు పెట్టాను. అక్కడ్నుంచే నా జీవితం మలుపు తిరిగింది.

**మీకు గుర్తింపు తెచ్చిన చిత్రాలు?**

మలయాళంలోవా...., తెలుగులోవి చెప్పమంటారా?

**రెండూ చెప్పండి....**

పాలాట్టుకోమన్, కణ్ణుం కరళుం తదితర చిత్రాల ద్వారా మంచి గుర్తింపు వచ్చింది. ఇక తెలుగు విషయానికి వస్తే కోదండపాణి గారు 'బంగారు తిమ్మరాజు' కోసం ట్యూన్ చేసిన 'ఓ నిండు చందమామ', 'మంచికుటుంబం' కోసం చేసిన 'ప్రేమించుట పిల్లల వంతు' పాటలు కొంత గ్యాప్ తర్వాత 'దేవుడు ఇచ్చాడు వీధి ఒకటి...', 'ఓ బాటసారి... ఇది జీవిత రహదారి', 'దారిచూపిన దేవత....', 'గాలివానలో... వాన నీటిలో', 'ఇదేలే తరతరాల చరితం....' 'అందమైన వెన్నెలలోనా....' 'ముద్దబంతి పూవులో మూగబాసలు....' తదితర పాటలు గుర్తింపు తెచ్చిపెట్టాయి. డబ్బింగ్ పాటైనా బాగా గుర్తింపుని తెచ్చిన పాట 'సాగర తీర సమీపాన' ('మేరీమాత ) పాట. ఇక 'మేఘసందేశం' సినిమాలోని పాటలయితే ప్రత్యేకించి చెప్పనక్కర్లేదు. హిందీలో కూడా చాలా పాటలున్నాయండి.

**మీ జీవితంలో మరచిపోలేని ఒక అనుభవాన్ని ఒకదాన్ని వివరిస్తారా?**

నేను దైవ సమానుడిగా భావించే గురుదేవులు చెంబై వైద్యనాథ భాగవతార్ గారితో కలిసి పాడటం, ఆయన చేతుల మీదుగా బంగారు శాలువాను అందుకోవడం మరిచిపోలేని అనుభవం.

**ఇప్పటికీ మీరు సంగీతంలో సాధన చేస్తుంటారు కదా? సుదీర్ఘ సాధన చేయాల్సిన అవసరం ఉందా!**

పక్షులు తెల్లవారుజామునే లేస్తాయి. కిలకిల రావాలతో సంగీత సాధన చేస్తాయి. నేనూ వాటితోబాటే లేవాలి. ఎందుకంటే నేను వాటి స్నేహితుడ్ని. వాటి వినసొంపైన కూతలు నాకు వినిపిస్తాయి. వాటికి జవాబివ్వాలి. నాకు ఆరింథాలజీ తెలీదు. కానీ వాటి భాష తెలుసు. అది సంగీత భాష. వాటి గొంతుకకు బదులిస్తానని ఎదురుచూస్తాయి. వాటికి ఆశాభంగం కలిగించలేను. వాగేశ్వరి నాకిచ్చిన వరం అది. నా అదృష్టం.

**మతపరమైన విషయాల గురించి చెప్తారా....!?**

మీరు ఏమి అడగబోతున్నారో నాకు తెలుసు. గురువాయూర్‌లో స్వామి దర్శన భాగ్యం దొరకకపోవడం నా దురదృష్టం. పూజారి గర్భ గుడి మూసేశాక లోపల బొద్దింకలు తిరుగుతుంటాయి. నాకు అంతటి అదృష్టం కూడా లేదా అని బాధ కలుగుతుంటుంది.

**మీ భవిష్యత్ ఆలోచనలు....**

గొంతు బాగున్నంత కాలం ఇలా పాడుతూనే ఉంటాను. వయసు పైబడుతోంది. కంఠం తొట్రుబాటు పడితే ఎవ్వరైనా పాడటం మానుకోవాలి. వాగేశ్వరిని గౌరవించాలి.

**-ఉండవల్లి పవన్‌కుమార్**




# బుడుగు పుట్టు పూర్వోత్తరాలు

**ముళ్లపూడి వెంకటరమణను మంచి కథా రచయితగా ఎరగనివాళ్లు కూడా 'బుడుగు' సృష్టికర్తగా ఎరుగుదురు. రమణ కల్పించిన పాత్రలు ఎన్నున్నా, వాటిలో అందరి కంటె ఎక్కువ పాప్యులారిటీ సంపాదించినది బుడుగుయే. 'రమణ సాహిత్యం అంతా ఒక ఎత్తు. బుడుగు ఒక్కటి రెండెత్తులు' అన్నారు రమణ బయోగ్రాఫర్ ఎమ్వీయల్.**







తెలుగింట బుడుగు చిరంజీవి. సినీగేయ రచయిత కులశేఖర్ బాలకృష్ణుడిని 'వెన్న బుడుగు' అని వర్ణించారు. కొన్ని తరాలు గడిచాక, కృష్ణుడు బుడుగుగా అవతారం ఎత్తాడని పురాణాలు రాసినా, ప్రజలు నమ్మినా మనం ఆశ్చర్యపడనక్కరలేదు.

బుడుగుకి అనే పేరుకు ఇంత ప్రశస్తి ఎందుకు వచ్చిందని ఒకాయన పరిశోధించి - మూడు ఉకారాలు ఉండటం వల్ల పిలవడానికి సులభంగా ఉందని తేల్చారు. అంతదూరం ఆలోచించి రమణ ఆ పాత్రకు ఆ పేరు పెట్టారా? ఆ విషయం ఆయన్ని అడిగితే నవ్వేసి "నన్ను చిన్నప్పుడు బుడుగు అని పిలిచేవారు. మా అక్కను బుడిగి అని పిలిచేవారు. నా పేరే ఆ పాత్రకు పెట్టేశాను" అన్నారు.

మరి బుడుగు రాయడానికి ఇన్స్పిరేషన్ ఎవరు? అనే ప్రశ్న సహజంగా వస్తుంది. 'డెనిస్ ది మెనేస్'ని తెలుగులోకి దించేశారండి. మీరు గమనించలేదూ? అంటారు ప్రతీ తెలుగు రచనను, రచయితను ఇంగ్లీషువాళ్లతో పోల్చి తృప్తిపడే కొందరు. "1956 నవంబరులో ఆంధ్రపత్రిక మొదటిసారి బుడుగు వెలువడినప్పుడు దాని పేరు ఏమిటో తెలుసా? 'బుడుగు, చిచ్చుల పిడుగు' 'డెనిస్ ది మెనేస్' అన్న పేరుకు దగ్గరగా లేదూ?" అని కూడా అంటారు.

ఒక చిన్న పిల్లవాణ్ని ఆధారంగా చేసుకుని రచన సాగించాలన్న ఐడియా డెనిస్ నుండే వచ్చి వుండవచ్చు కానీ క్రమంగా బుడుగు విస్తృతి డెనిస్ కంటె పెరుగుతూ పోయింది. డెనిస్ పొరుగాయన మిస్టర్ విల్సన్, గర్ల్‌ఫ్రెండు మార్గరెట్, తోడుగా ఉండే జో - పక్కింటి పిన్నిగారి ముగుడు, సీ.గాన పెసూనాంబ, గుండు దీక్షితులుగా తర్జుమా అయ్యారని అనుకున్నా బుడుగు పరివారం ఇంకా పెద్దది. భారతీయ సమిష్టి కుటుంబ వ్యవస్థ తాలూకు లాభాలు బుడుగు పూర్తిగా పొందాడు. కాబట్టే డెనిస్‌కి లేని బొమ్మ, బాబాయి బుడుగుకి ఉన్నారు. బాబాయి ద్వారా రొమాంటిక్ వ్యవహారాలపై బుడుగు అభిప్రాయాలు తెలిశాయి. అలాగే బొమ్మ ద్వారా సంప్రదాయం, సంస్కృతి, దేవుడు, అభిమానం, ఆపేక్ష - ఇలాటి విషయాలపై బుడుగు











వ్యాఖ్యానించగలిగేడు.

డెనిస్ జీవితలక్ష్యం కౌబాయ్ కావడం అయితే, తెలుగు వాతావరణంలో పుట్టిపెరిగిన బుడుగు లక్ష్యం జట్కాతోలడం, ఎింజం డ్రైవరు కావడం, అలాగే అప్పట్లో సాహిత్య రంగాన్ని ఏలుతున్న అపరాధ పరిశోధక నవలల్లోని డిక్టేవాళ్లు, నవ్వే పాపాయిని ఏడవమని బతిమాలే తెలుగు సినిమా రంగంలో ఉండే అసహజత్వం - ఇవేవీ బుడుగు దృష్టిని దాటిపోలేదు. అప్పటి పిల్లల పాలిట గండం అయిన పదమూడో ఎక్కం ప్రస్తావన కూడా ఓ కథలో కనబడుతుంది.

మరి బుడుగు పాత్రకు ఇన్‌స్పిరేషన్ ఎవరు? "నా చిన్నప్పటి జ్ఞాపకాలు, పెద్దయ్యాక అనుభవాలు కలిపితే బుడుగు అయింది. నా బాల్యాన్ని దృష్టిలో ఉంచుకుని భాషతో తమాషాలు చేశాను. నా చిన్నతనం అనుభవాలను గురించి వ్రాయవచ్చని తెలియడానికి నాకు చాలా సంవత్సరాలు పట్టింది. "డెనిస్ ది మెనేస్'' కామిక్స్ కూడా నాకు ఇన్‌స్పిరేషన్ కలిగించాయి. బుడుగు లాటి పిల్లలు కూడా చాలామంది నాకు తెలుసు.'' అన్నారు రమణ ఓ ఇంటర్వ్యూలో. ఆ పిల్లల్లో ఒకరు బాపు మేనల్లుడు, దరిమిలా అల్లుడు అయిన రంగారావు అని నండూరి రామమోహనరావు గారు ఒక ఇంటర్వ్యూలో అన్నారు.

రమణ ఆంధ్రపత్రికలో ఉద్యోగం చేస్తుండగా 'బుడుగు' రచించడం జరిగింది. బళ్లో పడిపోవడానికి అల్లరి మానేయాలని బుడుగు నిశ్చయించుకోవడంతో (ఏప్రిల్ 1957 సంచిక) సీరియల్ ఆపేశాక, నాలుగేళ్లకు 'హురేయ్, మళ్లీ నేనే' అంటూ బుడుగు పునర్దర్శనం ప్రసాదించారు రమణ. ఈ పాటికి బుడుగు తెలివిమీరాడు. 'సీతా లేదు, పీతా లేదు' అంటాడు. సత్యభామ కృష్ణుడికి ప్రైవేటు చెబుతుందని తెలుసుకుంటాడు. అణ్వాస్త్ర భయం గురించి, మేష్టర్ల జీతాల గురించి ముచ్చటిస్తాడు.

కొత్త ఎంకి పాటల్లో ఎంకి 'శ్రీమతి వెంకి' అయిపోయిందని అనేవారు బుడుగుని వేలెత్తి చూపనీయకుండా అంతకు మించి బుడుగును కొనసాగదీయలేదు రమణ. సినిమాల్లోకి వచ్చాక బుడుగుని తెరకు లాక్కొచ్చారు 'అందాల రాముడు'లో. 'బుడుగు' టీవీ సీరియల్‌గా తీద్దామనే ప్రయత్నాలు సాంకేతిక కారణాల వల్ల సాగలేదు.

తమాషా ఏమిటంటే ఇంతటి మహత్తరమైన పాత్రకు ప్రాణం పోసిన రమణ దీన్ని అజ్ఞాతంగా రాశారు. ఆంధ్రపత్రిక వారపత్రికలో 'బుడుగు' సీరియల్‌గా మొదలయిన దగ్గర్నుంచి అమితమైన పాప్యులారిటీ వచ్చింది. అయినా రచయిత పేరు ఎక్కడా కనబడలేదు. రాసిన వారెవరో పాఠకులకు తెలియదు. వారందరికీ ఒకటే ఆరాటం ఎవరా ఇంతటి మహారచయిత అని. చివరికి అందరి బలవంతం వల్ల "ఇది రాసి పెట్టినవాడి పేరు ముళ్లపూడి వెంకటరమణ, బొమ్మలు వేసినవాడి పేరు బాపు'' అని వేశారు. అదీ ఆఖరి సంచికలో! మోడెస్టీకి ఇంతకంటె మంచి ఉదాహరణ దొరికితే కాస్త చెప్పండి. ●



# చెప్పి గెలిచిన

# దూర్వాసుల సూర్యనారాయణ సోమయాజులు

విజయనగరం మహారాజు
శ్రీశ్రీశ్రీ విజయరామ గజపతుల వారికి వీణంటే ప్రాణం!!
యువరాజుగారు శ్రీ ఆనంద గజపతుల వారికి సితార్‌పై మోజు!!
చూడ్డానికి ఒకేలా అనిపించినా... దేనిదారి దానిదే!...
వీణ పదహారణాల దక్షిణాది వాయిద్యం!
సితార్... ఫక్తు హిందుస్తానీ...
వీణకి... పక్కన మృదంగ విన్యాసం వుంటే
సితార్‌కి... తబలా కావాలి!...
అయితే రెండూ అప్ప చెల్లెళ్ళుకావు!... తోడికోడళ్ళు...
రాజావారు కొడుక్కి వీణే నేర్పిద్దామనుకున్నాడు!...
కొడుకు గారు ససేమిరా వొద్దన్నాడని...
'సరే వీణ-సితార్‌కంటే గొప్పది అని ఋజువు చేస్తే ఒప్పుకుంటావా?'... తండ్రిగారు...
'సితారే వీణ కన్నా గొప్పదీ అని ఋజువైతే!?'
కొడుకు ఎదురు ప్రశ్న!
'ఇంతెందుకూ!... పోటీపెడదాం!!'
ఎవరక్కడ!!
చప్పట్లు...
సంగీత దర్బార్ తయారైంది.
రెండు వేడుకలు సిద్ధం!
ఒకటి హిందుస్తానీ!
రెండోది... కర్ణాటకం...
ఓవైపు అత్తరు పరిమళాలు...
మరోవైపు అగరు పొగలు...
ఓ వేపు మల్లెల దండలు
మరోవేపు గులాబీల గుత్తులు...
ఒకదిక్కు.... మఖ్మల్ తక్త్‌లు...
మరోదిక్కు పట్టు బాలీసులు...
బనారసీ పాన్-జర్దా ఘుమాయింపు వొక చోటనించి.
లేత తమల పాకుల విడియముల పరిమళములొక చోటనుంచీ...
హిందుస్థానీ సంగీత విద్వాంసుడు...
మహబ్బత్ ఖాన్ ఓవైపు...!
కర్ణాటక సంగీత నిధి

### దూర్వాసుల సోమయాజులుగారొకవైపు!...

సితార్ ఆరంభమయింది!... ఉత్తరాది స్వర గంగ ఉప్పొంగి సుడులు తిరిగి పాయలు పాయలుగా విడిపోయి... హొయలు పోయి... శ్రోతల నరాల మీద నాట్యంచేసి... సలామ్ చేసింది!!
శబ్బాష్‌లు... వహ్వాలు...
దద్దరిల్లిపోయింది సభ...
ఇక దూర్వాసుల సోమయాజులవారు... వీణాపాణికి మనసులోనే దణ్ణమెట్టుకుని మీటాడు వీణ... గోదావరి నది పరవళ్ళు తొక్కడం మొదలెట్టింది... బొట్టుపెట్టినట్టు... బొట్టు బొట్టుగానే మొదలై...
చిన్నపిల్ల రెండు జెళ్ళై... కన్నెపిల్ల వాలుజడై...
పుష్కరాల రేవుల మునకేస్తున్న ప్రౌఢ.... విడిపోయిన జడలా....
పాయలు పాయలై... చివరికి ధూర్జటి జటల్లే... విస్తరించీ!.... శ్రోతల్ని ఆనందాంబుధిలో ముంచి ఉక్కిరిబిక్కిరి చేసింది!!
చప్పట్లులేవు... నిశ్శబ్దం తప్ప....
అవాక్కయిపోయింది సభ....
ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తప్ప .... మరో శబ్దం లేదు!!
'వీణమీద పలికించినవి.... సితారుమీద పలికించడం నావల్ల కాలేదు...' అని ఓటమిని సవినయంగా ఒప్పుకున్నాడు మహబ్బత్ ఖాన్!... అప్పుడు అదిరింది సభ చప్పట్లతో!!
ఆనందగజపతి ఆనందంగా వీణ పట్టాడు...
విజయరామ గజపతి పరమానందంగా... దూర్వాసులవారి పాదాలు పట్టాడు!!
అప్పట్నించీ... దూర్వాసులవారు... గజపతులకు 'రాజగురువు'
అయితే సోమయాజులవారు కేవలం కర్ణాటక సంగీతానికే పరిమితం కాకుండా!... కాశి... కలకత్తా వంటి ప్రాంతాలకు వెళ్ళి... హిందుస్తానీ సంగీతాన్నిగూడా... ఆపోశనపట్టారు...
అయితే సోమయాజులు గారికి సంగీతం నేర్పిన గురువు సాక్షాత్తూ ఆయన తాతగారే

-విజయ నగర ప్రభువుల వీర చరిత్రను గేయరూపంలో రచించి... 72 మేళకర్త రాగాలలోనూ స్వరపరిచిన ఘనులు సోమయాజులుగారు.

**ముఖారి రాగంలో... 'ఇటు చూడరా'**

**కాంభోజి రాగంలో... 'ఎందుకే తొందరా'**

**మోహన రాగంలో... 'నెరనమ్మినాను' అనే శృంగార కీర్తనలను**

**ఆనంద గజపతులవారి మీద రాసి... అంకితమిచ్చారు...!**

అన్నట్టు విశేషమైన విషయం ఏమిటంటే మనం సంగీత త్రయంగా పూజించే త్యాగరాజస్వామి, ముత్తుస్వామి దీక్షితార్, శ్యామశాస్త్రి రచనలని ఆరంభంలో ఆంధ్రదేశం అంతటా విస్తృతంగా ప్రచారం చేసిన ఘనత దూర్వాసుల వారిదే!!

అలాగే... 1831లో మద్రాసులో... మైసూరు... పుదుక్కోటలాంటి ఏడు సంస్థానాల... సంగీత విద్వాంసులకి పోటీ జరిగింది మైసూరులాంటి పెద్ద సంస్థానాల మొదట్లో పెట్టీ...

విజయ నగరం వంటి చిన్న సంస్థానాలకి చివరికి అవకాశం ఉండేలా చేసారు!...

ఈ సంగతి తెలిసి ఆనంద గజపతులవారు చిన్నబుచ్చుకున్నారు.

అప్పుడు సోమయాజులవారు మందహాసం చేస్తూ... ఎక్కడుంటే నేవిటండీ జరిగేది పోటీ.. గెలవడం లెక్క అంటూ హామీ ఇచ్చారు!...

చివరిగా దూర్వాసుల సోమయాజులవారి వంతొచ్చింది!!

కళ్యాణి, వసంతరాగాలలో పాటలు ఇతర సంగీత సంప్రదాయాలన్నీ మేళవించీ... వీణావాదన మొదలెట్టారు...

అందులో కర్ణాటక మాధుర్యముంది...

హిందుస్థానీ మజా ఉంది...

అంతేకాదు... పాశ్చాత్యుల కిక్కు కూడా ఉంది...

అందువల్లే

పోటీలో పాల్గొనే సమయం ఇరవై నిముషాలే అయినా...

సుమారు గంటన్నరపైగా వాయించినా... ఎవరూ కిక్కురు?

మనలేదు సరిగదా!...

పోటీ చూట్టానికొచ్చిన... దొరలూ... దొరసానులూ... సోమయాజులుగారు వాయించిన పాశ్చాత్య సంప్రదాయరీతికి డాన్స్ చెయ్యడం మొదలెట్టారు!!

...పోటీ ముగిసింది!...

దూర్వాసుల వెంకట సోమయాజులు గారిది ప్రథమ బహుమతి!!

ఆనందగజపతి మహారాజువారు... గుండెల్నిండా ఊపిరి పీల్చి సొగసుగా మీసం మెలేసారు!!

ఆ సందర్భంలో వైస్రాయ్ ఎల్జిన్ ప్రభు విచ్చిన సర్టిఫికెట్ ఇప్పటికీ సోమయాజులగారి మనుమరాలి ఇంట్లో భద్రంగా ఉంది!!.

**దూర్వాసుల సూర్యనారాయణ సోమయాజులు**

**(1842-1896)**

**ఫోటో అలభ్యం ఆయన ఆత్మకి నా నమస్కారం**

(డాక్టర్ సి. విజయలక్ష్మి గారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు సంగీత వాఙ్మయం' చదివి స్పందించి)

- భరణి



**తనికెళ్ళ భరణి**

అలా చాలాకాలం పాటు... తన సంగీతంతో విజయనగర సంస్థానాన్ని చిరస్మరణీయం చేసిన...

సంగీత భాస్కరుడు...

అస్తమించే వేళ ఆసన్నమయింది!!

తంత్రులు సడలిన వీణలా ఉన్న ఆయన వొంటిమీద చెయ్యేసి కళ్ళనీళ్ళ పర్యంతమయ్యారు ఆనందగజపతి.

దూర్వాసుల సోమయాజులుగారు మాత్రం...

నిశ్చలంగా నిర్మలంగా ఉన్నారు... పెదాలమీద చిరునవ్వు ఇంకా చెదరలేదు.

మెల్లి... మెల్లిగా... కళ్ళలోని కాంతి... పైకి ప్రయాణమయ్యింది!!

ఆనంద గజపతుల అశ్రుబిందువులు... ఆయన పాదాలపై పడ్డాయ్!!

ఆయన నిర్యాణం గురించి... దూర్వాసుల శ్రీరామ శాస్త్రిగారు ఒక పద్యం రాశారు...

**"వీణయుం చేతబూని కడువిస్మయ ముప్పతిలంగ భైరవిన్**

**తానము మేళవించి యమృతంబును జిల్కెడు మిమ్ము జూచుచున్**

**గాణలు, హూణులొక్కగతిగ నుతి చేసిరి గాని యంతలో**

**వీనుల పుణ్యమీ కరణి వీడెను గానము విస్తరించగా..."**

☆

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి నేరుగా తెలియజేయదలచుకునే వారు

**తణికెళ్ళ భరణి**

C/o **"హాసం"**

**502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్**

**హైదరాబాదు-500 018**

అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.








# ప్రేమికుల రోజున



# పెళ్లి



ప్రఖ్యాత పాప్‌గాయని బ్రిట్నీ స్పియర్స్, పాప్‌గాయకుడు జస్టిన్ టింబర్లేక్ వచ్చే సంవత్సరం.ఫిబ్రవరి 14న వివాహం చేసుకోబోతున్నారు. ( ఫిబ్రవరి 14 వేలం టేన్ డే అని వేరే రాయనవసరం లేదు. ప్రచార మాధ్యమాల పుణ్యమాని పసిపాప నుండి పండు వృద్ధుడి దాకా ఇప్పుడా తారీఖు అందరికీ గుర్తే!) గత పక్షం డిసెంబరు 2కి 20 సంవత్సరాలు పూర్తిచేసుకున్న బ్రిట్నీ తన పుట్టినరోజు సందర్భంగా ఈ విషయాన్ని ప్రకటించింది.

బ్రిట్నీ-జస్టిన్ ప్రణయం ఇప్పటిది కాదు. సినిమాలో చూపించినట్లు చిన్నప్పుడే ప్రారంభమయింది. 1993లో మిక్కీ మౌస్ అనే అమెరికన్ టెలివిజన్ షో క్లబ్‌లో గాయనిగా చేరేటప్పటికి బ్రిట్నీ వయస్సు 11. (అంతకు ముందే చేరదామనుకొంటే మరీ చిన్నదానివి అని తిరస్కరించారు వాళ్ళు) అక్కడ అప్పటికే సభ్యుడిగా చేరిన జస్టిన్ వయస్సు 12 . ఈ ఇద్దరి మధ్య స్నేహం పెరిగింది. మరో ముగ్గురి (ఇప్పుడు బ్రిట్నీకి ప్రత్యర్థిగా ఎదిగిన గాయని క్రిస్టినా ఆగ్యులేరా వారిలో ఒకరు)తో కలిసి 'ఎన్‌సింక్' అనే బ్యాండ్‌గా ఏర్పడ్డారు.

బ్రిట్నీను పతాక శీర్షికలకు ఎక్కించిన మొదటి పాప్ ఆల్బమ్ 'బేబీ ఒన్‌మోర్ టైమ్' వెనుక జస్టిన్ స్నేహ హస్తం ఉంది. 1998లో తయారయిన ఈ ఆల్బమ్‌ను ప్రమోట్ చేయడానికి బ్రిట్నీ ఇచ్చిన ప్రదర్శనలకు జస్టిన్ ఎంతో తోడ్పడ్డాడు. ఆ ఏడాది అక్టోబరులో దాని టైటిల్ ట్రాక్ విడుదల చేసినప్పుడు అది 'ఇన్‌స్టంట్ హిట్' అయింది.





ఆ సింగిల్ సక్సెస్ కావడంతో ఉత్సాహం పుంజుకుని 'బేబీ ఒన్ మోర్ టైమ్' ఫుల్ ఆల్బమ్ మూడు నెలల్లోనే విడుదల చేసింది. అది నెంబర్ వన్ స్థానాన్ని చేరుకోవడంతో చూస్తుండగానే బ్రిట్నీ ఓ సెన్సేషన్ అయిపోయింది. ఆ ఏడాది అత్యధికంగా అమ్ముడు పోయిన ఆల్బమ్స్‌లో అది ఒకటి కావడంతో గ్రామీ వారి 'బెస్ట్ ఆర్టిస్ట్' అవార్డుకు బ్రిట్నీను నామినేట్ చేయడం జరిగింది. కానీ ఆఖరిక్షణంలో ఆమె ఫ్రెండూ, ప్రత్యర్థి అయిన క్రిస్టినా దాన్ని కైవసం చేసుకుంది.

తనను 'ఒన్-ఆల్బమ్ వండర్' అనుకోకూడదన్న పట్టుదలతో బ్రిట్నీ మరింత శ్రమించి 'ఊప్స్... ఐడిడిట్ ఎగైన్!" అనే ఆల్బమ్ తయారుచేసి మే 2000లో విడుదల చేసింది. అది రిలీజైన మొదటి వారంలో పదమూడు లక్షల కాపీలు అమ్ముడు పోయి చరిత్ర సృష్టించింది. ఒక గాయని సోలో ఆల్బమ్ మొదటి వారం అమ్మకాల రికార్డు విషయంలో ప్రథమస్థానంలో ఉన్న మేరియా క్యారీనీ ఆ స్థానం నుండి తప్పించింది ఈ ఆల్బమ్!

ఆ విధంగా మేరియా క్యారీపై విజయం సాధించినా ఆమె తన ఆరాధ్య దేవత అంటుంది బ్రిట్నీ. ఆమెతో బాటు విట్నీ హూస్టన్, మైకేల్ జాక్సన్, మెడోనాలంటే పడిఛస్తుందామె. మెడోనాకు కూడా బ్రిట్నీ అంటే చాలా అభిమానం, వాత్సల్యం. బ్రిట్నీ బొమ్మవున్న టీషర్టులు వేసుకుని తిరిగేది మెడోనా. అంతే కాదు 'ఇద్దరం కలిసి ఓ ఆల్బమ్ చేద్దాం' అనేది కూడా!

అంత అభిమానంగా ఉండే మెడోనా -'బ్రిట్నీకి, నాకూ మధ్య ఏ స్నేహ బాంధవ్యాలు 'లేవు' అంటూ స్టేట్‌మెంట్ ఇచ్చిందీమధ్య! దీనికి కారణం బ్రిట్నీ చేసిన ఓ తెలివి తక్కువ ప్రతిపాదన! ఆమె వద్దకు 'మదర్స్ డాటర్' అనే ఓ సినిమా స్క్రిప్టువచ్చింది. కూతుర్ని ఎలాగైనా సినిమాతార చేయాలని ప్రయత్నించే ఆశపోతు ఆల్కహాలిక్ తల్లి ఆ కథకు కేంద్ర బిందువు. ఆ పాత్ర వేయాలనీ మెడోనాను కోరింది బ్రిట్నీ. మెడోనా ఒప్పుకోలేదు. కానీ 'మెడోనా ఆ పాత్ర వేయడానికే పుట్టిందంటూ' బ్రిట్నీ ఓ స్టేటుమెంటు ఇవ్వడంతో మెడోనా మండి పడింది. దాని పర్యవసానమే మెడోనా స్టేట్‌మెంట్!

జస్టిన్ మాటకొస్తే అతను బ్రిట్నీ ప్రయత్నాలకు ఎప్పుడూ చేయూతనిస్తూ ఉన్నాడు. ఇద్దరికీ దాన ధర్మాలు చేసే సుగుణం ఉంది. ఇద్దరి పేరా విడివిడిగా చారిటీ ఫౌండేషన్లు ఉన్నాయి. ఆ సంస్థలు రెండూ కలిసి 'మేథ్ మాస్టరీ డాట్ కామ్' ద్వారా పిల్లలకు గణితం బోధించే కార్యక్రమాలకు విరాళాలు ఇస్తున్నాయి. అంతే కాకుండా Math-n-Music club ద్వారా స్కూళ్ళలో సంగీతం నేర్పించేందుకు నిధులు సమకూరుస్తున్నారు. పెప్సి కంపెనీతో అగ్రిమెంటు ద్వారా సంపాదించిన అపార నిధులను కూడా బ్రిట్నీ ఈ కార్యక్రమాలకు వెచ్చిస్తోంది.

చిన్నప్పటి నుండీ ఒకరి నొకరు బాగా తెలిసి ఉండడం, విజయాలలో పాలుపంచుకోవడం, ఇద్దరి వృత్తీ ఒకటే కావడం, ఇద్దరికీ దానగుణం, సాంఘిక కార్యకలాపాలలో ఆసక్తి ఉండడం - ఇన్ని కారణాల వల్ల బ్రిట్నీ తన జీవిత భాగస్వామిగా జస్టిన్‌ను ఎంచుకుంది. ఆగస్టులో ఎంగేజ్‌మెంటు జరిగింది. ఇప్పుడు వేలంటైన్ డే నాడు పెళ్ళి జరగబోతోందంటోంది.

-కమ్యూనికేటర్ ఫీచర్స్



# భార్యాభర్తల స్పెషల్



వేలం వేసేవాడు తన అసిస్టెంటును పిలిచాడు -
'ఇప్పుడు పాత మంచం కొనుక్కున్న ఆవిడ
సంతకం పెట్టకుండా పోయింది. మళ్లీ పిలవాలి.
ఆవిడ్ని గుర్తుపట్టగలవా?"
"ఆవిడ్ని గుర్తుపట్టడం కష్టం గానీ, వాళ్లాయన్ని
గుర్తుపట్టవచ్చండి. ఈవిడ వేలం పాడుతున్నంత
సేపూ ఆయన నోరు నొక్కుకుంటూనే ఉన్నాడు.
బహుశా ఆ చెయ్యి ఇంకా తీసివుండడు."



బతికున్నంత కాలం భర్తను తిట్టి, కొట్టి వేధించిన
భార్య ఆఖరికి చచ్చిపోయింది.
స్మశానాన్నుండి ఆనందంగా తిరిగివచ్చిన
భర్త ఇంటి తలుపు తీస్తూండగా గాలి గట్టిగా వీచి
పైనున్న పెంకు అతని నెత్తి మీద పడింది.
"హు, పైలోకానికి వెళ్లిందో లేదో, అప్పుడే
ప్రారంభించిందన్నమాట!" అంటూ
వాపోయాడతను.

యువతీయువకులు భార్యాభర్తలు కాకముందు
మాట్లాడుకునేవి స్వీట్ నథింగ్స్
తర్వాత నథింగ్ స్వీట్!






"నేనేం మంచి పని
చేసినా మీరు
గుర్తించరు. మీ
ప్యాంటు జేబులో
చిల్లుంటే రాత్రికి రాత్రే
కుట్టిపెట్టాను. కనీసం
థ్యాంక్సయినా
అయినా చెప్పలేదు." వాపోయింది
భార్య. 'థ్యాంక్స్ మాట తర్వాత గానీ జేబుకు
చిల్లున్నట్టు నీకెలా తెలిసిందో అది చెప్పు ముందు."



ఈవెనింగు పార్టీ
జరుగుతోంది.
అతిథులలో
ఒకామె పార్టీ
ఇచ్చినావిడ వద్దకు
వచ్చింది.
"ఇందాకా ఓ
అందమైన
అమ్మాయి
కూల్‌డ్రింక్స్ ఇస్తూ కనబడింది.
ఆ అమ్మాయి ఎక్కడ?"
"ఏం? మీకు కూల్‌డ్రింక్స్ కావాలా?"
"అబ్బే, మా ఆయన కావాలి."



భార్యాభర్తల మధ్య మూడురోజులుగా మాటలు
లేవు. చివరికి భర్త దిగివచ్చి భార్యను "చూడు శశీ,
మన ఆర్గుమెంట్స్ గురించి నేను తీవ్రంగా
ఆలోచించాను." అన్నాడు
"ఓహో" అంది భార్య. చదువుతున్న పుస్తకం
లోంచి తలెత్తకుండా.
భర్త ఊపిరి బిగబట్టాడు.
"ఆలోచించాక నువ్వు చెప్పినదే సబబనిపించింది.
అలాగే చేద్దాం." అన్నాడు ఓటమి నంగీకరిస్తూ.
భార్య మూతి విరిచింది. "ఏం లాభం లేదు...
ఇవాళే నా ఉద్దేశ్యం మార్చుకున్నాను."



"మీ ఆవిడతో పోట్లాట పడినట్టుగా ఉంది.
చివరికి ఏమయిందేమిటి?" ఇంటి పక్కాయన
అడిగేడు మర్నాడు పొద్దున్న.
"ఏమవుతుంది? చివరికి ఆవిడ మోకాళ్ల మీద
పాక్కుంటూ నా దగ్గరికి వచ్చింది."
"అబ్బో, యూ ఆర్ గ్రేట్! వచ్చి ఏమంది?"
"ఏమంటుంది? మంచం కిందనుండి బయటకు
రారా పిరికిపందా అంది."

పెళ్లిచేసుకుని తీరాలి. భార్య మంచిదయితే
సుఖం, లేకపోతే వేదాంతం దక్కుతాయి
-సోక్రటీసు



# భార్యాభర్తల స్పెషల్



"ఈ చీర ఎందుకు కొన్నావ్?"

"ఊరికే ఇవ్వరు కాబట్టి".






"ఎక్స్క్యూజ్‌మీ, మా ఆయన సమాధి ఎక్కడుందో కనిపించట్లేదు. కానీ ఖచ్చితంగా ఇక్కడే ఉండాలి " అడిగింది లలితా ప్రసాద్.

"మీ ఆయన పేరేమిటి?" అడిగాడు మేనేజర్.

"శివప్రసాద్ అండి"

"ఊ౯... ఈ లిస్టులో శివప్రసాద్ అనిలేదు కానీ లలితాప్రసాద్ అని ఉంది".

"అయితే అది ఆయనదే. ఆయనవన్నీ నా పేరు మీదే ఉంటాయిగా"



"మమ్మీ.... మమ్మీ మెదడు పని చెయ్యకుండా ఎంతకాలం బ్రతకొచ్చు?"

"సుమారు నలభై అయిదేళ్ళని ఇప్పటిదాకా తేలింది"..

'అంత ఖచ్చితంగా ఎలా చెప్తున్నావు"

"మీ నాన్నకి ఇప్పుడు నలభై అయిదేళ్ళుగా ".



"మా టామీ తాగడానికి ప్యూర్ వాటర్ బాటిల్ ఒకటి యివ్వండి"...

"అలాగే మేడమ్.... ఆ బాటిల్ మీద కుక్కలకు మాత్రమే అన్న లేబుల్ అంటించమంటారా?"

"ఏం వద్దు. ఇంత ఖరీదు పెట్టి కొంటున్న నీళ్ళు మా ఆయనకు అందనిస్తానా".



"మీకు గుర్తుందా.... సరిగ్గా పాతికేళ్ళ క్రితం ఇదే రోజున మా నాన్నకి మనం రెడ్ హ్యాండెడ్‌గా దొరికిపోయాం

మా నాన్న తన పోలీసు దర్జాఅంతా చూపిస్తూ నా మీద ఆశ వదులుకోకపోతే మర్డర్ కేసులో ఇరికించి మీకు యావజ్జీవకారాగార శిక్ష వేయిస్తానన్నాడు"

"గుర్తుంది"

"మీరు ఆయన్ని లెక్క చెయ్యలేదు. ధైర్యంగా బైటికొచ్చి పెళ్ళి చేసుకున్నాం. ఆ రోజు మీరు గనక బెదిరిపోయి ఉంటే ఇవాళ మనిద్దరం ఎక్కడుండే వాళ్ళమో!?"

"నువ్వు ఎక్కడుండే దానివో గానీ నేను మాత్రం ఈ పాటికి విడుదలయి ఉండే వాడిని".



"ఏవండీ... నేనూ మీతో బొంబాయి వస్తానండీ"

"నాకు అస్సలు టైమ్ ఉండదు. చాలా బిజీ షెడ్యూల్. నా కాన్ఫరెన్స్ అయిపోగానే వచ్చేస్తాగా. నువ్వు నాతో వచ్చి ఏమీ ఎన్‌జాయ్ చెయ్యలేవు"

"అక్కడ ఎంచక్కా బట్టలు కొనుక్కుంటా"

"ఏంటీ బట్టలు కొనడానికి బొంబాయిదాకా వస్తావా.... ఎందుకూ ... ఇక్కడే కొనుక్కోవచ్చుగా".

"ఆహా... ఈ మాటకోసమే ఎదురు చూస్తున్నా... వెంటనే తియ్యండో పది వేలు".



"పాపం.... మీ ఆవిడకి దగ్గు ఎక్కువగా వున్నట్టుంది. దారి పొడుగునా దగ్గుతూనే వుంది"

"అదేం లేదురా... ఆవిడ కొత్త చీరకట్టుకుందిలే.... అదీ అసలు విషయం".






చిత్రం - కభీ ఖుషీ కభీ గమ్
గీతం - సమీర్
సంగీతం - జతిన్-లలిత్, సందేశ్ శాండిల్య, ఆదేశ్ శ్రీవాస్తవ
పాడినది - లత, సోనూనిగమ్
అభినయం - అమితాబ్ బచ్చన్, జయా బచ్చన్, షారుఖ్ ఖాన్, కాజోల్, హృతిక్ రోషన్, కరీనా కపూర్

# కభీ ఖుషీ కభీ గమ్

డిసెంబరు 14 న రిలీజయిన 'కభీ ఖుషీ కభీ గమ్' చిత్రం ఆడియో మార్కెటులోకి ముందే వచ్చి సంచలాన్ని సృష్టించింది. మూడు నెలల క్రితమే టైటిలుసాంగు మూడు వెర్షన్లు (సంతోషం, విషాదం, వాయిద్యం) కలిపి ఒక సింగిల్ ట్రాక్‌గా రిలీజు చేసి హిట్ చేశారు. సినిమాను 'తల్లిదండ్రుల గురించిన ఓ సినిమా'గా వర్ణించాడు డైరక్టరు కరణ్ జోహార్. ఉమ్మడి కుటుంబాల గురించిన కథలు మనకు కొత్త కాదు గానీ ఇంత భారీ తారాగణంతో నిర్మించిన చిత్రం కాబట్టి కొత్తరకంగా అనిపించవచ్చు.

ఈ సినిమాలో అమితాబ్, జయ 17 సంవత్సరాల తర్వాత కలిసి నటించారు. షారుఖ్, కాజోల్ జంటగా నాలుగు హిట్స్ ఇచ్చిన తర్వాత చాలా కాలానికి కలుస్తున్నారు. హృతిక్, కరీనా గురించి చెప్పనే అక్కరలేదు. నేటితరానికి ఆరాధ్యదేవతలు వాళ్లు. మరి ఇంతమంది స్టార్లకు చోటున్న కథ ఉందా అని అనుమానం వచ్చేవారికోసం - క్లుప్తంగా కథ- అమితాబ్, జయ తమ పిల్లలైన షారుఖ్, హృతిక్‌లను ప్రేమగా సాకుతారు. అమితాబ్ వాళ్లను ప్రేమగా చూస్తూనే వారికి జీవిత విలువలు, ఆదర్శాలు, సభ్యత, సంస్కృతి మప్పుతాడు. జయకు మాత్రం షారుఖ్ అంటే ప్రత్యేకమైన ప్రేమ. పిల్లలు లేక బాధపడుతూండే రోజుల్లో అతన్ని దత్తత తెచ్చుకుందామె. తన జీవితంలో నవ్వుల్ని నింపాడన్న అభిమానం ఆమెది. దత్తత విషయం రహస్యంగా ఉంచాలనుకున్నా షారుఖ్‌కి ఎనిమిదవ యేటే తెలిసిపోయిందా విషయం. అది విన్న దగ్గర్నుంచీ తల్లి మీద మరింత ప్రేమ పెంచుకుంటాడతను. ఆమె మాట జవదాటకుండా ఉంటాడు - ప్రేమలో పడేవరకు.

షారుఖ్ ప్రేమించిన కాజోల్‌కి ఓ చెల్లెలు (కరీనా), జబ్బుతో ఉన్న తండ్రి ఉన్నారు. షారుఖ్ ఆమెను పెండ్లాడి ఇంటికి తీసుకువస్తే అమితాబ్ సహించడు. షారూఖ్ ఇల్లు విడిచి వెళ్లిపోతాడు. జయ కుమిలిపోతుంది. తల్లి బాధ చూడలేక హృతిక్ రోషన్ నడుం కట్టి అతన్ని ఇంటికి తిరిగి తీసుకురావడమే సినిమాకు ఆయువుపట్టు. ఇలాటి కథల్లో అందరూ కలిసి ముందో పాట సంతోషంగా పాడుకుని, విడిపోయినప్పుడు అదేపాటను విషాదంగా పాడుకుని మళ్లీ కలిసినపుడు ఇంకోసారి సరదాగా పాడుకోవడమనే ఆనవాయితీ ముందునుండీ ఉందిగా. ఆ ఒరవడిలోనే ఈ టైటిలు సాంగూ సాగుతుంది. ముందున్నది హ్యాపీ వెర్షన్. రెండోది సాడ్ వెర్షన్.







## పాట

కభీ ఖుషీ కభీ గమ్
న జుదా హోంగే హమ్
కభీ ఖుషీ కభీ గమ్
కభీ ఖుషీ కభీ గమ్
న జుదా హోంగే హమ్
మేరీ సాసోంమే తూ హై సమాయా
మేరా జీవన్ తో హై తేరా సాయా
తేరీ పూజా కరూఁ మై తో హర్‌దమ్
యే హై తేరే కరమ్ ॥కభీ॥
సుబహ్ శ్యామ్ చర్‌ణోం మే దియే హమ్ జలాయే
దేఖే యహాఁ భీ దేఖే తుర్‌ఝుకో హీ పాయే
ఇన్ లబోంపే తేరా బస్ తేరా నామ్ హో
ప్యార్ దిల్ సే కభీ హీ న హో కమ్ ॥యే హై॥

యే ఘర్ నహీ హై మందిర్ హై తేరా
ఇస్ మే సదా రహో తేరా బసేరా
ఖుష్‌బూ సే తేరీ యే మహక్‌తా రహే
ఆయే జాయే భలే హీ కోఈ మౌసమ్ ॥కభీ॥

## విషాదం

క్యా బేబసీ హై యే క్యా మజ్‌బూరియాఁ
హమ్ పాస్ హై ఫిర్ భీ కిత్‌నీ హై దూరియాఁ
జిస్మ్ తూ జాన్ మై తేరీ పెహచాన్ మై
మిల్‌కే భీ న మిలే యే హై కైసా భరమ్
యే హై తేరా కరమ్ ॥కభీ॥

## స్వేచ్ఛానువాదం

ఆనందమొకసారి, విషాదమొకసారి
అయినా ఎడబాటు లేదు మాకెప్పటికీ
ఊపిరంతా నువ్వే ఆవరించావ్
నా ఉనికే నీ నీడగా చేసావ్
గడుస్తుంది ప్రతిక్షణం
నీ పూజలోనే ఎప్పటికి
దివ్వె వెలిగించాం నీ దివ్యచరణాలకు
ప్రతి ఉదయం, ప్రతి సాయంత్రం
అటు చూసినా, ఇటు చూసినా
ఎటువెళ్లినా అన్నిటా నువ్వే
పెదాలపై నీ పేరే నిలవనీ
మదిలో నీపై భక్తి తరగనీయకుమీ
ఇల్లు కాదిది.... నీ ఆలయం
ఇకపై చేసుకో నీ ఆవాసం
ఋతువులెన్ని వచ్చినా
నీ ఆశీస్సుల సుగంధంతో
ఈ మందిరం గుబాళించనీ

## విషాదం

చేతకాని వారం, నిస్సహాయులం
చెంతనే ఉన్నా ఎంతో దూరం
దేహం నీది ఆత్మ నాది
కలిసే ఉన్నా కలవకనే ఉన్నాం
ఎవరికి తెలుసు ఈ గందరగోళం

ఈ పాటలలో వచ్చే మాటలకు అర్థాలు - గ(గ కాస్త వేరేలా పలకాలి)మ్ అంటే దుఖం, బాధ. జుదా అంటే విడిపోవడం, సాస్ అంటే శ్వాస. సమాయా అంటే నిండిపోవడం, చొచ్చుకుపోవడం. సాయా అంటే నీడ. (ఛాయ లోంచి వచ్చిందే). హర్‌దమ్ అంటే ప్రతీ క్షణం అని. దమ్ అంటే ఊపిరి (దమ్ము) తీసుకునేటంత సమయం అని. ప్రతీ అనడానికి హర్ అంటారు. కరమ్ కర్మకు వికృతి. కర్మను మనం మన మీద వచ్చిపడేదానిగా అనుకున్నా హిందీపాటల్లో అలా అనుకోరు. చేసే పని అనే అర్థంలోనే వాడతారు. దియా అంటే దీపం. లబ్ అంటే పెదవి. సదా అంటే ఎప్పుడూ. మన తెలుగు అర్థమే. 'సదా'లో ఓ చిన్న తమాషా ఉంది. హిందీ అర్థంలో అయితే మన తెలుగులోలాగానే ఎల్లప్పుడూ అని. ఉర్దూ అర్థంలో అయితే పిలుపు అని.

'మధుమతి' సినిమాలోని 'దిల్ తడప్ తడప్ కే' పాటలో ఈ మాటను ఈ రెండు అర్థాలలోనూ వాడాడు కవి. దే రహా హై యే సదా (పిలుపు), తుమ్హారీ రహూంగీ సదా(ఎప్పుడూ) గమనించారా? బసేరా అంటే ఉండే (వసించే) చోటు. తలదాచుకునే చోటు. మన బస దాన్నుండే వచ్చింది కాబోలు. ఖుష్‌బూ అంటే సువాసన. బూ అంటే వాసన. ఖుష్ చేర్చారు కాబట్టి సువాసన. దుర్వాసన అయితే బద్‌బూ అంటారు. అలాగే ఖూబ్‌సూరత్, బద్ సూరత్.. మొహక్ అంటే గుబాళింపు. మౌసమ్ అంటే ఋతువు. దీన్నే మౌసిమ్ అని కూడా అనవచ్చు. కానీ సాధారణంగా మౌసమ్ అనే అంటారు.

బేబసీ అంటే నిస్సహాయత మజబూరీ అన్నా అదే అర్థం. బస్ అంటే వశం. హిందీ పదాలు పొల్లుతో ముగుస్తాయి. కాబట్టి వశం వస్ అయింది. హిందీలో చాలా చోట్ల 'వ' కు'బ' అభేదం ఉంది కాబట్టి వశ్, బశ్, లేదా బస్ అయింది. వో మేరే బస్ మే నహీఁ -అది నా చేతిలో లేదు, నేనేమీ చేయలేను అన్న అర్థంలో వాడతారు. బే చేరిస్తే వ్యతిరేకార్థం కాబట్టి బేబస్ అంటే చేతకానివాడు అని, బేబసీ అంటే చేతకానితనం, నిస్సహాయత అని అర్థాలు వచ్చాయి. ఇది హిందీ పదమయితే మజబూర్ ఇదే అర్థం ఇచ్చే ఉర్దూపదం. జిస్మ్ అంటే శరీరం. జాన్ అంటే ప్రాణం. భ్రమకు అపభ్రంశరూపం భరమ్. పాటల్లో గందరగోళం, కన్‌ఫ్యూజన్ అన్న అర్థంలో ఎక్కువగా వాడతారు.

ఉమ్మడి కుటుంబం కథ కదాని సినిమా ఇంట్లోనే చుట్టేయకుండా ఇంటర్వెల్ తర్వాత కథను లండన్ తీసుకెళ్లారు. ఓ పాటను ఈజిప్టులో చిత్రీకరించారు. సినిమా దీపావళికి రిలీజు చేద్దామనుకుని రంజాన్ కారణంగా లేటుగా విడుదల చేసారట. బైది వే ఈనాటి ధోరణికి అనుగుణంగా ఈ సినిమా పేరును కూడా కుదించి కె3జి అంటున్నారు. పొడుగుపేరు పెట్టనేల? కుదించనేల? అని మీరూ, నేనూ అనుకున్నా లాభం లేదు. ప్రజల వద్దకు పాలన అనే చక్కని పేరు పెట్టి దాన్ని ఇంగ్లీషులో కుదించి పివిపి అని ప్రభుత్వాధికారులే వాడటం లేదూ?

# "ఆ దొరవద్ద నేర్చుకున్న ఆ కాస్త సంగీతం నాకు బాగా ఉపయోగపడింది"

**- చిత్తూరు వి. నాగయ్య**

మదనపల్లిలో 'బోల్డన్' అనే దొర సబ్ కలెక్టర్‌గా వుండేవారు. ఆయన తాత్కాలికమైన బదిలీ మీద సర్వే ఆఫీసర్‌గా చిత్తూరుకు వచ్చారు. నేను ఆఫీసు నుంచి ఇంటికి వచ్చేదారిలోనే ఆయన బంగళా వుండేది. ఆయన సంగీత ప్రియుడు. అంటే పాశ్చాత్య సంగీత సాధకుడు. రోజూ సాయంకాలం పూట వయొలిన్ వాయించేవాడు. ఆయన భార్య పాడుతూ వుండేది.

ఒక రోజు ఆఫీసు నుంచి వస్తూనే నేను ఆ సంగీతం విన్నాను. వింటూనే అక్కడ ఆగిపోయాను. అలాంటి సంగీతం అంతకుముందు నేనెప్పుడూ వినలేదు. ఏదో కొత్తగా ఉన్నా అందులో మాధుర్యం ఉంది. "బహుశా దొరల సంగీతం యిలా వుంటుంది కాబోలు!" అనుకున్నా, వయొలిన్ మీద ఆయన కమానుపెట్టి నడిపిస్తూ వుంటే నాకు వింత అనుభూతి కలిగింది. "మన సంగీతం, మన రాగాలు మనవి. వారి దేశపు సంగీతం వారిది. అయితే వారి విధానం వేరు. అదేదో కష్టంగా ఉన్నట్టు అనిపిస్తున్నా అది కూడా నేర్చుకోవాలనుకున్నాను. రోజూ సాయంకాలం అయ్యే సరికి ఆఫీసు నుంచి వస్తూ, వారి గుమ్మం ముందు నిల్చొని, ఆ సంగీతం వింటూ, నాలో నేను తిరిగి అనడానికి ప్రయత్నిస్తూ వుండేవాడిని. నేను అక్కడ నిలబడడం, ఆ సంగీతం వినడం బోల్డన్ దొర చూస్తూ వుండేవారు. ఒక రోజు ఆయన నన్ను పిలిచి "ఎందుకిలా రోజూ వచ్చి యిక్కడ నిల్చొని వింటున్నావు? నీకు సంగీతమంటే యిష్టమా?" అని ఆంగ్లంలో అడిగారు.

"ఎస్ సర్" అన్నా నేను.

"ఓ కమిన్ కమిన్" అంటూ నన్ను లోపలికి ఆహ్వానించి కూర్చోమన్నారు.

"నీకు సంగీతమంటే ఎందుకు ఇష్టం? నువ్వు పాడగలవా?" అని అడిగారు. "పాడగలను. అయితే మా సంగీతం...." అన్నాను.

"ఓ... అయితే మీ సంగీతం వినాలి - పాడు" అన్నారు. నేను తేలికగా ఉండే ఒకటి, రెండు పాటలు పాడాను. "నీ గొంతు అద్భుతంగా ఉంది. వెరీ ఫైన్" అంటూ దొరగారు కరచాలనం చేసి, ఎంతగానో మెచ్చుకున్నారు. నేను సిగ్గుపడ్డాను. లోపల ఎంతగానో పొంగిపోయాను.

"మా సంగీతం ఎలా ఉంది?" అని అడిగారు ఆయన.

"చాలా బావుంది. వినాలన్న కుతూహలం కొద్దీ రోజూ ఇక్కడ నించుంటున్నా" అన్నా నేను.

"అయితే మా సంగీతం నీకు నేర్పుతాను. మీ సంగీతం నాకు నేర్పుతావా?" అని అడిగారు.

"నేను మీకు సంగీతం నేర్పడం ఏమిటి సార్?" అన్నాను నేను నవ్వుతూ.



చక్రధారిలో...



సతీమణి జయలక్ష్మితో...

**డిసెంబర్ 30వ తేదీ నటుడు, గాయకుడు, సంగీత దర్శకుడు, నిర్మాత, దర్శకుడు అయిన ఉప్పలదడియం నాగయ్య 28వ వర్ధంతి సందర్భంగా స్వీయ చరిత్రలో ఆయన రాసుకున్న కొంతభాగాన్ని ఇక్కడ పొందు పరుస్తున్నాం.**

**-ఎడిటర్**

"నో నో - మీ సంగీతంలో గొప్ప మహత్తు ఉంది. నాకు పట్టుబడినా, పట్టుబడకపోయినా కనీసం వింటాను కదా" అన్నారు ఆయన. ముందుగా తనకు తెనుగుభాష నేర్పమన్నారు. నేను సరేనన్నాను.

అదంతా తమాషాగా ఉండేది. "కమిన్" అనడానికి తెలుగులో ముందుగా చెప్పు" అన్నారు అయన.

"లోపలకు రా" అని సమాధానం ఇచ్చాను.

ఆయన కొంతసేపు తడుముకుని, నాచేత మళ్ళీ చెప్పించుకుని, చివరకు పట్టి చెబుతూ 'ళోప్లరా' అన్నారు. నాకు నవ్వొచ్చింది. ఆ తరువాత నేను అక్కడికి వెళ్ళినప్పుడల్లా "ళోప్లరా" అంటుండే వారాయన.

ఆయన ఆఫీసు నౌకర్లతో కూడా ఆంగ్లంలో మాట్లాడుతారు. అందుకని 'కాల్ ది పిటిషనర్స్' అన్నదానికి 'అర్జీదారులను పిలువు' అని చెప్పాను. ఆయన చాలా సేపు నేర్చుకుని, ఆఫీసుకు వెళ్తూనే నౌకరును పిలిచి "అజ్జీడార్లను బిల్" అన్నాడు. "నేను తెలుగులో చెబుతూవుంటే నీకు అర్థం కాలేదా? నేను తెలుగే మాట్లాడుతున్నాను" అన్నాడు. ఆయన ఏమంటున్నారో అక్కడ ఎవరికీ అర్థం కాలేదు. అందరు తికమకపడ్డారు. సరేనని ఆఖరికి ఆయన ఆంగ్లంలోనే చెప్పారు. అప్పుడు గాని వాళ్ళకు ఆయన ఉద్దేశమేమిటో అర్థం కాలేదు.

బోల్డన్ దొర గారికి తెలుగుభాష అంటే మంచి అభిమానం. తెలుగు నేర్చుకోవాలని, రాయాలని అభిలషించేవారు. భారతీయ సంగీతం నేర్చుకోవాలని, దాంట్లో కొంతవరకయినా పాండిత్యం సంపాదించాలని అనేవారు, ఆంగ్ల సంగీతంలో ఉండే కొటేషన్స్, విధానాలు నాకు తెలియజేశారు. ఆయన వయొలిన్ మీద వాయిస్తూ, నన్ను ఆ విధంగా పాడమనేవారు. అలా రెండు నెలలు గడిచింది. నా దురదృష్టవశాత్తు ఆయనకు అక్కణ్ణించి బదిలీ అయిపోయింది. లేకపోతే నేను ఆ సంగీతం బాగా నేర్చుకుని ఉండే వాడినేమో! అయితే నేర్చుకున్న ఆ కాస్త సంగీతం తరువాత సినిమాలకు దర్శకుడయినప్పుడు నాకు బాగా ఉపయోగపడింది. ●

తమిళచిత్రం 'అశోక్‌కుమార్'లో



యోగి వేమనగా...





భక్త పోతనగా...





# ప్రపంచానికి 'వరల్డ్'ని ప్రసాదించిన వాల్ట్ డిస్నీ

కార్టూన్ సినిమాలంటే ఇష్టంలేని వారెవరూ ఉండరు. పిల్లలైనా సరే, పెద్దలైనా సరే, మిక్కీమౌస్, డోనాల్డ్ డక్‌లంటే పడి ఛస్తారు. అమెరికాలో పుట్టిన ఈ పాత్రలు ప్రపంచమంతటా దర్శనమిస్తాయి. స్కూలు బాగ్, పెన్సిల్ బాక్స్, టీ షర్టు, కాఫీ కప్పు, వంటింటి తలుపు, షాపింగ్ బాగ్ - మిక్కీమౌస్ కనబడని చోటేదైనా ఉందంటే చెప్పండి చూద్దాం.

ఈ కారెక్టర్లను సృష్టించిన వాల్ట్‌డిస్నీ శతజయంతి ఉత్సవం గత పక్షం డిసెంబరు 5న ఘనంగా జరిగింది. ఆయన పుట్టిన అమెరికాలో మాత్రమే కాదు. ప్రపంచానికి ఈ మూల ఉన్న జపాన్‌లో కూడా "ఫైనల్ ఫాంటసీ" అనే పూర్తి ఏనిమేటెడ్ చిత్రం రిలీజు చేసి డిస్నీకి ఘనమైన నివాళి అర్పించారు. వీడియో గేమ్స్ తయారుచేసే భారీ సంస్థ స్క్వేర్ 13.70 కోట్ల డాలర్లు వెచ్చించి తయారుచేసిన ఈ చిత్రం ప్రస్తుతం విజయవంతంగా ప్రదర్శించబడుతోంది. నోబు సకాగూచీ, మోటోనోరీ సకాకిబారా కలిసి పలు దేశాల ఏనిమేటర్ల సహాయంతో ఈ సినిమా తీయడానికి నాలుగేళ్లు పట్టింది.

ఏనిమేటర్లందరికి ఆరాధ్యదైవమైన (వాల్ట్ పూర్తిపేరు వాల్టర్) డిస్నీ. సరిగ్గా నూరేళ్ల క్రితం డిసెంబరు 5న షికాగోలో పుటాడు. 16వ సంవత్సరాలు వచ్చే వరకు స్కూలులో చదివి ఆ తర్వాత షికాగో, కాన్‌సాన్ సిటీలలోని ఆర్ట్ స్కూళ్ళల్లో చిత్రకళ అధ్యయనం చేశారు. ఏడు సంవత్సరాల వయసు నుండే పెయింటింగ్స్ వేయగలిగిన డిస్నీ తన కళను నమ్ముకుని సినిమా రంగంలో ప్రవేశించాడు. హాలీవుడ్‌లో 21వ ఏట



డిస్నీ-మిక్కీ విగ్రహాలు



మిక్కీకి మొదటగా ఊహించిన రూపం



స్టీమ్‌బోట్ విల్లీగా మిక్కీమౌస్
తొలిసారి తెరపై కనబడిన తీరు

ప్రవేశించేనాటికి అతని చేతిలో ఉన్నవి ఓ సూట్‌కేస్, ఓ స్కెచ్‌బుక్. 40 డాలర్ల రొక్కం, తల నిండా ఐడియాలు. గుండెల నిండా ఆశ....

అన్నగారైన రాయ్ ఓ. డిస్నీ (1893-1971)తో కలిసి 1923 నుండి "ఏలిస్ కామెడీస్" పేర కార్టూన్ సినిమాలు నిర్మించసాగేడు. యూనివర్సల్ పిక్చర్స్ వారికోసం "ఆస్వాల్డ్ ది లక్కీ రాబిట్" అనే కార్టూన్ సిరీస్ 1926-28 మధ్య తయారుచేశాడు. దానికి పేరురాగా చూసి ఆ నిర్మాత డిస్నీ చేతుల్లోంచి దానిని తీసేసుకున్నాడు. ఈ అన్యాయం భరించలేకపోయాడు డిస్నీ. ఆస్వాల్డ్ పాత్రనీ, దానితోబాటు పారమౌంటు పిక్చర్స్‌ను వదిలి పెట్టేసి వేర్వేరు కార్టూన్ ఫిగర్స్ తయారు చేస్తూ రకరకాల స్టూడియోలు తిరిగాడు.

ఆ క్రమంలోనే మిక్కీమౌస్ పుట్టుకొచ్చి డిస్నీకి అజరామరత్వం కల్పించింది. డిస్నీ, అతని భార్య ఒకసారి రైల్లో వెళుతుండగా ఇద్దరూ కలిసి ఆలోచించిన పాత్ర అది. డిస్నీ దానికి మార్‌టైమర్ అని పెడతానంటే అతని భార్య ఆ పేరు ఛామింగ్‌గా లేదంది. మిక్కీ తయారీలో ఆస్వాల్డ్ పోలికలు స్పష్టంగా కనబడతాయి. మిక్కీని ఒరిజనల్‌గా ప్లాను చేసినప్పుడు కంటి చుట్టూ పెద్దవలయాలు పెట్టాడు. కానీ "స్టీము బోటు విల్లీ"లో పాత్రగా మిక్కీ 1928 నవంబరు 18న మొదటిసారి తెరమీద కనబడేనాటికి వలయాల బదులు పెద్ద నల్ల చుక్కలు వచ్చేశాయి. స్వంత నిర్మాణ సంస్థ ప్రారంభించి తీసిన "స్టీము బోట్ విల్లీ" అద్భుత విజయం సాగించింది. కార్టూన్ సినిమాలలో సౌండు ఉపయోగించిన తొలి సినిమా కూడా అదే. అప్పటినుండి 73 ఏళ్లుగా మిక్కీమౌస్ అప్రతిహత జైత్రయాత్ర సాగిపోతోంది.



మిక్కీమౌస్‌కి ప్రేరణ
ఆస్వాల్డ్‌ది లక్కీ రాబిట్

డిస్నీ అనేకరకాల ప్రయోగాలు చేశాడు. "స్కెల్‌టన్ డాన్స్" (1929)లో సిల్లీ సింఫనీ సీరీస్ ప్రారంభించాడు. "ఫ్లవర్స్ అండ్ ట్రీస్" (1932)లో కలర్ మొట్టమొదటిసారిగా ఉపయోగించాడు. కార్టూన్ చిత్రాలంటే హ్రస్వ చిత్రాలకే పరిమితం అనుకునే రోజుల్లో "స్నోవైట్ అండ్ సెవెన్ లిటిల్ డ్వార్ఫ్స్" కథ నుపయోగించి ఫుల్ లెంగ్త్ సినిమా 1937లో తీసాడు. అది అనూహ్యమైన విజయం సాధించడంతో "పినాచియో" (1940), "ఫాంటాసియా" (1941) "బాంబీ" (1942) ఇలా అనేక చిత్రాలు తీసాడు. "ది ఆబ్సెంట్ మైండెడ్ ప్రొఫెసర్" (1961) వంటి మామూలు హాస్యచిత్రాలు కూడా ఎన్నోతీశాడు.

**1950-60**లలో వాల్ట్‌డిస్నీ ప్రొడక్షన్స్ లి. పేర సినీ రంగానికి, టెలివిజన్‌కు అనేక చిత్రాలు తీసి పెట్టాడు డిస్నీ. పుస్తకాలు, కార్టూన్ స్ట్రిప్స్ ఇలా ఎన్నో రంగాలలోకి అడుగుపెట్టి ఆర్టిస్టుల కెందరికో ఉపాధి కల్పించాడు. అతని టీము పెరుగుతూ పోయినా ఆర్టిస్టిక్ కంట్రోలు మాత్రం అతని చేతిలోనే ఉండేది. హాస్యపాత్రలు ఎన్నో కల్పించినా స్వతహాగా చాలా సీరియస్‌గా ఉండే స్వభావమట అతనిది. 1955లో కాలిఫోర్నియాలో డిస్నీలాండ్ ప్రారంభించడం ద్వారా అతను ప్రపంచం మొత్తానికి ఓ కానుక ఇచ్చాడు. అతని మరణానంతరం 1971లో ఫ్లోరిడాలో 'డిస్నీవరల్డ్' తెరిచారు. అతని మరణానంతరం కూడా అతని కంపెనీ చిత్రాలను నిర్మిస్తూనే ఉంది. "మిక్కీమౌస్ క్లబ్" వంటి టీవి సీరిస్ ద్వారా అనేకమంది ఔత్సాహిక గాయనీ గాయకులను (ఈ సంచికలో 50వ పేజీలో గల బ్రిట్నీ స్పియర్ వ్యాసం చూడండి) వెలుగులోకి తెస్తోంది.

వాల్ట్‌డిస్నీ వర్థంతి కూడా గత పక్షంలోనే వచ్చింది. 1966 డిసెంబరు 15న లాస్ ఏంజిలిస్‌లో మరణించాడు. డిస్నీకి 32 ఆస్కార్ ఎకాడమీ అవార్డులు వచ్చాయి. మొదటిసారి "ఫ్లవర్స్ అండ్ ట్రీస్"కి ఎవార్డు వచ్చినప్పుడు మిక్కీమౌస్ గుడ్డబొమ్మను ఒక చేత్తో పట్టుకుని అవార్డు తీసుకోవడానికి వచ్చాడు డిస్నీ. అచ్చు అలాటి బొమ్మని, ఇంకా కొన్ని బొమ్మల్ని కలిపి 'హండ్రడ్ ఇయర్ కలక్షన్ ఆఫ్ డిస్నీ' అన్న పేర ఓ కలక్షన్ బాక్స్ తయారుచేసి కోడన్‌షా కంపెనీ వారు ప్రస్తుతం జపాన్‌లో అమ్ముతున్నారు.

-కమ్యూనికేటర్ ఫీచర్స్




గీతాలకు శ్రావ్య గౌరవంతో పాటు కావ్య గౌరవాన్ని కూడా తెచ్చి పెట్టిన పాటలలో 'అందమె ఆనందం' పాటని చెప్పుకోవాలి. 1953లో విడుదలయిన భాస్కర్ ప్రొడక్షన్స్ వారి

# బ్రతుకు తెరువు




చిత్రంలోని ఈ పాటకు రచన జూనియర్ సముద్రాల. సంగీతం సి.ఆర్.సుబ్బరామన్, ఘంటసాల.



అందమె ఆనందం
ఆనందమె జీవిత మకరందం
అందమె ఆనందం
పడమట సంధ్యారాగం
కుడి ఎడమల కుసుమ పరాగం ॥పడమట॥
ఒడిలో చెలి మోహన రాగం
ఒడిలో చెలి మోహన రాగం ॥అందమె॥
పడిలేచే కడలి తరంగం... ఓ...
పడి లేచే కడలి తరంగం
వడిలో జడిసిన సారంగం
పడిలేచే కడలి తరంగం
వడిలో జడిసిన సారంగం
సుడిగాలిలో... ఓ...
సుడిగాలిలో ఎగిరే పతంగం
జీవితమే ఒక నాటక రంగం... ॥అందమె॥
ఒడిలో చెలి తీయని రాగం ॥ఒడిలో॥
జీవితమె మధురాను రాగం ॥జీవితమే॥ ॥అందమే॥

భీంప్లాస్ రాగంలో స్వరపరచబడిన ఈ పాటని పాడుకోని వాళ్ళు, కంఠోపాఠం రాని వాళ్ళు ఆ రోజుల్లో దాదాపుగా అరుదనే చెప్పాలి. ఘంటసాల పాడిన ఈ పాటను తెరపై అక్కినేని నాగేశ్వరరావు అభినయించగా మరో సన్నివేశంలో సావిత్రికి పి. లీల ఇదే వరుసలో పాడిన పాట కొద్ది మార్పులతో ఇలా ఉంటుంది.



అందమె ఆనందం
ఆనందమె జీవిత మకరందం
అందమె ఆనందం
పడమట సంధ్యారాగం
కుడి ఎడమల కుసుమ పరాగం ॥పడమట॥
ఒడిలో చెలి తీయని రాగం ॥ఒడిలో॥
జీవితమే మధురానురాగం ॥జీవితమే॥ ॥అందమె॥
చల్లని సాగర తీరం
మది జిల్లను మలయసమీరం ॥చల్లని॥
మదిలో కదిలే సరాగం ॥మదిలో॥
జీవితమె అనురాగయోగం ॥జీవితమె॥
అందమె ఆనందం
ఆనందమె జీవిత మకరందం

ఆనాటి సినీ గీతాల్లో సంగీత సాహిత్యాలు పవిత్ర పూజా ప్రసూనాల వలె ఎంతగా గుబాళించి ప్రకాశించేవో చెప్పడానికి ఈ పాటే ఒక ఉదాహరణ. అంతేకాదు ఓ వైపు కవితా సుగంధాలు విరజిమ్ముతూ మరోవైపు కథాపరంగా పాడే పాత్రల వ్యక్తిత్వాలు, సన్నివేశానుగుణమైన రసపోషణ కూడా ప్రతిఫలింప చేసేవి. అందుకే భార్యాపిల్లలపై ప్రేమ కల్గిన కథానాయకుడు (అక్కినేని) మొదటి చరణంలో 'జీవితమె మధురానురాగం' అంటాడు. వారికోసం చేస్తున్న ఉద్యోగాన్ని రక్షించుకోవడానికి పెళ్ళికాలేదని అబద్ధం చెప్పి ఆ బ్రతుకులో తన బ్రతుకు తెరువుని చూసుకుంటున్నాడు. కాబట్టి, రెండో చరణంలో 'జీవితమె ఒక నాటక రంగం' అంటాడు. ఈ విషయం తెలియక అతనిపై ప్రేమను పెంచుకున్న మరో కథానాయికి (సావిత్రి) 'జీవితమె అనురాగయోగం' అంటూ మనసులోని మాటను బైట పెడుతుంది. జీవితానుభవ సారాన్ని కాచి వడబోసి, పాత్రలోకి పరకాయ ప్రవేశం చేయగలిగిన కవి రాసిన ప్రతి అక్షరం శిలాక్షరమై పోతుంది. ఆ శిలాక్షరాలను శిల్పంగా మలిచి ప్రాణప్రతిష్ట చేయగలిగిన ప్రతి స్వరం జీవ స్వరమై పోతుంది. వీటన్నిటినీ ఈ పాట నిరూపిస్తుంది. అందుకే ఈ పాట 48 సంవత్సరాలు దాటినా ఇంకా ప్రేక్షక శ్రోతల హృదయాలలో చెక్కుచెదరకుండా ఉంది.

ఈ పాట గురించి సముద్రాల జూనియర్ ఏమన్నారంటే -

"1953లో బ్రతుకు తెరువు సినిమా వచ్చింది, అది నాకు బ్రతుకు తెరువు నిచ్చింది. "అందమే ఆనందం" అన్న పాట నన్ను గేయ రచయితను చేసింది. దానికి ఓ చిన్న చరిత్ర ఉంది. ఆ పాట స్థానంలో ఓ పాట రాశాను. దర్శకుడు పి.రామకృష్ణ రావు (భానుమతి గారి భర్త) గార్కి అది నచ్చలేదు. మరో పాట ప్రయత్నించు అన్నారు. మ్యూజిక్ సెషన్ నుంచి అలాగే సినిమాకు బయలుదేరాను. సూర్యాస్తమానం అవుతోంది. పడమటి సంధ్యారాగంతో పాట ప్రారంభం అయింది. పాటంతా వెల్లువలా ఒక పది నిమిషాలలో వచ్చేసింది. మర్నాడు ఉదయం 9 గంటలకి పాట ఘంటసాలకిచ్చేను. ఆనందమే జీవిత మకరందం తర్వాత "సుర నందన వనం మాకందం" అనే పల్లవిని వ్రాసి ఇచ్చాను. "నాకు వద్దు" అన్నాడు ఘంటసాల. ఒక గంటలో ట్యూన్ చేయడం అయిపోయింది. 10 గం॥ దర్శకుడు విని 'ఓకె' అన్నాడు. 11 గం॥ ఇంటికి వెడితే అప్పుడే వచ్చేశారేమిటి? అని శ్రీమతి ఘంటసాల అడిగారు. పాట రాయడం, ట్యూన్ చేయడం, ఓకె అనడం అన్ని అయిపోయాయని సగర్వంగా అన్నాడు ఘంటసాల. ఎంత హాయిగా పాడాడు ఆ పాట. అంత నిండుగా ఆ స్థాయిలో సంచారం చేయాలంటె అతనికే చెల్లు."

'బ్రతుకు తెరువు' చిత్రం తరువాత అదే కథతో హిందీలో 'జీనే కీ రాహ్'(1969) చిత్రాన్ని తీసినా, ఆ హిందీ చిత్రంలో చేసిన మార్పులతో తిరిగి అక్కినేనితోనే తెలుగులో 'భార్యా బిడ్డలు'(1971)గా మళ్ళీ వచ్చినా, ఈ 'అందమె ఆనందం' పాటకున్నంత ఆయుః ప్రమాణాన్ని ఆ రెండు చిత్రాల్లోని పాటలూ బాగున్నా సరే పొందలేక పోయాయి. 'బ్రతుకు తెరువు' వచ్చిన మరుసటి సంవత్సరమే రిలీజయిన 'మేనరికం' చిత్రంలో అదే పాట ప్రేరణతో

**ఆనందం ఆనందం**
**ఆనందమె జీవిత పరమార్థం** ॥ఆనందం॥
**ముసిముసి నవ్వుల మోహన రాగం**
**కొసరే కోకిల వసంతగానం**
**శరన్మల్లికా మధుర నికుంజం**
**ప్రేమ దృగంచల బాల కురంగం** ॥ఆనందం॥
**చల్లగాలిలో గగన విహారం**
**సాగే ఊయల స్వైరవిహారం**
**సెలయేటిలో స్వేచ్ఛాయానం**
**కలిసే మనసుల ప్రణయ కలాపం**
**పున్నమి వెన్నెల పొంగే సంద్రం**
**కన్నులు కన్నులు కలసే సమయం**
**ఏమున్నది జీవిత చరితార్థం**
**ప్రేమదేవత కదే పరమార్థం**




అంటూ పెండ్యాల సంగీత దర్శకత్వంలో జంపన ఓ పాట రాసినా అది సోదిలోకి రాకుండా పోయింది.

భరణి పిక్చర్స్ అధినేతగా గుర్తింపు పొందిన పి. రామకృష్ణ బయటి సంస్థలకు కూడా దర్శకత్వం చేసిన రెండు, మూడు చిత్రాల్లో 'బ్రతుకు తెరువు' ఒకటి. జాన్ కీట్స్ అనే ఆంగ్ల కవి రాసిన 'A thing of beauty is joy for ever' అనే కొటేషన్ 'అందమె ఆనందం ఆనందమే జీవిత మకరందం' పాటకు స్ఫూర్తి అని కొందరంటారు.

**ఏదో మత్తుమందు జల్లి**
**మాయలూ జేసీ**
**మది దోచినాడే**
**మెల్ల మెల్లగా చల్ల చల్లగా** ॥ఏదో॥
**తొలి చూపులోనే తరి తీపి రేపె**
**మలి చూపులోనే**
**నా మతే మాపె** ॥మలి॥ ॥ఏదో॥
**ఆ...**



**కనుల కనినంతనే**
**ఏదో కలవర మాయె...**
**మాట వినినంతనే**
**మైమరపులాయె...** ॥ఏదో॥
**వలపే వలలాయె**
**తలపులే తొలకలాయె**
**పసిడి సంకెల బ్రతుకాయె**
**పలుకే రాదాయె** ॥ఏదో॥

ఈ పాటను పి.లీల పాడగా సావిత్రి అభినయించారు. అక్కినేని కూడా సన్నివేశంలో ఉంటారు. ఈ పాటకు రచన సముద్రాల. (జూనియర్, సీనియర్ ప్రత్యేకంగా పేర్కొనబడలేదు). సాధారణంగా సాకీ, పల్లవి, చరణం ఇలా పాటలో ఉంటుంటాయి. కానీ తొలుత పల్లవి, ఆ తరువాత చరణం, ఆ తరువాత సాకీల వలె అనిపించే చరణాలు ఉండడం ఈ పాట ప్రత్యేకత. సాహిత్యాన్ని పట్టించుకొనే అలవాటున్న వారిని 'తరితీపి' అనే ప్రయోగం ఆకర్షిస్తుందీ పాటలో. తరి అంటే గాఢమైన, చిక్కని, దృఢమైన అనే అర్థాలున్నాయి.

ఈ సినిమాకి సంగీతం సి.ఆర్.సుబ్బరామన్ అండ్ ఘంటసాల అని టైటిల్స్‌లో ఉంటుంది. 'అందమే ఆనందం' పాటను ఘంటసాలే స్వర పరచినట్టుగా సముద్రాల జూనియర్ చెప్పిన మాటలను బట్టి తెలుస్తోంది. కాస్త జాగ్రత్తగా గమనిస్తే 'ఏదో మత్తు మందు జల్లి' ఈ పాటను కూడా ఘంటసాలే స్వర పరచినట్టు మనకి తెలిసిపోతుంది. కావాలంటే పాటను సంపాదించి వినండి. ఏదో కలవరమాయె / పలుకేరాదాయె అనే వాక్యాల దగ్గర వచ్చే ట్యూన్‌ని అలా ఆలపించుకుంటూ పోతే 'మర్మయోగి' సినిమాలోని 'నవ్వుల నదిలో పువ్వుల పడవ కదిలే' పాట దగ్గర తేల్తాం. ఈ పాటకి సంగీతం ఘంటసాల. ఇదే నడక 'ఏదో మత్తుమందు' పాటలో పేర్కొన్న వాక్యాల దగ్గర కనిపిస్తుంది.

ఈ 'బ్రతుకుతెరువు' సినిమాలో గల పాటలలో 'గాలి మేడలా కూలే ఆశా' అనే పాటను మాత్రం సుబ్బరాయన్ ట్యూన్ చేసి చనిపోయారని, మిగిలిన పాటలన్నిటినీ ఘంటసాలే ట్యూన్ చేశారని ఆయన సతీమణి సావిత్రి గారు తెలిపారు. ఈ 'గాలిమేడలా కూలే ఆశా' పాటను ప్రసాదరావు పాడారట.★

# అమెరికా ప్రెసిడెంట్‌గా క్రిస్ 'టక్కరి' వేషం






**యాక్షన్, కామెడీ కలగలిపి నటించగల అత్యంత ప్రతిభావంతుడైన జాకీచాన్ వంటి సెలబ్రిటీతో సహనటుడిగా పోటీపడి నటనా కౌశలం గల హాస్యనటుడెవరో చెప్పమంటే "రష్ అవర్" గానీ "రష్ అవర్ 2" గానీ చూసిన ప్రేక్షకులు ఇట్టే చెప్పగలుగుతారు. "మనీ టాక్స్", "ఫ్రైడే" వంటి హాస్యచిత్రాలలోనే కాక 'డెడ్ ప్రెసిడెంట్స్" వంటి ఏక్షన్ చిత్రాలు, "ఫిఫ్త్ ఎలిమెంట్" వంటి సైఫీ చిత్రాలలో కూడా సమానప్రతిభ నటించగలిగిన క్రిస్ టక్కర్ పైకి వస్తున్న నేటి మేటి హాలీవుడ్ హాస్యనటుడు.**

అమెరికా ప్రెసిడెంటుగా ఒక నల్లజాతీయుడు ఎన్నికయితే ఎలా వుంటుంది అని ఊహాగానం చేసి ఇర్వింగ్ వాలెస్ "ది మాన్" అనే పుస్తకం రాసారు. 2001 లో రిలీజు కాబోతున్న క్రిస్ టక్కర్ సినిమా "మిస్టర్ ప్రెసిడెంటు"లో క్రిస్ వేయబోతున్న వేషం అదే. అతను స్వతహాగా నల్లజాతీయుడే కాబట్టి ఆ వేషం అతనికి నప్పుతుంది. అయితే ఈ ప్రెసిడెంటు ఆఫ్రో-అమెరికన్లకు ఏదో ఒరగబెట్టి ఉద్ధరిస్తాడని అనుకోనక్కరలేదు. క్రిస్ వేసేది షోకిల్లా ప్రెసిడెంటు వేషం.

ఇరవై తొమ్మిదేళ్ల ఏళ్ళను క్రిస్ చూస్తే మూర్తీభవించిన చైతన్యం అనిపిస్తుంది. అతి చురుకైన కదలికలు, పెనం మీద పేలంలా ఎగిరెగిరిపడే గంతులు, హైపిచ్‌లో మాట్లాడడం, శరవేగంతో డైలాగులు చెప్పడం అతని ప్రత్యేకత. ఎడ్డీ మర్ఫీ తర్వాత అంతటి వాడు క్రిస్‌యే నంటారు. నిజానికి క్రిస్‌కి ఎడ్డీ మర్ఫీ ఆరాధ్యదైవమే.

అమెరికాలోని అట్లాంటాలో పుట్టిన క్రిస్ ఆరుగురు పిల్లలలో చివరివాడు. బాల్యంలో అన్నగార్ల వెంట తిరుగుదామని వాళ్ళు పొమ్మనేవారు. జోకులు వేసి, మిమిక్రీ చేసి వాళ్లను నవ్విస్తూంటే అతను అందరి దృష్టిని ఆకర్షించగలిగేడు. టీచర్లు కూడా అతని జోకులకు పడిపడి నవ్వేవారు. ఓ సారి ఓ టీచరు స్కూలు టేలెంటు షోలో పాల్గొనరాదా అన్నాడు. సరేనన్నాడు క్రిస్. స్టేజి ఎక్కితే ప్రశంసల వర్షం కురిసింది.



తొలిచిత్రం 'హౌస్‌పార్టీ' పోస్టర్

అలా స్కూలు ప్రోగ్రాములలో వేషాలు వేస్తూ, గ్రాడ్యుయేషన్ పూర్తయ్యాక ప్రొఫెషనల్ కమెడియన్ అవుదామనుకున్నాడు. క్లాసుమేట్సంతా "నీకిదే సరైన వృత్తి, వద, వేం తోడుంటాం" అన్నారు. స్థానికంగా ఉన్న కామెడీ క్లబ్‌లో తొలిసారిగా క్రిస్ స్టేజెక్కాడు. అది కూడా అంత సులభంగా జరగలేదు. నీకు వయసు తక్కువ కాబట్టి వేయకూడదన్నారు నిర్వాహకులు. తన వాక్చాతుర్యంతో వాళ్లను మెప్పించి, స్టేజి ఎక్కేశాడు క్రిస్. లోకల్ కామెడీ క్లబ్‌లలో పేరు ప్రఖ్యాతులు రావడంతో ఏంజిల్స్‌కి ప్రయాణం కట్టాడు. అప్పుడతనికి 19 ఏళ్ళు. అక్కడా కొన్నాళ్ళు ప్రదర్శనలు ఇచ్చాక 'ఎచ్.బి.ఒ.' టీవీ ఛానెల్ వారి "డెఫ్ కామెడీ జామ్" ప్రోగ్రాం ద్వారా అశేష ప్రజానీకానికి పరిచయమయ్యాడు. సినిమా నటుడిగా కీర్తిప్రతిష్టలు వచ్చినా



జాకీచాన్‌తో 'రష్ అవర్' (1998)లో

ఇప్పటికీ స్టేజి షోలంటే క్రిస్‌కి మక్కువే. ప్రజల స్పందనను కళ్ళారా చూడవచ్చు కదా అంటాడు.

"హౌస్ పార్టీ" అనే కామెడీ మ్యూజికల్ 1990లో రిలీజయింది. చాలా హిట్ అయింది. దాంతో ఆనవాయితీ ప్రకారం "హౌస్ పార్టీ-2(1991)వచ్చేసింది. అది పెద్ద బాగా లేకపోవడంతో మూడేళ్ళు ఆగి 1994లో "హౌస్‌పార్టీ-3" తీశారు. దాంట్లో క్రిస్‌కి ఓ చిన్నవేషం దొరికింది. సినిమా గొప్పగా లేకపోయినా క్రిస్‌కు గుర్తింపు వచ్చింది. తరువాతి సంవత్సరమే "ఫ్రైడే" అన్న కామెడీ సినిమాలో పెద్దవేషం దొరికింది. సమాజంలోని బడుగు ప్రజల మధ్య సాగే ఒక రోజు గాథ అది. నిజాయితీగా పనిచేసి అన్యాయంగా ఉద్యోగం పోగొట్టుకున్న పాత్ర ఐస్‌క్యూబ్‌ది. మత్తు పదార్థాలు అమ్ముతూ, మధ్యలో తనే అది సేవిస్తూ బద్ధకంగా ఉండే టక్కరి మనిషి పాత్ర క్రిస్‌ది. చుట్టూ ఉన్న సమాజాన్ని అద్దంలో చూపుతూనే హాస్యంగా వ్యాఖ్యానిస్తూ, హింస వద్దని సందేశం ఇచ్చిన ఈ సినిమా బాగా హిట్ అయింది.

అదే సంవత్సరంలోనే విడుదలైన "డెడ్ ప్రెసిడెంట్స్" (కేష్‌కి స్లాంగ్‌లో వాడే పదం) వియత్నాం వెటరన్స్ గురించిన చిత్రం. వియత్నాంను యుద్ధంలో ఎలాగైనా ఓడించాలన్న పట్టుదలతో అమెరికా ప్రభుత్వం యువకులను బలవంతంగా సైన్యంలోకి చేర్పించింది. ఆత్మరక్షణకు జరిగే యుద్ధం కాదు కాబట్టి యుద్ధం వారెవ్వరికీ యుద్ధం చేయాలన్న ఉత్సాహం ఉండేది కాదు. పైగా వియత్నాం ప్రజలతో యుద్ధం జరపడం చాలా కష్టమయింది. చివరికి అమెరికా తోక ముడిచి, వియత్నా నుండి సైన్యాన్ని ఉపసంహరించుకుంది. ఓడిపోయిన సైన్యానికి ప్రజల నుండి ఆదరణ లభించలేదు. అందువల్ల వియత్నాం యుద్ధవీరులు ఫ్రస్ట్రేషన్‌కి గురయి, మానసికంగా కూడా చాలా అవస్థలు పడ్డారు. కొంతమంది సాంఘిక వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడ్డారు. అలా కారు దోపిడీకి పాల్పడ్డ ముగ్గురు వియత్నాం సైనికుల గాథ "డెడ్ ప్రెసిడెంట్స్". ఇదీ హిట్ అయింది.



1997 నాటికి "జాకీ బ్రౌన్", "మనీ టాక్స్" విడుదల అయ్యాయి. వీటిలో మొదటిది ఒక చక్కటి క్రైమ్ థ్రిల్లర్. రెండోదానికి క్రిస్ ఎక్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. "మనీ టాక్స్"లో క్రిస్ ఓ చిన్నతరహా కిల్లాడి దొంగ. కొందరు దొంగలు జైలు కాపలాదారులను చంపేసి పారిపోతే క్రిస్‌మీదకు అనుమానం వస్తుంది. ఆ చెడ్డపేరు పోగొట్టుకోవాలని ఓ టీవీ రిపోర్టరు సాయం కోరతాడు క్రిస్. ఈ క్రమంలో డైమండ్ స్మగ్లింగ్ రాకెట్ బయటపడుతుంది. క్రిస్ వల్ల సినిమాకు మంచి ఊపు వచ్చింది. 1998లో వచ్చిన "ఫిఫ్త్ ఎలిమెంట్" 23వ శతాబ్దం నాటిసైఫీ సినిమా.

1998లో వచ్చిన "రష్ అవర్"తో క్రిస్ దశ తిరిగటిపోయిందని చెప్పాలి. జాకీచాన్‌ను, క్రిస్ టక్కర్‌కు ఇద్దరికీ సరైన పాత్రలు ఇచ్చి ఒక చక్కటి జంటగా ప్రదర్శించాడు డైరక్టర్ బ్రెట్ రాట్నర్. సినిమా ఎడ్వర్టయిజ్‌మెంట్ చూస్తేనే నిర్మాతల ఉద్దేశ్యం తెలిసిపోతుంది. "ఫాస్టెస్ట్ హేండ్స్ ఇన్ ది ఈస్ట్ వెర్సస్ బిగ్గెస్ట్ మౌత్ ఇన్ ది వెస్ట్" అని ప్రకటించారు. అయితే క్రిస్ చురుకుతనంలో కూడా జాకీచాన్‌కి తీసిపోకుండా నటించాడు. జాకీచాన్‌కి సరైన స్థానం ఉండేట్లుగానే కథ మార్చుకున్నారు. అమెరికా పర్యటిస్తున్న చైనీస్ కాన్సల్ కూతురును ఎవరో కిడ్నాప్ చేస్తారు. కూపీ తీయడానికి హాంగ్‌కాంగ్ నుండి పోలీసు ఇన్‌స్పెక్టర్ లీ(జాకీచాన్)ను రప్పిస్తే, అమెరికా గూఢచారి సంస్థ ఎఫ్.బి.ఐ.కు అది రుచించదు. జాకీకి సహాయం చేయడానికి అంటూ ఓ పరమకిల్లాడి డిటెక్టివ్ (క్రిస్)ను అంటగడతారు. జాకీకి, క్రిస్‌కు సఖ్యత కుదిరి దుర్మార్గులను మట్టికరిపించడమే తక్కిన కథ.

"రష్ అవర్" సూపర్ హిట్ కావడంతో "రష్ అవర్-2" వచ్చింది ఈ సంవత్సరం. ఈ సారి కథ నడిచేది జాకీచాన్ హోమ్ పిచ్ హాంగ్‌కాంగ్‌లో. ఇన్‌స్పెక్టర్ లీ తండ్రిని మోసం చేసిన వ్యక్తిని పట్టుకోవడానికి ఇద్దరూ మళ్ళీ చేతులు కలుపుతారు. ఈ ఇద్దరికీ తోడుగా ఇంకో ఇద్దరు అమ్మాయిలు కూడా చేరారు. రోజలీన్ శాంచేజ్ సిఐఏ ఏజంటుగా నటిస్తే "క్రోచింగ్ టైగర్, హిడెన్ డ్రాగన్" ఫేమ్ ఝూంగ్ ఝియి మరో హీరోయిన్‌గా వేసింది. ఈ సినిమా కూడా సూపర్ హిట్ అయిందనడానికి నిదర్శనం 2004లో "రష్ అవర్-3" విడుదల కాబోతోందని నిర్మాతలు ఈమధ్యనే ఆగస్టులో ప్రకటించడం!

ఈ లోగా క్రిస్ "మిస్టర్ ప్రెసిడెంటు"గా నటించబోతున్నాడు. రష్ అవర్-2కు 20 మిలియన్ల డాలర్ల పారితోషికం తీసుకున్న క్రిస్ ఈ కొత్త సినిమాకు ఇంకో ఐదు మిలియన్ డాలర్లు ఎక్కువ తీసుకున్నాడు. ఫలితాలు ఎలా ఉంటాయో చూడడానికి కొత్త సంవత్సరం వచ్చేదాకా ఆగవలసినదే!

-కమ్యూనికేటర్ ఫీచర్స్




నలభై ఏళ్లుగా సినీపరిశ్రమ తీరుతెన్నులపై
అధ్యయనం చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

**రావికొండలరావు**

**డిసెంబరు 29**

**పింగళి నాగేంద్రరావు**

**జయంతి సందర్భంగా...**

రాసిన వ్యాసమిది



# ఎక్కడ వేస్తే అక్కడ ఉండని 'గొంగళి'

# 'గింబళి' నాగేంద్రరావు

తెల్ల జుట్టు, తెల్ల ఫ్రేము కళ్లజోడు, తెల్లటి సగం చేతుల జుబ్బా, అంతకంటె తెల్లని మల్లు పంచె - వీటిన్నిటి వెనకా దాగున్న నల్లని శరీరం. ఆయన పింగళి నాగేంద్రరావు. శృంగార హాస్య బీభత్స క్రోధాది నవ్య నవరసాగేంద్రరావు. 'జగదేకవీరుని కథ' మొదలు పెట్టాలనుకుంటున్న శుభవేళ. నాగేంద్రరావుగారు విజయాలో కారు దిగి, డిస్కషన్ రూము వేపు వెళ్లి, లోపలికి తొంగి చూసి, మేనజర్ని పిలిచారు. "ఏమిటింకా, కుర్చీలూ బల్లలూ అలాగే వున్నాయి? తీసేయలేదూ?'' అని అడిగాను. ఆయన మేనేజరు, పక్కనే వున్న సహాయ దర్శకులూ సినిమాల్లో రియాక్షన్స్ ఇచ్చినట్టు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. "అది కాదయ్యా - ఇవాళ్నుంచి స్క్రిప్టు మీద కూచుందాం అన్నారు కదా, అందుకని బల్లలూ టేబుళ్లూ కుర్చీలూ ఎందుకున్నాయా అని అడిగాను'' అన్నారు. పింగళివారు తాను 'హహ్హహ్హ' అని నవ్వుతూ, వాళ్లనీ కవ్విస్తూ సినిమా పాటల్లో మాటల్లో చమత్కారాలు సాగించినట్టే, మామూలు మాటల్లో కూడా వీలైనంతవరకూ చమత్కరిస్తూనే వుంటారాయన.

నాగేంద్రరావు గారు సినిమా 'రచనా రోడ్డు'ని, ఒక మలుపు తిప్పి కొత్తదారి చూపించిన ట్రెండ్ సెట్టర్. అది ఎలాంటి దృశ్యమైనా వీలైనంతవరకు చమత్కారాలతో నడపడం ఆయన ధోరణి, బాణీ. మామూలుగా అయితే, వ్యంగ్య హాస్య గీతాల్లోనే చమత్కారం చేస్తారు రచయితలు. పింగళి వారు అలా కాదు. శృంగార గీతాల్లో కూడా చమత్కారాలు చేస్తూ చమక్ చమక్ అనిపించిన రచయిత 'పెళ్లి చేసి చూడు'లోని స్వప్న దృశ్యంలో ఊర్వశి హొయలు ఒలకబోస్తూ ప్రేమిస్తున్నానని పాడితే,



"చాలు చాలు నీ సాముదాయకపు వలపు పంపిణీ'' అంటాడు అర్జునుడు. ఊర్వశి, ఏ ఒక్కరికో కాదు అందరికీ వలపు పంచుతుంది - కోపరేటివ్ సిస్టమ్‌లో డిస్ట్రిబ్యూషన్ - అన్నమాట. అదే ఆయన రాసిన "సాముదాయకపు వలపు పంపిణి''. ఆ పాటలోనే "యుగయుగాలుగా జగజగాలుగా'' అని రాశారు. 'జగజగాలుగా వుండదు కదా'' అని అడిగితే, "ఔచిత్య భంగం కాకుండా, ఓ పదం వేస్తే బాగుంటుందనుకున్నప్పుడు వేసేయడమే. ఆలోచన అక్కర్లేదు. జగజగాలు అలా వేసిందే. ఆ పాటలోనే 'ఊగించిన ఉగ్రూగించిన అన్నది లేదు. తప్పు అని కాక పోయినా, అవసరం అనుకుంటే హ్రస్వీకరించి, అర్థమయ్యేట్లుగా మాటని వాడుకోవడంలో తప్పులేదు. నా ఉద్దేశంలో భావం, భాషకి బందీ అయిపోకూడదు..తన అవసరానికి భాషని - భావం వాడుకోవచ్చు, వాడుకోవాలి. కొత్త ప్రయోగం చేసినంతమాత్రాన భాషాదోషం అనుకోనక్కర్లేదు. 'మాయాబజార్'లో ఘటోత్కచుడు చెప్పినట్టు - "ఎవరూ పుట్టించకుండా మాటలెలా పుడతాయి?'' అని నవ్వారు నాగేంద్రరావుగారు. తోట రాముడు (పాతాళభైరవి) మోటువాడు గనుక వాడి ప్రేమ 'ఘాటుప్రేమ'. కృష్ణుణ్ణి చూస్తు రుక్మిణి 'లాహిరిలాహిరి' పాటలో (మయాబజార్) చల్లని దేవుని అల్లరి'లో అని పాడుతుంది. 'చందమామ చల్లగా, మత్తుమందు చల్లగా' (గుండమ్మ కథ) లాంటి 'సింపుల్' ప్రయోగాలూ ఎన్నెన్నో. ఆయనకి పాటల్లో 'ఓహో'లు వెయ్యడం అలవాటు - 'గుణసుందరి కథ' నుంచి వుంది. 'చలనము లోహో నాట్యములే' 'చెలికడనోహో శౌర్యములే' (మాయాబజార్) అన్నట్టుగా 'ఆహో'లు వెయ్యడం కూడా ఆయనకి అలవాటే. 'కృష్ణార్జున యుద్ధం' సినిమాకి 'మ్యూజిక్ సిటింగ్స్' జరుగుతున్నాయి. 'అన్నీ మంచి శకునములే' పాటకి వరస కడుతున్నారు పెండ్యాల వారు. 'మనసున మంగళ వాద్యములు మ్రోగెలే'' అని పింగళి వారు రాసిస్తే దాన్ని తాళానికి కుదర్చడానికి, సంగీత దర్శకుడు ప్రయత్నిస్తూ వుంటే - "ఎందుకు నాగేశ్వరరావు అవస్థ? మనసున మంగళ వాద్యమాహో మ్రోగెలే'' అని "ఆహో''ని మధ్యలో పడేయ్'' అని సింపుల్‌గా తేల్చేసి, 'ఆహారం' అందించగల పాక శాకంభరీదేవి ప్రసాదం ఆయన. అందుకే కాబోలు ఎక్కడో దగ్గర వుండిపోయినప్పుడు - "ఇంటికి వెళ్లాలి. వెళ్లి వంట వండాలి'' అనే వారు. అంటే స్క్రిప్టు రాయడం అన్నమాట. ఏ సినిమా గురించైనా, ఎవరైనా అడిగితే "ఏదీ, ఇంకా వంటవుతోంది'' అనే వారు. సాయంకాలపు వేళల్లో పెద్దలంతా పానగల్ పార్కులో కలిసేవారు. ఓ రోజు ఆయన తొందరగా వచ్చారు. ఆ మాటే ఒక మిత్రుడు అడిగితే - "ఇవాళ బేరాల్లేవు. దుకాణం తొందరగా కట్టేశాను'' అన్నారు నాగేంద్రరావుగారు. 'బేరాల్లేవు' అంటే -.రచనకి ఆలోచన రాలేదన్నమాట.

ప్రజ, పాటలు పాడుకున్నట్టుగా మాటలు కూడా పాడుకునేలా చేసిన రచయిత ఆయన. హలా, డింగిరి, డింభకా, గిడిగిడి, శాయురా వంటి మాటలు



అభిమాన ప్రేక్షకుల నోళ్లలో ఈ నాటికీ తిరుగుతూనే వున్నాయి. ఆయన రాసిన పాటల మాటలతో వచ్చినన్ని సినిమా టైటిల్స్ ఇంకో రచయితవి రాలేదు. సంస్కృతాంధ్ర భాషల్లో వైదుష్యం, వైదగ్ధ్యం గల నాగేంద్రరావు సినిమాలకు ముందు నాటకాల రచయిత, రైల్వేలో ఉద్యోగం చేస్తూ జాతీయగీతాలు, దేశభక్తి పాటలూ రాశారాయన. 'శారద' అనే పత్రికలో ఉద్యోగం కొన్నాళ్లు. డి.వి.సుబ్బారావు ప్రదర్శించిన 'వింధ్యరాణి' (పింగళి వారి రచనే) నాటకంతో, ఆ కంపెనీ కార్యదర్శిగా ఎన్నోవూళ్లు తిరిగి నాటకాలు ఆడించిన అనుభవం కూడా ఆయనకుంది. కాని 'వింధ్యరాణి' సినిమాగా వచ్చి, దెబ్బతిన్నప్పుడు నాగేంద్రరావు గురించి ఎవరూ తలచుకోలేదు. ఐతే, ఆయనలో ఒక ప్రతిభ వెలుగుతోంది. ఆ వెలుగు చూసిన కమలాకర కామేశ్వరరావు గారు, ఆయనకో దారి చూపించి, కె.వి.రెడ్డిగారికీ దారి చూపించారు. ఆ దారిలో వచ్చిందే 'గుణసుందరి కథ'. దాంతో మొదలైంది నాగేంద్రుని కథ - అంతకు ముందు ఎప్పుడో 'భలే పెళ్లి' చిన్న సినిమాకి రాసినా.

పానగల్ పార్క్ సమావేశానికి ఓ సాయంకాలం వస్తూ "ఆరు గంటల కల్లా సారణీవారు (మహాకవి కాళిదాసు) కారు పంపుతామన్నారు. ఆరు గంటల రెండు నిమిషాల వరకూ చూశాను. ఇంక నిరీక్షించలేక ఇటు వచ్చేశాను" అని ఛలోక్తి పేల్చారు పింగళి.

'గుండమ్మ కథ' జరుగుతున్నప్పుడు నాగేశ్వరరావుకీ, జమునకీ ఒక అవుడోర్ డ్యూయెట్ వుంటుందనీ, అది కాశ్మీర్‌లోనో, బృందావనంలోనో, ఊటీలోనే తియ్యాలనీ అనుకునేవారు. కొన్నాళ్లయిన తర్వాత - చక్రపాణిగారు "ఎందుకూ వూటీ, ఇక్కడే మన గార్డెన్‌లో తీదాం" అన్నారు. అందుకే ఆ మాట అందుకుని అదే పాట రాశాను - "ప్రేమ యాత్రలకు బృందావనమూ నందన వనమూ ఏలనో" అని, ఈ విధానంలో రాస్తే చక్రపాణిగారు ఓకే చేసినట్టు తక్కిన వారు చేస్తారా - అని నా అనుమానం. ఆ పాటలోనే "జగమునె వూటీ శాయగా" అని రాశాను. తక్కిన చిత్రాలకీ, తక్కినవారికీ నేను పాటలు రాయక పోడానికి కారణం అదే, అదే భయం. అందుకు ఎందరడిగినా, ఇతరులకి విడిగా పాటలు రాయలేదు" అని చెప్పారు నాగేంద్రరావు.

రేలంగి ఓ సారి అడిగారు, "కవిగారూ! మీరు బ్రహ్మచారి. శృంగార రసం ఎరగని వారు. మరి, శృంగారప్పాటలూ, సీన్లూ అంతగొప్పగా ఎలా రాయగల్గుతున్నారు?" అని. "రేలంగీ! శృంగారం రాయడానికి అనుభవం అక్కర్లేదు. యుద్ధపు దృశ్యాలు రాయాలంటే యుద్ధాలు చెయ్యాలా! నువు రేలంగివి, నేను పింగళిని. అంటే కవిని. రవిగాంచనివి కవిగాంచును. రేలంగి గాంచనివి పింగళి గాంచును. అదీ తేడా" అని చమత్కరించారు పింగళి.

ఆయన సినిమాకి కొత్త మాటలు చెప్పారు. కొత్తదారి చూపించారు. కొత్త నడక నేర్పించారు. 'రసమయ జగమును రాసక్రీడకు ఉసిగొలిపినట్టు - సినీమయ జగమును రాతక్రీడకు ఉసిగొలిపిన రచయిత 'గింబళి' నాగేంద్రరావు.

★

## పింగళి ప్రయోగాలు

- మహాజనానికి మరదలు పిల్ల (పాతాళభైరవి)
- బొడ్డుదేవర (పాతాళభైరవి)
- ఘాటుప్రేమ (పాతాళభైరవి)
- కన్నెకాటు (పాతాళభైరవి)
- ఘటోత్కచాశ్రమం (మాయాబజార్)
- వీరతాడు (మాయాబజార్)
- హైహై నాయకా (మాయాబజార్)
- హైహై బాలకా (మాయాబజార్)
- అలమలం (మాయాబజార్)
- సత్యపీఠం / ప్రియదర్శిని (మాయాబజార్)
- లాహిరి లాహిరి లాహిరి (మాయాబజార్)
- విరహము కూడా సుఖమేకాదా
- నిరతము చింతన మధురము కాదా (మాయాబజార్)
- రక్షలు రక్షలు పాదరక్షలు
- నాట్య శిక్షలో బాలశిక్షలు (మాయాబజార్)
- భోరుభోరుమంటు (మాయాబజార్)
- కవచమిది కవచమిది పరమం పవిత్రం
- రక్ష ఇది రక్ష ఇది శుభదం సుచిత్రం (మాయాబజార్)
- ఇష్టపురచతుష్టయం (మాయాబజార్)
- తాతపాదులవారు (మాయాబజార్)
- హలా (జగదేకవీరుని కథ)
- ఓం ఏకోనేనో హమస్మి (జగదేకవీరుని కథ)
- తింత్రిణీపాకం (చింతపండు ముద్ద) తినీ తినీ
- తింతినీ పాకం అయిందన్నమాట (భాగ్యచక్రం)
- సందడించి (భాగ్యచక్రం)
- వల్లెవల్లె వల్లెయనగ (భాగ్యచక్రం)
- అజభీ దఫపా విశ్వేసకి
- స్వాములవారు (శ్రీకృష్ణార్జునయుద్ధం)
- ఓం ప్రాణేశాయనమః ఇయంముహూర్తే
- సాక్షాత్కారం కురుకురు (శ్రీకృష్ణార్జునయుద్ధం)
- వైళమ (శ్రీకృష్ణార్జునయుద్ధం)
- రాభణుడు (కాళిదాసు)
- తోకరాయుడు (కాళిదాసు)
- త్రీపీడా పరివారోస్తు (కాళిదాసు)
- చందమామ చల్లగా
- మత్తుమందు చల్లగా (గుండమ్మకథ)
- అయినా మనిషి మారలేదు (గుండమ్మకథ)

ఈ పేజీలోనూ పక్క పేజీలోనూ పేర్కొన్న ఈ ఇంద్రజాలాలన్నీ - పింగళి వారి సాహితీ సముద్రంలోంచి అలవోకగా ఏరుకొన్నవి. ఇలాంటివి ఎన్నో ఇంకెన్నోన్నో.....



## పింగళి గురించి మరి కొంచెం...

పింగళి పుట్టినది బొబ్బిలి తాలూకా రాజాంలో నైనా బంధువర్గమంతా బందరులో ఉండడం వల్ల బందరులోనే స్థిరనివాసం ఏర్పరుచుకున్నారు. చదువు, రచనావ్యాసంగం, కృష్ణాపత్రికతో సాంగత్యం అన్నిటికీ కార్యస్థానం బందరే.

పింగళి మొదట్లో బందరు స్కూల్లో టీచరుగా పని చేసారు. ఆ ఆదాయం చాలక ఖరగ్‌పూర్‌లో బెంగాల్ - నాగపూర్ రైల్వే ఉద్యోగిగా రెండేళ్ళ ఉద్యోగం చేశారు. అక్కణ్నించి కాంగ్రెసు పార్టీ ప్రచారకుడిగా జీతానికి పని చేసారు. మళ్లీ బందరు చేరి ఇండియన్ డ్రెమెటిక్ కంపెనీకి నాటక రచయితగా పని చేసారు. సినిమా రంగానికి వచ్చిన తర్వాతనే ఆయనకు కీర్తితో బాటు ధనం కూడా చేకూరింది. 1971లో మరణించే వరకు సినిమా రంగాన్ని వదిలిపెట్టలేదు.

పింగళి దేశభక్తుడు కూడా. గాంధీగారి ఉద్యమం ముమ్మరంగా సాగే రోజుల్లో 'జన్మభూమి' అనే పద్యకావ్యం రాస్తే బ్రిటిష్ వాళ్లు రాజద్రోహనేరం క్రింద అరెస్టు చేసారు. ఖరగ్‌పూర్‌లో రైల్వే కార్మిక సంఘాన్ని స్థాపించి నాయకత్వం వహించారు. 'జేబున్నిసా' అనే నాటకం రాస్తే బ్రిటిషు ప్రభుత్వం దాన్ని నిషేధించింది. గాంధీగారి సబర్మతీ ఆశ్రమంలో చేరి కొన్నాళ్లు ఉన్నారు.

పింగళి తల్లి మహాలక్షమ్మగారు కవయిత్రి. చెళ్ల పిళ్ల, ముట్నూరి కృష్ణారావు గార్ల సాహచర్యంలో పింగళికి సాహిత్యంలో ఆసక్తి కలిగింది. ఖరగ్‌పూర్‌లో ఉండగా బెంగాలీ నేర్చుకుని ద్విజేంద్రలాల్‌రాయ్ రాసిన 'మేవాడ్ పతన్' 'పాషాణి' నాటకాలను తెలుగులోకి అనువదించారు. ఆస్కార్ వైల్డ్ నాటకం 'డ బౌస్ ఆఫ్ పడువా' ఆధారముగా ఇండియన్ డ్రెమెటిక్ కంపెనీకి 'వింధ్యరాణి' రాసారు. షేక్స్పియర్ 'కింగ్‌లియర్' పై ఆధారపడి రాసిన 'గుణసుందరి కథ' ద్వారా వాహినీ వారికి పరిచయం అయ్యారు. 'పాతాళాభైరవి'కి అల్లాఉద్దీన్ - అద్భుతదీపం కథ ప్రేరణనిచ్చిందనుకోవచ్చు.

సినీ రచయితగా పేరువచ్చినా పింగళి ప్రధానంగా నాటక రచయిత. డి.వి.సుబ్బారావు గారి ఇండియన్ డ్రెమెటిక్ కంపెనీకి 'వింధ్యరాణి' 'నారాజు' (శ్రీ కృష్ణదేవరాయులపై) 'మరో ప్రపంచం' (సాంఘిక నాటకం) 'రాణీసంయుక్త' (చరిత్రాత్మకం) రాసారు. చరమదశలో 'క్షాత్రబిందు' ఒకే కుటుంబం అనే నాటకాలు రాసి ప్రచురించారు. ఈయన రాసిన అముద్రిత నాటకాల ప్రతులు డి.వి.సుబ్బారావు గారి కుమారుల వద్ద బందర్లో ఇంకా ఉన్నాయట!

పింగళి అనగానే విజయా వారికి ఆస్థాన రచయితగా గుర్తుకు వచ్చినా ఆయన సినీ రంగప్రవేశం 'వింధ్యారాణి'తో (1948) జరిగింది. నాటక రంగంపై విజయవంతమైన 'వింధ్యరాణి' నాటకాన్ని డి.వి.సుబ్బారావుగారినే హీరోగా పెట్టి వైజయంతి మూవీస్ వారు సినిమాగా తీసారు. అదికాకుండా 'భలేపెళ్లి' అనే సినిమాకు కథ, మాటలు, పాటలు ఆయనే! ఆ రెండు సినిమాలు ఫ్లాపే వాహినీవారి 'గుణసుందరి కథతో పింగళి దశ తిరిగింది.

పాతాళభైరవి, చంద్రహారం, మాయాబజారు, జగదేకవీరునికథ, ఉమాచండీ గౌరీశంకరుల కథ, భాగ్యచక్రం, పెళ్లినాటి ప్రమాణాలు, శ్రీకృష్ణార్జున యుద్ధం, సత్యహరిశ్చంద్ర చిత్రాలకు మాటలు, పాటలు రాసారు. మిస్సమ్మ, అప్పుచేసి పప్పుకూడు, గుండమ్మకథ, సి.ఐ.డి., సినిమాలకు పాటలు రాసారు. ఎన్.టి.ఆర్‌కి 'శ్రీకృష్ణసత్య' చేశారు. ఇతరులకు మహామంత్రి తిమ్మరసు, శ్రీఆంధ్ర మహావిష్ణువు కథ, ప్రమీలార్జునీయంకు పని చేసారు. వీటిలో 90 శాతం సినిమాలు విజయం సాధించినవే! ఇవి కాక అగ్గిమీద గుగ్గిలం అనే జానపద చిత్రంలో రెండు పాటలు, సింగీతం శ్రీనివాసరావు తొలి సాంఘిక చిత్రం నీతి నిజాయితీలో ఒక పాట రాశారు.

### పింగళి డైలాగులు

| | |
|---|---|
| సాహసం శాయరా | (పాతాళభైరవి) |
| నరుడా ఏమి నీ కోరిక | (పాతాళభైరవి) |
| నిజం చెప్పమంటారా అబద్ధం చెప్పమంటారా? - | (పాతాళభైరవి) |
| తప్పతప్ప | (పాతాళభైరవి) |
| డింగరి /డింభక | (పాతాళభైరవి) |
| పేరుకు అగ్రనాయకులు | |
| ఆ మాత్రం అనలేరూ నోరు తిరగదూ | (మాయాబజార్) |
| అదే మన తక్షణ కర్తవ్యం | (మాయాబజార్) |
| ముక్కోపానికి విరుగుడు ముఖస్తుతి ఉండనే ఉంది | (మాయాబజార్) |
| ప్రతాపవంతులకు ఎక్కడున్నా కుశలమే | (మాయాబజార్) |
| రసపట్టులో తర్కం కూడదు | (మాయాబజార్) |
| మీరు ధర్మాత్ములు కారని తేలినా అన్నగారితో | |
| ప్రమాదమేనే | (మాయాబజార్) |
| మీ శాస్త్రాలు సామాన్యుల కోసం కౌరవుల వంటి | |
| అసాధారణ అపూర్వ జాతకుల కోసం కాదు | (మాయాబజార్) |
| వివాహ కార్యక్రమానికి అతిముఖ్యమైన | |
| చిట్టచివరి క్రియ ఇది... అంటే అంత్యక్రియలు | (మాయాబజార్) |
| ఐశ్వర్యం పోతేనేం... ప్రతాపాలెక్కడ పోతాయనుకున్నాడు? | (మాయాబజార్) |
| ఎంతమద మెంత కావర మెంత పొగరు | (మాయాబజార్) |
| నీ శాసతరం (శాస్త్రం) సొంత తెలివి లేని వాళ్ళకి | (మాయాబజార్) |
| మీరు ఉద్దండ పండితులే గాని ఉండవలసిన | |
| బుద్ధిమాత్రం లేదయ్యా | (మాయాబజార్) |
| గోంగూర -శాకాంబరీ దేవి ప్రసాదం | (మాయాబజార్) |
| బెదిరితే వీరపత్ని కాజాలదు | (మాయాబజార్) |
| మీకు సహాయపడక ఆయుధాలు వాటి పరువు దక్కించుకొంటున్నాయి. | (మాయాబజార్) |

### పాత్రలకు పింగళి పెట్టిన పేర్లు

| | |
|---|---|
| సదాజపుడు | (పాతాళభైరవి) |
| నేపాళీమాంత్రికుడు | (పాతాళభైరవి) |
| తోటరాముడు | (పాతాళభైరవి) |
| ఎంతచెబితే అంతేగాళ్ళు | (చంద్రహారం) |
| నిక్షేపరాయుడు | (చంద్రహారం) |
| ఆట కోటి దెయ్యాలు | (జగదేకవీరుని కథ) |
| ఏకాశ | (జగదేకవీరుని కథ) |
| రెండుచింతలు | (జగదేకవీరుని కథ) |
| త్రిశోకానందుడు | (జగదేకవీరుని కథ) |


తెలుగుదనం జిలుగు వెలుగులను
సొగసుగా అందించిన
పింగళి నాగేంద్రరావు
జయంతి (డిసెంబరు 29) సందర్భంగా
ఓ పన్నెండు పాటలు

**చిత్రం: అప్పుచేసి పప్పుకూడు**

**సంగీతం: యస్.రాజేశ్వరరావు. గానం:ఘంటసాల,ఏ.ఎం.రాజా,లీల**

ప: సుందరాంగులను చూసిన వేళల
కొందరు ముచ్చట పడనేల
కొందరు పిచ్చను పడనేల
అ: అందము ప్రాయము ఐశ్వర్యము గల
సుందరి దొరకుటె అరుదుకదా ॥అంద॥
ముందుగ ఎవరిని వరించునోయని
తొందరలో మతి పోవుకదా ॥సుంద॥
హృదయము నందలి ప్రేమగీతమే
మధురముగా వినిపించు గదా ॥హృద॥
మందహాసమున మనసును దెలిపే
ఇందువదన కనువిందుగదా
ఆ: ప్రేమ పరీక్షలు జరిగేవేళల
కొందరు పరవశ పడనేల
కొందరు కలవర పడనేల
అ: యువతి చెంత పరపురుషుడు నిలిచిన
భావావేశము కలుగుగదా ॥యువ॥
ప్రేమ పందెమును గెలిచేవరకు
నా మది కలవర పడునుగదా ॥ప్రేమ॥
కోయిల పలుకుల కోమలి గాంచిన
తీయని తలపులు కలుగుగదా ॥కోమలి॥
వరము లొసంగే ప్రేమ దేవిగన
పరవశమే మది కలుగుగదా ॥సుంద॥

**చిత్రం: గుండమ్మ కథ**

**సంగీతం: ఘంటసాల గానం: ఘంటసాల, పి.సుశీల**

వేషము మార్చెనూ, భాషనూ మార్చెనూ
మోసము నేర్చెనూ అసలు తానే మారెను.
అయినా మనిషి మారలేదు, అతని మమత తీరలేదు
క్రూరమృగమ్ముల కోరలు తీసెను,
ఘోరారణ్యము లాక్రమించెను
హిమాలయముపై జండా పాతెను,
ఆకాశంలో షికారుచేసెను
అయినా మనిషి మారలేదు, ఆతని కాంక్ష తీరలేదు
పిడికిలి మించని హృదయములో,
కడలిని మించిన ఆశలు దాచెను
వేదిక లెక్కెను వాదము చేసెను,
త్యాగమె మేలని బోధలు చేసెను
అయినా మనిషి మారలేదు, ఆతని బాధ తీరలేదు.
వేషము మార్చెను, భాషను మార్చెను
మోసము నేర్చెను, తలలే మార్చెను
అయినా మనిషి మారలేదు, ఆతని మమత తీరలేదు.

**చిత్రం: మిస్సమ్మ**

**సంగీతం: యస్.రాజేశ్వరరావు గానం: ఎ.ఎం.రాజా**

తెలుసుకొనవె యువతీ -
అలా నడుచుకొనవె యువతీ
తెలుసుకొనవె యువతీ -
యువకుల శాసించుటకే
యువకుల శాసించుటకే...
యువతు లవతరించిరని ॥తెలుసు॥
సాధింపులు -బెదరింపులు
ముదితల కిక కూడవని ॥సాధింపులు॥
హృదయమిచ్చి పుచ్చుకునే ॥హృదయమిచ్చి॥
చదువేదో నేర్వాలని ॥తెలుసు॥
మూతి బిగింపులు - అలకలు
పాతపడిన విద్యలనీ ॥మూతి బిగింపులు॥
మగువలెపుడు - మగవారిని ॥మగువలెపుడు॥
చిరునవ్వుల గెలవాలని ॥తెలుసు॥

**చిత్రం: మాయాబజార్**

**సంగీతం: ఘంటసాల. గానం: ఘంటసాల, సుశీల**

ఆ: నీ కోసమె నే జీవించునది
ఈ విరహములో ఈ నిరాశలో
వెన్నెల కూడా చీకటి యైనా
మనసున వెలుగే లేక పోయినా ॥నీ కోసమె॥
అ: విరహము కూడా సుఖమే కాదా
నిరతము చింతన మధురము కాదా
వియోగ వేళల విరిసే ప్రేమల
విలువలు కనలేవా -
నీ రూపమె నే ధ్యానించునది
నా హృదయములో నా మనస్సులో ।నీ కోసమె॥
ఆ: హృదయము నీతో వెడలిపోయినా
మదిలో ఆశలు మాసిపోయినా
మన ప్రేమలనే మరి మరి తలచి
ప్రాణము నిలుపు కొనీ ॥నీ కోసమే॥
అ: మెలకువనైనా కలలో నైనా
కొలుతును నిన్నే ప్రణయదేవిగా
లోకములన్నీ ఏకమెయైనా
ఇక నాదానవెగా
నీ రూపమె నే ధ్యానించునది
ఆ: ఈ విరహములో, ఈ నిరాశలో
నీ కోసమె నే జీవించునది

**చిత్రం: అప్పుచేసి పప్పుకూడు**

**సంగీతం: ఘంటసాల** **గానం: ఘంటసాల**

ఓ... భావి భారత భాగ్య విధాతలారా
యువతీ యువకులారా
స్వానుభవమున చాటు నా సందేశమిదే
వారెవ్వా...
తాదిన్న తకదిన్న తాంగిటకతక తరికిటకతోం
పెళ్ళి చేసుకుని ఇల్లు చూసుకుని
చల్లగ కాలం గడపాలోయ్
ఎల్లరి సుఖము చూడాలోయ్
మీరెల్లరు హాయిగ ఉండాలోయ్
కట్నాల మోజులో మన జీవితాలనే బలిచేసి
కాపురములు కూల్చు ఘనులకు శాస్తి కాగా
పట్నాల పల్లెల దేశదేశాల మన పేరు చెప్పకొని
ప్రజలు సుఖపడగా
తాధిన్న తకిధిన్న తాంగిటతక తరికిట కతోం
ఇంటా బయటా జంట కవులవలె
అంటుకు తిరగాలోయ్... తరంపం... ॥ఇంటా॥
కంటి పాపలై దంపతులెపుడు
చంటి పాపలను సాకాలోయ్ ॥కంటి॥ ॥పెళ్ళి॥
నవ భావములా నవరాగములా
నవ జీవనమే నడపాలోయ్
నవ భావములా నవరాగములా
నవ జీవనమే నడపాలోయ్
భావ కవుల వలె ఎవరికి తెలియని
ఏవో పాటలు పాడాలోయ్ ॥భావ॥ ॥పెళ్ళి॥

**చిత్రం: మిస్సమ్మ**

**సంగీతం: యస్.రాజేశ్వరరావు.** **గానం:ఏ.ఎం.రాజా**

ఔనంటే కాదనిలే
కాదంటే ఔననిలే
ఆడువారి మాటలకు
అర్థాలే వేరులే
అర్థాలే వేరులే... అర్థాలే వేరులే ॥ఔనంటే॥
అలిగి తొలగి నిలిచినచో
చెలిమిచేయ రమ్మనిలే
చొరవచేసి రమ్మనుచో
మరియాదగ పొమ్మనిలే ॥ఆడు॥
విసిగి నసిగి కసిరినచో
విషయ మసలు ఇష్టమెలే
తరచి తరచి పూసడిగిన
సరసమింక చాలనిలే ॥ఆడు॥

**చిత్రం: మిస్సమ్మ**

**సంగీతం: యస్.రాజేశ్వరరావు.** **గానం: పి.లీల**

తెలుసుకొనవె చెల్లీ -
అలా - నడుచుకొనవె చెల్లీ ॥తెలుసు॥
మగవారికి దూరముగ
మగువలెపుడు మెలగాలని ॥తెలుసు॥
మనకు మనమె వారికడకు
పనియున్నా పోరాదని
అలుసుజేసి నలుగురిలో
అలుసుజేసి నలుగురిలో
చులకనగా చూచెదరని ॥తెలుసు॥
పదిమాటల కొకమాటయు
బదులు చెప్పకూడదని
లేనిపోని అర్థాలను -
మన వెనుకనె చాటెదరని ॥తెలుసు॥

**చిత్రం: మహామంత్రి తిమ్మరుసు**

**సంగీతం: పెండ్యాల** **గానం: యస్.వరలక్ష్మి, పి.సుశీల**

తిరుమల తిరుపతి వెంకటేశ్వరా
కూరిమి వరముల కురియుమయా... ఓ ॥తిరుమల॥
చెలిమిని విరిసే అలమేల్ మంగమ
చెలువములే ప్రియ సేవలయా ॥తిరుమల॥
నయగారాలను నవమల్లికల
మమకారాలను మందారములా ॥నయ॥
మంజుల వలపుల మలయానిలములు ॥మంజుల॥
వింజామరమున వీతుమయా ॥తిరుమల॥
ఆశా రాగమే ఆలాపనగా... ఆ... ॥ఆశా॥
సరస రీతుల స్వరమేళనలా
రిసరి నిదపద మగరిగరిస
మగరిస దపమగరిస
సనిదపమగరిస
మపనిసరి మగ మర్రి గస్సరి నిసరి నిద్ద
మపధ మాగ్గరి
పమరి నినిప దదని రిరిస
మగరిగ నిసరి నిదపమనిస
నిసరి నిదపమదప
దపద మగరి గరిస
ఆశా రాగమే ఆలాపనగా
సరస రీతుల స్వరమేళనలా
అభినయ నటనలే ఆరాధనగా ॥అభినయ॥
ప్రభునలరించి తరింతుమయా ॥తిరుమల॥

**చిత్రం: శ్రీకృష్ణార్జున యుద్ధం**

**సంగీతం: పెండ్యాల** **గానం: ఘంటసాల,పి.సుశీల**

అ: మనసు పరిమళించెనే తనువు పరవశించెనే
నవ వసంత గానముతో నీవు నటన సేయగనే
ఆ: మనసు పరిమళించెనే తనువు పరవశించెనే
నవ వసంత రాగముతో నీవు చెంత నిలువగనే ॥మ॥
అ: నీకు నాకు స్వాగత మనగ
కోయిలమ్మ కూయగా
ఆ: గలగల సెలయేరులలో
కలకలములు రేగగా ॥మ॥
అ: క్రొత్త పూల నెత్తావులతో
మత్తుగాలి వీచగా
ఆ: భ్రమరమ్ములు గుములు గుములుగా
ఝుం ఝుమ్మని పాడగా ॥మ॥
అ: తెలిమబ్బులు కొండ కొనలపై
హంసలవలె ఆడగా
ఆ: రంగరంగ వైభవములతో
ప్రకృతి విందు సేయగా
ఇ: మనసు పరిమళించెనే
తనువు పరవశించెనే

**చిత్రం: శ్రీకృష్ణార్జున యుద్ధం**

**సంగీతం: పెండ్యాల** **గానం:బి.గోపాలం, స్వర్ణలత.**

అ: అంచెలంచెలు లేని మోక్షము
చాల కష్టమె భామినీ
ఆ: కష్టమైనను ఇష్టమేనని
కోరినిలచితి చినమునీ
అ: అయిన కుదురుగ ఎదుట కూర్చుని గాలిగట్టిగ పీల్చుమా
ఆ: స్వామీ - స్వామీ
అ: ఏమి? ఏమి?
ఆ: నేను పీల్చినగాలి నిలువక అకటా మీపై విసిరెనే
అకటా మీపై విసిరెనే
అ: అందు కేమరి ॥అంచె॥
అ: అయిన కన్నులు మూసి చూపును ముక్కు కొనపై నిలుపుమా
ఆ: స్వామీ - స్వామీ
అ: ఈ మారేమి?
ఆ: అచట నిలువక చూపులన్నీ అయ్యో మీపైదూకెనే
అయ్యో మీపైదూకెనే
అ: అదేమరి
అ: అంచాలంచెలు లేనీ మోక్షము చాలా కష్టమె భామినీ
ఆ: కష్టామైనను ఇష్టామేనని కోరినిలచితి చినమునీ

**చిత్రం: పెళ్ళినాటి ప్రమాణాలు**

**సంగీతం: ఘంటసాల** **గానం: ఘంటసాల, పి.లీల**

వెన్నెలలోనె వేడి ఏలనో
వేడిమిలోనె చల్లనేలనో
ఏమాయ ఏమో జాబిలీ
ఈమాయ ఏమో జాబిలీ
వెన్నెలలోనె విరహమేలనో
విరహములోనే హాయి ఏలనో
ఏ మాయ ఏమో జాబిలీ
ఈ మాయ ఏమో జాబిలీ
మొన్నటికన్నా నిన్న వింతగా
నిన్నటికన్నా నేడు వింతగా
ఓ హోహో ఓఓ ॥మొన్నటి॥
నీ సొగసూ నీ వగలూ
హాయి హాయిగా మెరిసేనే ॥వెన్నెల॥
రూపముకన్నా చూపు చల్లగా
చూపులకన్నా చెలిమి చల్లగా
ఓ హోహో ఓ ఓ ॥రూపము॥
నీ కళలూ నీ హొయలు
చల్ల చల్లగా విరిసేనే ॥వెన్నెల॥

**చిత్రం: మిస్సమ్మ**

**సంగీతం: యస్.రాజేశ్వరరావు** **గానం:పి.లీల**

కరుణించు మేరీమాతా
శరణింక మేరిమాతా - నీవే
శరణింక మేరిమాతా ॥కరుణించు॥
పరిశుద్ధ ఆత్మమహిమ
వరపుత్ర గంటివమ్మా
ప్రభు ఏసునాధు కృపచే
మా భువికి కలిగె రక్ష ॥కరుణించు॥
గురిలేని దారిజేరి
పరిహాసమాయె బ్రతుకు
క్షణమైన శాంతిలేదే
దినదినము శోధనాయే ॥కరుణించు॥

పాత్రల పరిధులను, సన్నివేశాల బిగింపులను దాటి అప్పుడు, ఇప్పుడు మాత్రమే కాక భవిష్యత్తులో అన్వయించుకున్నా సరే సరిపోయే స్థాయి ఈ పన్నెండు పాటల ప్రత్యేకత!

# ఎన్నో గీతాలకు ప్రాణప్రతిష్ఠ చేసిన
# మహానటి సావిత్రి అభినయించిన ఓ పన్నెండు పాటలు...



## ◆◆◆ సావిత్రి హిట్ సాంగ్స్ (సోలో)◆◆◆

చిత్రం: డాక్టర్ చక్రవర్తి | రచన: ఆత్రేయ
సంగీతం: యస్.రాజేశ్వరరావు | గానం: సుశీల

పాడమని నన్నడుగతగునా
పదుగురెదుటా పాడనా
కృష్ణా పదుగురెదుటా పాడనా
పాదలమాటున పొంచిపొంచి
ఎదను దోచిన వేణుగానము
ఒలకబోసిన రాగసుధకు
మొలకలెత్తిన లలితగీతి... ॥పాడ॥
చిలిపి అల్లరి తెలిసినంతగ
వలపు తెలియని గోపకాంతలు
మెచ్చలేరీ వెచ్చనీ
హృదయాల పొంగిన మధురగీతి... ॥పాడ॥
ఎవరులేని యమునాతటినీ
ఎక్కడో ఏకాంతమందున
నీవు నేనై నేను నీవై... ఆ... ఆ... ఆ...
నీవు నేనై నేను నీవై
పరవశించే ప్రణయగీతి...
పాడమని నన్నడుగతగునా
పదుగురెదుటా పాడనా
కృష్ణా పదుగురెదుటా పాడనా

చిత్రం: గుండమ్మ కథ | రచన: పింగళి నాగేంద్రరావు
సంగీతం: ఘంటసాల | గానం: సుశీల

అలిగిన వేళనె చూడాలి
గోకుల కృష్ణుని అందాలూ
అలిగిన వేళనే చూడాలి
రుసరుస లాడే చూపులలోనే
రుసరుస లాడే చూపులలోనే
ముసిముసి నవ్వుల చందాలూ ॥అలిగిన॥
అల్లన మెల్లన నల్ల పిల్లివలె
వెన్నను దొంగిల గజ్జలు ఘల్లన
తల్లి మేలుకొని దొంగను చూసి... ఆ... ఆ...
తల్లి మేలుకొని దొంగను చూసి
అల్లరిదేమని అడిగినందుకే ॥అలిగిన॥
మోహన మురళీగానము వినగా
తహతహ లాడుచు తరుణులు రాగా
దృష్టి తగులునని జడిసి యశోద... ఆ... ఆ...
దృష్టి తగులునని జడిసి యశోద
తనను చాటుగా దాచినందుకే ॥అలిగిన॥

## ◆◆◆ సావిత్రి హిట్ సాంగ్స్ (సోలో)◆◆◆

చిత్రం: మాంగల్యబలం | రచన: శ్రీశ్రీ
సంగీతం: మాస్టర్ వేణు | గానం: పి.సుశీల

తెలియని ఆనందం నాలో
కలిగినదీ ఉదయం / పరవశమై పాడే నా హృదయం ॥తెలియని॥
కల కల లాడెను వసంత వనము
మైమరపించెను మలయా నిలము
తీయని ఊహల ఊయల లూగి
తేలే మానసము
ఏమో ॥తెలియని॥
రోజూ పూచే రోజా పూలు
ఒలికించినవి నవరాగాలు ఆ... ఆ...
పరిచయమైన కోయిల పాటే
కురిసే అనురాగం
ఏమో ॥తెలియని॥
అరుణ కిరణముల గిలిగింతలలో
కరిగిన తెలిమంచు తెరలే తరలి
ఎరుగని వింతలు ఎదుటే నిలిచి
వెలుగే వికసించే
ఏమో ॥తెలియని॥

చిత్రం: పాండవ వనవాసం | రచన: సముద్రాల
సంగీతం: ఘంటసాల | గానం: పి.లీల

కృష్ణా ! కృష్ణా! కృష్ణా!
దేవా ! దీనబాంధవా!
అసహాయురాలరా! కావరా ॥దేవా॥
కాలుని అయినా కదనములోనా
గెలువజాలిన నా పతులూ
ధర్మబంధము త్రెంచగలేక
మిన్నకుండేరుస్వామీ
నిన్నే మదిలో నమ్ముకొనేరా
నీవే నా దిక్కు రారా ॥దేవా॥
మకరిపాలై శరణమువేడిన
కరినికాపాడినావే
హిరణ్యకశిపు తామసమణచి
ప్రహ్లాదు రక్షించినావే
కుమతులు చేసే ఘోరమునాపి
కులసతి కాపాడలేవా ॥దేవా॥
గోవిందా! గోపీ జన ప్రియా!
శరణాగత రక్షకా! పాహిమాం పాహి! పాహి!
కృష్ణా

**చిత్రం: నమ్మినబంటు** **రచన: కొసరాజు**
**సంగీతం: యస్.రాజేశ్వరరావు** **గానం: పి.సుశీల**

చెంగు చెంగునా గంతులు వేయండీ
ఓ - జాతివన్నె బుజ్జాయిల్లారా
నోరులేని తువ్వాయిల్లారా ॥చెంగు॥
రంగు రంగుల ఓపరాలతో-రంకెలువేసే రోజెపుడో
చెక చెక మంటూ అంగలువేసీ-చేలనుదున్నే అదనెపుడో
కూలిపోయినా సంసారానికి-గోగాకింత పెట్టేదెపుడో
ఆశలన్ని మీ మీద బెట్టుకొని
తిరిగే మా వెతలణగే దెపుడో ॥చెంగు॥
పంచభక్ష్య పరమాన్నం తెమ్మని
బంతిని గూర్చుని అలగరుగా
పట్టుపరుపులను వేయించండని-పట్టుబట్టి వేధించరుగా
గుప్పెడు గడ్డితో-గ్రుక్కెడు నీళ్లతో
తృప్తిచెంది తలలూగిస్తారూ-జాలిలేని నరపశువులకన్నా
మీరే మేలనిపిస్తారూ ॥చెంగు॥
పగలనకుండా రేయకుండా-పరోపకారం చేస్తారూ
వెన్ను గాచి మీ యజమానులపై-విశ్వాసం జూపిస్తారూ
తెలుగుతల్లికీ ముద్దుబిడ్డలు-సంపద బెంచే జాతిరత్నములు
మా ఇలవేల్పులు మీరు లేనిదే
మానవజాతికి బ్రతుకే లేదు ॥చెంగు॥

**చిత్రం: నర్తనశాల** **రచన: సముద్రాల**
**సంగీతం: సుసర్ల దక్షిణామూర్తి** **గానం: పి.సుశీల**

ప: సఖియా వివరించవే
వగలెఱిగిన చెలునికి నా కథా
సఖియా వివరించవే॥
చ: నిన్నుజూచి కనులు చెదరి
కన్నెమనసు కానుకజేసి :
మరువలేక మనసు రాక
విరహాన చెలి కాన వేగేననీ ॥సఖియా॥
మల్లెపూలా మనసు దోచి
పిల్లగాలి వీచేవేళ
చలువ రేని వెలుగులోనా
సరసాల సరదాలు తీరేననీ ॥సఖియా॥

**చిత్రం: మురిపించే మువ్వలు.** **రచన: ఆరుద్ర**
**సంగీతం: ఎస్.ఎం.సుబ్బయ్యనాయుడు.** **గానం: ఎస్.జానకి**

నీ లీల పాడెద దేవ
మనవి ఆలించ వేడెదదేవ
నను లాలించు
మా ముద్దు దేవ ॥నీ లీల॥
సిందూర రాగంపు దేవ
దివ్య శృంగార భావంపు దేవ
వళ్లి చెలువాలు
నినుకోరు నీవురావ - ఎలమి ॥నీ లీల॥
అనుపమ వరదాన శీల
వేగ కనుపించు కరుణాలవాల ॥నీ లీల॥
1. సగమపని ॥నీ లీల॥
2. నిస్సనిదపమ గామగరిసని పానిసగమప
మగరిస నిదమపగరిని ॥నీ లీల॥
3. సారిస్స నిసరిస్స నినిస పపనినిస మమపపనినిస
గగసగగస నినిస పపని మమప
గగమమపపనినిసస గరినిస
4. పానిదపమ గరిసని సగగ్గ సగగ్గ సగమపగరిసని సగస
నినిప మమప నినిప నినిపస పనినిపస నిదగరిసనిసగస
5. గామపానిసా
నిసగరిసరిని సారిసనీ రీగరినీ సారిసనీ
గరినిగ్గరిగ నిరిగరి నిగరినీ
నిరిరి నిసస నిరిరి నిసస నిదపా
నిన్నిసా ఆ.... అ... ఆ.....
రిన్నీసపాని మాప గామపనిసరి ఆ..... అ.....
సాని పానీ సారిసనీ సారిసనీ
పానిపస పానిపని మాపమ పానిప నీపనిస పానిపనీపస
మగా పమా
సారిసనీ నీసనిసా సారిసనీ
సారిససారిససారిసగరిగరిసని గరిసనిస రిస్సనిదమ పనిపమ
సానిదపమ పనిపమ గరిరిస సగమపా గమపనిపా
సనిగరిసనిపరీ సరిసనిసా సనిగరిరిసనిదమపని ॥నీ లీల॥

**చిత్రం: ఆరాధన** **రచన: నార్లచిరంజీవి** **సంగీతం: యస్. రాజేశ్వరరావు** **గానం: సుశీల**

ప: నీ చెలిమీ నేడె కోరితిని
ఈ క్షణమే ఆశ వీడితిని ॥నీ చెలిమి॥
పూవువలె ప్రేమ దాచితిని
పూజకు నే నోచనైతిని ॥నీచెలిమి॥
చ: మనసు తెలిసిన మన్నింతువని
తీయని ఊహల తేలితి నేనే ॥మనసు॥
పరులసొమ్మై పోయినావని
నలిగె నా మనసే ॥నీచెలిమి॥
చ: చెదిరిపోయిన హృదయములోన
పదిలపరచిన మమతలు నీకే ॥చెదిరి॥
భారమైనా దూరమైనా
బ్రతుకు నీకొరకే ॥నీచెలిమి॥

## ◆◆◆ సావిత్రి హిట్ సాంగ్స్ (సోలో)◆◆◆

**చిత్రం: మంచిమనసులు** **రచన: ఆరుద్ర**
**సంగీతం: కె.వి.మహదేవన్** **గానం: పి.సుశీల**

ఏమండోయ్ శ్రీవారూ? ఒక చిన్నమాట
ఏ ఊరు వెళతారు ఏదీకాని వేళ
పసివాని చూచుట కీ తొందర
మైమరచి ముద్దాడి
లాలింతురా ఉళళళ హోయి
ఉళళ హోయి ఊహుహు ఊహుహు... ॥పసివాని॥
శ్రీమతికి బహుమతిగ ఏమిత్తురో
ఇచ్చేందుకేముంది మీ దగ్గరా ॥ఏమండోయ్॥
అబ్బాయి పోలిక ఈ తండ్రిదా
అపురూపమైన ఆ తల్లిదా
అయ్యగారి అందాలు రానిచ్చినా
ఈ బుద్ధి రానీకు భగవంతుడా ॥ఏమండోయ్॥
ప్రియమైన మా ఇల్లు విడనాడిపోతే
తలదాచుకొన మీకు తావైన లేదే అయ్యో పాపం
ప్రియమైన మా ఇల్లు విడనాడిపోతే
తలదాచుకొన మీకు తావైన లేదే
కపటాలు మానేసి నా మదిలోన
కాపురము చేయండి కలకాలము ॥ఏమండోయ్॥

**చిత్రం: చదువుకున్న అమ్మాయిలు** **రచన: దాశరథి**
**సంగీతం: యస్.రాజేశ్వరరావు** **గానం: పి.సుశీల**

ప: వినిపించని రాగాలే
కనిపించని అందాలే
అలలై మదినే కలచే
కలలో ఎవరో పిలిచే ॥వినిపించని॥
చ: తొలిచూపులు నాలోనే
వెలిగించే దీపాలే ॥తొలిచూపులు॥
చిగురించిన కోరికలే
చిలికించెను తావాలే
వలచే మనసే మనసు ॥వినిపించని॥
చ: వలపే వసంతములా
పులకించి పూసినది
చెలరేగిన తెమ్మెరలే గిలిగింతలు రేపినవి
విరిసే వయసే వయసు ॥వినిపించని॥
చ: వికసించెను నా వయసే
మురిపించే ఈ సొగసే
విరితేనెల వెన్నెలలో
కొరతేదో కనిపించే
ఎదలో ఎవరో మెరిసే ॥వినిపించని॥

## ◆◆◆ సావిత్రి హిట్ సాంగ్స్ (సోలో)◆◆◆

**చిత్రం: అర్థాంగి** **రచన: ఆత్రేయ**
**సంగీతం: భీమవరపు నరసింహారావు** **గానం: జిక్కి**

ప: వద్దురా కన్నయ్య
ఈ పొద్దు ఇల్లు వదిలి
పోవద్దురా అయ్య
పశువులింటికి తిరిగి
పరుగులెత్తే వేళ
పసిపాపలను బూచి
పట్టుకెళ్ళేవేళ ॥వద్దురా॥
చ: పట్టు పీతాంబరము
మట్టిపడి మాసేను
పాలుగారే మోము
గాలికే వాడేను ॥వద్దురా॥
చ: గొల్లపిల్లలు చాల
అల్లరివారురా
గోలచేసి నీపై
కొండెములు చెప్పేరు
ఆడుకోవలెనన్న
ఆదట నేనున్న పాడుకోవలెనన్న
అన్నిటను నీదాన ॥వద్దురా॥

**చిత్రం: బండరాముడు** **రచన: ఆత్రేయ**
**సంగీతం: సుసర్ల దక్షిణామూర్తి** **గానం: పి.సుశీల**

సాగిపోయే ఓ చందమామా,
ఆగుమా...
ఒకసారి ఆగుమా
ఒకసారి ఆగుమా ఓ చందమామా
మనసార నా మాట ఆలించి పొమ్మా
నీలిమబ్బుల తెరచాటు మాటున
మాటి మాటికి యిటు దాగనేల
ఎందుకో చనలేవు సూటిగా
ఎందుకో చనలేవు సూటిగా
ఎదలోన నీవైన యోచించుకొమ్మా ॥ఒకసారి॥
పరుల సొమ్మును హరియించు వాడే
పగటి పూటను యిలు వీడలేడోయ్
మంచిగా మనవోయి జాబిలి
మంచిగా మనవోయి జాబిలి
మలినమ్ము యికనైన తొలగించుకొమ్మా
మారేనా నీ మనసు ఓ చందమామ
మారేనా నీ మనసు ఓ చందమామ
ఓ చందమామ


డిసెంబరు 26
మహానటి సావిత్రి
వర్ధంతి సందర్భంగా...
హాసం